# అపరాధ పరిశోధన

రు. 3.50 సెప్టెంబర్ '79



అపరాధ పరిశోధన అనుబంధం—69

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## సరిదిద్దుకోలేని తప్పు
రచన : వసుంధర

## పగిలిన రమ్ బాటిల్
రచన : టెంపోరావ్

## బర్త్‌డే గిఫ్ట్
రచన : కె. వి. యస్. కుమార్

## అపరిచితుడి సలహా
రచన : మోదుకూరి జతీంద్రశర్మ

## అడుగు ముందుకువేస్తే చస్తావ్!
తొమ్మిదవ భాగము - రచన : వసుంధర

అపరాధ పరిశోధన సప్లిమెంటు—69
సెప్టెంబర్, 1979
వెల: రు. 3-50
ఏడాది చందా 49 రూపాయలు
జీవిత చందా 325 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామదామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్
శ్యాంబాబు
రమణశ్రీ
ఏ. వీ. మోహన్రావ్
సుజనశ్రీ
వసుంధర
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
ప్రగతి ఆర్ట్ ప్రింటర్స్,
హైదరాబాదు-4

# సరిదిద్దుకోలేని తప్పు

వసుంధర

ఆకలి వేస్తూంటే అప్రయత్నంగా హోటల్లో జొరబడ్డాను.

టేబుల్ దగ్గర కూర్చోగానే సర్వర్ మెనూ కార్డు అందించాడు. అందులోని అయిటమ్స్ వంక చూడ్డం మానేశాడు నేను. పక్కనున్న ధరల వంక చూస్తున్నాను. ధరలు చూస్తూంటే నాకు గుర్తుకువచ్చింది-నేను వచ్చింది ఖరీదైన హోటల్ కని! అయినా ఖరీదైన హోటళ్ళలో కాక మెనూకార్డు లింకెక్కడుంటాయి?

అది ఖరీదైన హోటల్ అని నాకు తెలుసు. అయితే ఇదివరలో చాలా పర్యాయాలు ఆ హోటల్‌కు వెళ్ళి వున్నాను నేను. అక్కడి టిఫిన్సంటే నాకు చాలా యిష్టం. చదువు పూర్తయ్యే వరకూనూ, పూర్తయిన మరో రెండేళ్ళ దాకా వరకూనూ నేనక్కడే టిఫిన్ తినేవాణ్ణి.

ఒక మధ్య తరగతి కుటుంబంలో ఇంటికి పెద్దకొడుకుగా పుట్టిన నేను ఒక సంవత్సరం క్రితం వరకూ ఎంతో వైభవం అనుభవించాను. నా తరువాత ఇద్దరు

తమ్ముళ్ళు, ఒక చెల్లెలు ఉన్నారు. పెద్దవాణ్ణి కాబట్టి ఇంట్లో సర్వాధికారాలూ నావే।

అధికారాన్నుపయోగించుకోవడం కూడా నాకు బాగా తెలుసు. నాన్నగారు సంపాదిస్తూండేవారు. నేనడిగిన దిచ్చేవారు. జోరుగా కాకపోయినా కాస్త దర్జాగానే ఖర్చు పెట్టుకునే వాణ్ణి. ఇంట్లో సమస్యలున్నాయని నాకు తెలియదు. తెలుసుకునే ప్రయత్నమేదీ కూడా నేను చేయలేదు.

నా తమ్ముళ్లు మంచి బట్టలు వేసుకోకపోతే వాళ్ళకు సరదాలు లేవనుకునేవాణ్ణి. జిడ్డు మొహాలని తిట్టేవాణ్ణి. చెల్లెలికి నగలు చేయించడం లేదని నాన్నగారితో దెబ్బ లాడేవాణ్ణి. బుద్ధుల్లో నేనూ చెల్లాయీ ఒకటి. దానిగురించి ఏమడిగినా-"నువ్వు సంపాదనపరుడివయ్యేక అది కోరిన వన్నీ ఇద్దువుగానిలే-'అనేది అమ్మ.

''నాకుద్యోగం వచ్చేక చెల్లెల్ని నగలతో నింపేస్తాను. దాని బట్టల కోసం పెద్ద స్టీలు బీరువా కొంటాను. ఆ బీరువాలో దాని బట్టలు మాత్రమే ఉంటాయి. అయినా నాలా కొనే అన్నయ్యున్నప్పుడు ఆ బీరువాలో ఇంకొకళ్ళ బట్టలు పెట్టడానికి కాళీ మాత్రం ఉండొద్దూ।'' అనేవాణ్ణి నేను.

అప్పటికి నాకు స్టీలు బీరువాల ధరల గురించీ, ఉద్యోగుల సంపాదనలగురించీ అంచనాలు తెలియవు. భవిష్యత్తుగురించిన బంగారు కలలొక్కటే ఉన్నాయి.

నా మాటలు వినగానే చెల్లెలి కళ్ళు మెరిసేవి. అమ్మ కూడా ఆనందించేది డబ్బు విలువ అంతగా తెలియకపోయినా-తోడబుట్టిన వాళ్ళంటే నాకెంతో అభి

మానమని అమ్మా నాన్నా చెప్పుకుని మురిసిపోయేవాళ్ళు.

చదువు పూర్తి అయిపోయింది. ఖర్చు విషయంలో నా ధోరణి మారలేదు కానీ డబ్బు ఇవ్వడంలో నాన్న ధోరణి మారింది. ఆయన ఇంటి ఖర్చుల గురించీ బాధ్యతల గురించీ వివరించి చెప్పి-" 'చదువుకుంటూన్నప్పుడు నీకే కష్టమూ తెలియకూడదని "నువ్వడిగినదంతా ఇచ్చేవాణ్ని. ఇప్పుడు నువ్వు ఉద్యోగప్రయత్నాల్లో ఉండాలి. డబ్బును ఇదివరకటిలా ఖర్చు పెట్టకూడదు-'' అన్నాడు.

మొదట్లో ఈ మాటల్ని నేనంతగా పట్టించుకోలేదు. అందువల్ల ఇంట్లో అప్పుడప్పుడు చిన్నచిన్న ఘర్షణలు జరుగుతూండేవి సుమారు సంవత్సరం గడిచాకనే అసలు విషయం నాకు వంటబట్టింది. అప్పుడు నేను షాక్ తిన్నాను.

చెల్లాయి పట్టు పరికిణీ కావాలంది. నాన్న డబ్బులేదన్నారు. అది నాదగ్గరకువచ్చింది. ఇంతఖర్చు చేస్తున్నారు-అదొక్కటే కొనిస్తే పోదా అన్నాను నేను దాన్ని సమర్థిస్తూ.

నాన్న పట్టు పరికిణీకి ఎంతవుతుందో చెప్పారు. తన జీతం ఎంతో చెప్పారు. నెల ఖర్చులు వివరించారు. నా ఖర్చులు వివరించారు. చదువుకున్నవాడిగా, బాధ్యత లెరిగిన వాడిగా నా నిర్ణయం చెప్పమని చాలా ప్రశాంతంగా అన్నారు.

నాన్న ఇంక అయిదారేళ్ళలో రిటైరవనున్నారు. తనకు వచ్చే జీతంలో ఆయన ఎంతో గుట్టుగా సంసారం నడుపుకు వస్తున్నారు. ఆయన తన సంతానాన్ని ఎంతగానో ప్రేమిస్తున్నారు. గత ఇరవై ఏళ్లగా పిల్లల సౌఖ్యం

కోసం ఆయన, అమ్మ కలిపి ఎన్నో త్యాగాలు చేశారు.

అంతేకాదు. నాతమ్ముళ్లు కూడా ఇంటి పరిస్థితులర్థం చేసుకుని అమ్మా నాన్నలకు సహకరిస్తున్నారు. ఏ విధం గానూ ఇంటికి సహకరించనివాడ్ని నేనొక్కణ్ణే! నేను సహకరించకపోగా-చెల్లెల్ని కూడా రెచ్చగొట్టి వాళ్ళకు ఇబ్బంది కలిగిస్తున్నాను.

మా కుటుంబానికి నా ఖర్చులు కూడా ఒక సమస్య గానే ఉన్నాయి: ఇంటికి పెద్ద కొడుకుగా నేనిప్పుడు బాధ్యతలను కూడా స్వీకరించవలసి ఉంది. ఈ గుర్తింపు కలగ్గానే. నేను దిగాలుపడిపోయాను. అప్పట్నించీ సిని. మాలు చూడ్డం మానేశాను. హోటళ్ళకు వెళ్ళడం తగ్గించాను.ఉద్యోగం గురించి తీవ్ర ప్రయత్నాలారంభించాను.

ఉద్యోగం సంపాదించడ మన్నది ఎంత కష్టమైన విషయమో, నేను చదివిన బియ్యే చదువుకూ, నేను కంటున్న బంగారు కలలకూ ఏ విధంగా సంబంధంలేదో-అప్పుడే నాకు అర్థమైంది. అంత కాలం నేననుభవించిన వైభవం - నా ముందు జీవితాన్ని పరిహసిస్తున్నట్లని పించేది.

''అన్నయ్యా-నువ్వు త్వరగా ఉద్యోగంలో జేరిపోరా-నాకో స్టీలుబీరువా, దాన్నిండా బట్టలూ అంతవరకూ రావు" అని నా చెల్లెలు అంటూంటే నా కళ్ళలో నీళ్ళు తిరిగేవి. చెల్లెలు కోరుతున్న ఈ కోరిక ఎప్పటికి సాధ్యమవుతుంది?

ఊళ్ళోని ప్రముఖుల చుట్టూ తిరిగాను. అడ్డమైన వాళ్ళ కాళ్లు పట్టుకున్నాను. కనపడ్డ చోటికల్లా అప్లికేషన్ పడేశాను. ఒక్క ప్రయత్నమూ ఫలించలేదు....

మెనూకార్డు చూస్తూనే ఒక చేయి పాంటు జేబులోనికి పోనిచ్చాను. చేతి వేళ్ళకు ఒకే ఒక్క నాణెం తగులు తోంది. దాం విలువ ఇరవై అయిదు పైసలు. మెనూ కార్డులో నలభై పైసలకు తక్కువ వచ్చేదేదీ లేదు.

"ఏం కావాలి సార్ ?" అన్నాడు సర్వర్.

వెంటనే అక్కడ్నించి వెళ్ళిపోవడానికి మొహమాటం అనిపించింది.

"ముందు కాసిని మంచినీళ్ళు తీసుకురా –" అన్నాను.

సర్వర్ వెళ్ళగానే టేబిల్ మీదున్న పేపర్ చూశాను. అది చదువుతున్నట్లు నటిస్తూ ఆర్డరు మరి కాసేపు వాయిదావేయవచ్చు. పేపరు తీయగానే అప్రయత్నంగానే నా చేతి వేళ్ళు వాంటెడ్ కాలమ్స్ పేజీని తీశాయి. యథాలాపంగా చూస్తూండగా అందులోని ఒక కాలమ్ నన్నాకర్షించింది.

"మంచి నీళ్ళివిగో సార్!" అంటూ సర్వర్ నాలుగు గ్లాసుల మంచినీళ్ళు తెచ్చి టేబిల్‌మీద పెట్టాడు. ఒక్క నిముషం ఉండు అన్నట్లుగా వాడి వంక చూసి పేపర్లో నన్నాకర్షించిన విషయం మరోసారి చదువుకున్నాను.

"ఉద్యోగం లేక విసిగిపోయారా ? నా దగ్గరకు రండి. వచ్చిన పక్షంలో ఇంటర్వ్యూ అయిన వెంటనే ఉద్యోగం ఇస్తాను. ఇంటర్వ్యూ కాగానే ఫలితం వెంటనే చెప్ప బడుతుంది. సమర్థులెవ్వరికైనా అవకాశముంటుంది–"

క్రిందనే చిరునామా కూడా ఉంది. ఈ ఉద్యోగానికే ప్రకాశరావు పేటకు వెళ్ళవలసి ఉంది.

నాలో ఏ మూలో ఏదో ఆశ తళుక్కుమంది. నేను

ఎంతో శ్రద్ధగా వాంటెడ్ కాలమ్స్ చూస్తాను. ఈ రోజు కూడా చూశాను. ఎటొచ్చీ మాకు వచ్చేది ఇంగ్లీషు పేపరు. వాంటెడ్ కాలమ్స్ కోసం తెలుగు పేపరుచూసే వాళ్ళుంటారని నాకు తెలియదు. అప్రయత్నంగానే ఈ హోటల్లో అడుగు పెట్టడమూ, పేపర్ చూడడమూ జరిగింది. ఈ విధంగా ఈ ప్రకటన చూసే అవకాశం నాకు రావాల్సి ఉన్నదేమో!

'ఏం కావాలి సార్?' అన్నాడు సర్వర్ మళ్ళీ.

"మసాలా ఉప్మా ఉందా -" అన్నాను. ఆ సమయంలో ఆ హోటల్లో మసాలా ఉప్మా ఉండదని నాకు తెలుసు. తప్పించుకునే మార్గం కోసమే అది అడిగాను.

"లేదు సార్" అన్నాడు సర్వర్.

"ఈ మాత్రం దానికి మెనూ కార్డివ్వడం దేనికి? ఉన్నవేమిటో నోటితోనే చెప్పవచ్చు కదా!" అంటూ చిరాగ్గా లేచాను. మెనూ కార్డులో మసాలా ఉప్మా వుంది.

సర్వర్ నా వంక విచిత్రంగా చూశాడు. నేను హోటల్లోంచి బయటపడ్డాను.

# 2

ఆ ఇంటి ముందు చాలా మంది ఉన్నారు. అంత మంది జనాన్ని అక్కడ చూడగానే నాకు నిస్పృహ కలిగింది. ఇల్లు చాలా సామాన్యంగా ఉంది. ఆ ఇంట్లో వుండే వ్యక్తి ఏ మాత్రం మంచి ఉద్యోగమివ్వగలడు? ఎంతమందికివ్వగలడు?

లోపలకు వెళ్ళగానే ఒక్క వ్యక్తి నన్ను పలకరించాడు. అతను ఫుల్ సూట్‌లో ఉన్నాడు. ఖరీదైన మనిషి అని

తెలుస్తోంది. అయితే అతను కేవలం ఇంటర్వ్యూకు వచ్చిన వారి వివరాలు నోట్ చేసుకునేందుకు నియమించ బడ్డ వ్యక్తి. అతనికి నా వివరాలందజేస్తూండగానే నాలో మళ్ళీ ఆశలు రేగాయి.

సుమారు పదిహేను నిముషాల అనంతరం ఒక వ్యక్తి వచ్చి, -"ఇప్పుడు పది పేర్లు చదువుతాను. వారు తప్ప మిగతా వారంతా వెళ్ళిపోవచ్చు -" అన్నాడు.

అందరూ ఆత్రతగా చెవులు రిక్కించారు. నన్ను మళ్ళీ నిర్లిప్తత ఆవహించింది. అక్కడున్న అంత మందిలో ఓ పది మందిని మాత్రమే ఏరుకునే మాటయితే నాకో అవకాశం వస్తుందని అనిపించడం లేదు. అయినా అతను చదివే పేర్లు వింటున్నాను.

ఒక్కొక్క పేరు చదివినపుడల్లా నా గుండె వేగంగా కొట్టుకుంటోంది. అప్రయత్నంగానే నేను వేళ్ళు మడిచి ఎన్ని పేర్లు అయినవో లెక్కపెడుతున్నాను. ఒకటి... రెండు....మూడు....నా పేరు లేదు...నాలుగు....ఐదు.... ఆరు...నా పేరు లేదు....ఏడు...ఎనిమిది....నా పేరు లేదు....తొమ్మిది....అది నా పేరే....ఆశ్చర్యం....నా పేరే !

వేగంగా కొట్టుకుంటున్న నా గుండె ఆగిపోయినట్ల యింది. పదో పేరు నేను వినలేదు.

మిగతావారందరూ నిరుత్సాహంగా అక్కణ్ణించి వెళ్ళిపోయారు.

ఆ తర్వాత అక్కడ మిగిలిన ఒక్కొక్కరికీ ఇంటర్వ్యూ మొదలయింది.

ఒక్కొక్కరే లోపలికి వెళ్ళి వస్తున్నారు. కొంత

మంది అయిదు నిముషాల్లో వస్తున్నారు. కొంతమంది అరగంటవరకూ ఉండి వస్తున్నారు. అందరి ముఖాల్లోనూ ఆశ్చర్యం స్పష్టంగా కనబడుతోంది.

బయటకు వస్తున్న వారెవరినీ నేను ఇంటర్వ్యూ గురించి ప్రశ్నలు వేయలేదు. అదోరకమైన నిర్లిప్తత నన్నావహించింది. అసలీ ఉద్యోగం ఏమిటి? ఏ ఆధారంగా తక్కువ వ్యవధిలో అంతమంది జనంలోంచి పది మందిని ఏరగలిగారు? వాగిలోకి నేనెలా వచ్చాను? . . . ఇత్యాది ప్రశ్నలు నన్ను వేధిస్తున్నాయి. వీటికి సరైన సమాధానం దొరక్క ఇంటర్వ్యూపట్ల నిర్లిప్తత ఏర్పడిందేమో చెప్పలేను?

ఎనిమిదవ అభ్యర్థికి ఇంటర్వ్యూ అవుతుండగా ఆగిపోయిందనుకున్న నా గుండె మళ్ళీ కొట్టుకోవడం ప్రారంభమైంది.

ఆ అభ్యర్థి నాలుగు నిమిషాల్లోనే బయటకు వచ్చేశాడు. నా పేరు పిలవకుండానే కాళ్ళలో వణుకు ప్రారంభమైంది. పిలవగానే లేచినిలబడ్డాను. వణుకు శరీరమంతా పాకింది. ముందుకు కదిలి ఇంటర్వ్యూ గదిలోకి వెళ్ళాను.

ఆ గదిలో ఒక బల్ల రెండు కుర్చీలు ఉన్నాయి. ఒక కుర్చీ బల్లకవతల, రెండోది ఇవతల. అవతల కుర్చీలో ఒక మనిషి కూర్చున్నాడు. చూడ్డానికి సినిమాల్లో పెద్దమనిషిలా అనిపిస్తూ గ్యాంగ్ లీడర్‌గా మసిలే-విలన్లా ఉన్నాడు. మనిషి హుందాగా ఉన్నాడు కానీ చూపులు క్రూరంగా ఉన్నాయి.

నన్ను కూర్చోమని చెప్పాడావ్యక్తి. ఖాళీగా ఉన్న

కుర్చీలో కూర్చున్నాను.

'నేనడిగే ప్రశ్నలకు చాలా ఫ్రాంక్‌గా సమాధానా లివ్వాలి. తెలిసిందా?'

తలూపాను. చాలా ఇంటర్వ్యూలు ఫెయిలయ్యాక ఫ్రాంక్‌గా సమాధానాలివ్వడానికి భయం పోయింది. ఒకప్పుడు ఇంటర్వ్యూ అంటే ఉద్యోగం వస్తుందన్న ఆశ ఉండేది. ఇప్పుడు ఇంటర్వ్యూ అంటే గుడికి వెళ్ళడం వంటిది. మన మనసులోని కోరికలను గుడిలో దేవుడు తీరుస్తాడని మనకు ఎంత నమ్మకముంటుందో, ఆ దేవుడిపై ఎలాంటి విశ్వాసముంటుందో - అంతే నమ్మకమూ, అలాంటిదే విశ్వాసమూ నాకు ఇంటర్వ్యూ పట్ల ఏర్పడ్డాయి.

'నేనెలా ఉన్నాను?'- అనడిగాడతను.

'పెద్ద మనిషిలా-'

'సినిమాలో విలన్లా'- అని నవ్వాడతను.

'కొంచెం అలాకూడా ఉన్నారు-'అన్నాను - అతడి ముఖకవళికల్లో ఎలాంటి మార్పు వస్తుందా అని పరిశీలిస్తూ.

అతడు చలించకుండా'నా చూపులు ?' అన్నాడు.

'చూపులు కాస్త క్రూరంగా ఉన్నాయి. ఫ్రాంక్‌గా మాట్లాడమన్నారు కాబట్టి నిజం చెబుతున్నాను-' అన్నాను నాకు చేతనైన తెలివితేటలుపయోగించి.

'గుడ్!' అన్నాడతను - 'నేను నీకిచ్చే ఉద్యోగం ఎలాంటిదో తెలుసా'

'తెలియదు-'

'నా రూపం, నా చూపులు గలవాళ్ళు ఏయే పనులు

చేస్తారనిపిస్తుందో-అలాంటి పనులే చేయాలి. కానీ నా రూపం, నా చూపులు మాత్రం ఉండకూడదు. . . .'

'అర్థంకాలేదు-' అన్నాను. కానీ నాకు కాస్త అర్థమైనట్లే ఉంది.

'తర్వాత మళ్ళీ చెబుతాను. నేనీ ఉద్యోగానికి ఇంటర్వ్యూ చేయడానికి-వచ్చిన వారిలో పదిమందిని మాత్రమే ఎన్నుకున్నాను. కారణం తెలుసా?'

'తెలియదు. . . .'

'నాక్కావలసిన అభ్యర్థులు ఇంతవరకూ కనీసం పాతిక ఇంటర్వ్యూలకైనా హాజరై ఒక్క దాంట్లోకూడా సత్ఫలితం పొందనివారై ఉండాలి. వచ్చిన వారిలో అలాంటివారు పాతిక మందిదాకా తేలారు...'

'కానీ మీరు పదిమందినే ఉంచారు...' అన్నాను.

'అవును... ఆ పాతిక మందిలోనూ సచ్చరిత్రులు పదిమందే!' అన్నాడతను.

'సచ్చరిత్రులంటే?'

'మధ్యతరగతి కుటుంబాలకు చెందినవారు, మర్యాదస్తులు, నేరాలకు అమడ దూరంలో నడిచేవాళ్ళు...' అని నవ్వాడతను.

'అటువంటివారివల్ల మీకు ప్రయోజనం ?'

'సమాజం దృష్టిలోనూ, ప్రభుత్వం దృష్టిలోనూ నేరస్థులనబడేవారు ధనికుల్లోంచీ పేదలలోంచీ పుట్టుకు వస్తారు. నీతికి నిలబడేది మధ్య తరగతివారొక్కరే!....'

ఆయన ఆగాడు కానీ ఇంకా చెబుతాడని తెలిసి నేను వింటున్నాను.

'పెళ్ళయిన ఆడది వ్యభిచారం చేసినా, ఇంట్లోని

వాళ్ళె దొంగతనం చేసినా, నీలాంటి మర్యాదస్తులు మా బోంట్లకు సహకరించినా ఆ ఈశ్వరుడు కూడా పట్టలేడు. అదీ సంగతి।"

"మీ బోంట్లకు సహకరించడమంటే?"

"నా పని చేసి పెడుతున్నావు కాబట్టి నేను దాన్ని సహకారమనవచ్చు. ప్రతిఫలం ఉంటుంది కాబట్టి నువ్వు దాన్ని ఉద్యోగమనిపిలవ్వచ్చు. చట్టవిరుద్ధం కాబట్టి సమాజం దాన్ని నేరమనవచ్చు. రకరకాల ఈ పేర్లలో నువ్వు దేన్నయినావాడుకోవచ్చు. లేదా మరోకొత్త పేరుతో పిలవ్వొచ్చు. నా అభ్యంతరంలేదు..."

"జీతం ఎంత ఉంటుంది?"

జీతం సంగతి అడుగుతున్నావు కాబట్టి నీకు అభ్యంతరం లేదనుకోవచ్చు, జీతం నెలకు రెండు వేలు. అదైనా ఏపనీ లేనప్పుడు. పనితగిలినప్పుడు ఎక్స్ట్రాగా డబ్బు ముడుతుంది. నువ్వు మా మనిషివిగా ఉండటానికి అంగీకరించినందుకే నెలకు రెండు వేలిస్తామన్నమాట।"

"ఎక్స్ట్రా డబ్బు ఎంత ముడుతుంది।"

"చెప్పలేము. వెయ్యికి తగ్గదు. కానీ లక్షకూడా మించవచ్చు..."

భవిష్యత్తు గురించి నేను కన్న బంగారు కలలన్నీ నిజమవుతున్నట్లు తోస్తోంది. నా కళ్ళ ముందు నిండా బట్టలతో ఉన్న స్టీలు బీరువా హడావుడిగా సర్దుకుంటున్న నా చెల్లెలూ కదుల్తోంది.

"అంగీకరించినట్లేనా?"

ఉలిక్కిపడి_"అంగీకరిస్తే సెలక్షన్ అయిపోతుందా?" అన్నాను.

అవును..."అన్నాడతను.

"నా బాధ్యతలేమిటో కాస్త వివరించగలరా" అన్నాను

"చెప్పానుగా-చట్ట విరుద్ధమైన పనులు చేయాలి."

"చట్ట విరుద్ధమైనవంటే?"

"ఉదాహరణకు...నువ్వు హత్యలు చేయగలవా?"

గుండెల్లో బాంబు ప్రేలినట్లయింది. కళ్ళ ముందు స్త్రీలు బీరువా మాయమైంది. మాట్లాడుదామంటే నాకు నోట మాట రావడంలేదు.

"వాట్ మిస్టర్ - అలా గైపోయావేమిటి? నీ వల్ల కాదంటావా? ఇట్సాల్ రైట్....ఆలోచించుకునేందుకు వ్యవధి కావాలంటే తీసుకో. అవసరం లేదనుకుంటే వెళ్ళవచ్చు. ఇందులో బలవంతం ఏమీ లేదు కదా!" అన్నాడతను.

ఆయన ప్రశ్న ఇంకా చెవుల్లోనే గింగరు మంటున్నప్పటికీ-చేతికి చిక్కుతున్న ఖరీదైన ఉద్యోగాన్ని చటుక్కున వద్దనడానికి మనసంగీకరించలేదు. ఆలోచించుకొనేందుకు కాస్త వ్యవధి కావాలని చెప్పాను

"అయితే ఉద్యోగంలో చేరేవనే భావిస్తాను. నిన్నే పనికి నియమించినా నీకు ఏ విధమైన ప్రమాదమూ రాకుండా వెయ్యి కళ్ళతో కాపాడుతుంటాను. అడ్వాన్స్‌గా రెండువేలు తీసుకో. డబ్బు తిరిగి ఇచ్చేసేమాటైతేనే రేపురా. లేనిపక్షంలో ఎల్లుండి కనిపించు...."

ఆయన ఇచ్చిన రెండు వేలూ తీసుకొని-"ఒకవేళ మీకు మళ్ళీ నేను కనపడకపోతే...?" అన్నాను.

"ఎల్లుండి నాకు కనపడకపో ఆ తర్వాత నువ్వు మళ్ళీ ఎవరికీ కనపడివు-.." అంటూ నవ్వాడతను.

అంతవరకూ అతను నవ్విన నవ్వుకీ ఈ నవ్వుకీ చాలా తేడా ఉంది'

# 3

"ఉద్యోగం ఒకటి దొరికేలాగుంది-" అన్నాను ఇంట్లో.

ఇంటిల్లపాదీ ఒక్కసారిగా ప్రశ్నల పరంపరలు కురిపించారు.

"డబ్బు లంచమివ్వాల్సి ఉంటుందనుకుంటాను-" అన్నాను.

"అప్పో సప్పో చేసైనా ఇద్దాం. ఎంతకావాలేమిటి?.. అన్నాడు నాన్న.

"ఇంకా తెలియదు. కానీ లంచమివ్వడం చట్టవిరుద్ధం కదా!"

నాన్న నవ్వి- "నేను లంచం పుచ్చుకుంటున్నాను.

అది చట్ట విరుద్ధమే! కానీ ఈనాడు మిమ్మల్నిదశకైనా తీసుకురాగలిగానంటే ఆ లంచమే కారణం-" అన్నాడు.

"అయితే మన అవసరాన్నిబట్టి చట్ట విరుద్ధంగా ప్రవర్తించడం తప్పు కాదంటారా?" అన్నాను నా ఉద్దేశ్యం తెలియని నాన్న వెంటనే తలూపాడు.

"అయితే నాకుద్యోగం వచ్చినట్లే-ఇది నెల జీతం అడ్వాన్సు..." అంటూ రెండువేల రూపాయలు నాన్నకు అందించాను.

ఇంటిల్లపాదికీ ఒక్కసారిగా కళ్ళు చెదిరిపోయాయి.

నాన్న కంగారుగా- "ఏం చేశావ్-ఎలా వచ్చింది డబ్బు?" అన్నాడు.

"నాకీవేళే ఉద్యోగం దొరికింది. నా విధులు విని చేరడానికి కాస్త తటపటాయించాను. నీ మాటలు విన్నాక తటపటాయించడం అవసరంలేదనిపించింది. నేనిప్పుడొక పెద్ద కంపెనీలో మేనేజర్ని. కంపెనీ పేరు మాత్రం నాకింకా తెలియదు..." అన్నాను.

ఇంట్లో వాళ్ళెవ్వరేమనుకున్నప్పటికీ నేనొక గట్టి నిర్ణయానికి వచ్చాను. ఈ ప్రపంచంలో అన్నింటికి మించినది. డబ్బు. అది సంపాదించడం కోసం ఏమైనా చేయాలని అందరికీ ఉంటుంది. కానీ తెగువ కొందరికే ఉంటుంది. చట్టవిరుద్ధమైన పనులు చేసి డబ్బు సంపాదించడానికి చాలమంది సిద్ధంగా ఉంటారు. కాని తెలివి కొందరికె ఉంటుంది.

మా నాన్న చట్ట విరుద్ధంగా డబ్బు సంపాదిస్తున్నాడు. అయితే అదెంత? నెలకు కొన్ని వందలు మాత్రం! చట్ట విరుద్ధం అన్నాక పెద్దేమిటి, చిన్నేమిటి? డబ్బు ఎక్కువ సంపాదించడమే ముఖ్యం!

చట్ట విరుద్ధమైన పనులలో డబ్బు సంపాదించే తెగువ, తెలివి నాకులేవు. కానీ ఎవరైనా ఆదేశిస్తే వారిపావుగా మసలగలను. అందుకు అవసరమైన తెగువ, తెలివి నాకున్నాయి.

చెప్పిన రోజుకు అతన్ని కలిశాను.

'సువ్వొస్తావని నాకు తెలుసు!' అంటూ నవ్వాడతను.

నేనూ నవ్వాను.

'రేపు నువ్వు విశాల్ ఫ్యాన్సీస్టోర్స్‌లో ఒక లెదర్ సూట్‌కేస్ కొనాలి. అంటే రేపు సాయంత్రం ఏడు

గంటలకు నువ్వు ఫ్యాన్సీ స్టోర్‌కు వెళ్ళి రెడ్‌కలర్ లెదర్ సూట్‌కేస్ కావాలని అడుగుతావు. అతను నూట యాభై రెండు రూపాయలు చెబుతాడు. నువ్వు నూట ముప్ఫయిఅయిదుకి అడుగు. నూటయాభైకి తగ్గదంటా డతను. నూటనలభై కి పైపా ఇవ్వనను నువ్వు. అతను అంగీకరించి-సూట్‌కెస్ పై నీపేరు చెక్కిస్తానంటాడు. పేరు చెప్పు.

తర్వాత అక్కడ్నుంచి గంటిహరి వీధిలోకి వెళ్ళు. అక్కడ సుభద్రా టైలరింగ్ హోం ఉంటుంది. నీ సూట్ కేస్‌కు మంచి కవర్ తయారు చేయమను. గుడ్డలు కూడా అక్కడే ఉంటాయి. వాళ్ళుయాభై రెండు రూపాయ లంటారు. నువ్వు నలభై ఆరుకు బేరమాడు. ఓ అరగంట పోయాక రమ్మంటారు. అలాగే వెళ్ళి పెట్టెతీసుకో. పెట్టె నీది. ఆ మర్నాడు నాదగ్గరకు వస్తే నీకు ప్రతిఫలం ముడుతుంది....."

"ఎంత?"

"ముందుగా చెప్పను...." అన్నాడతను.

-నేను ఆలోచిస్తున్నాను. ఇది డెఫినెట్‌గా ఏదో స్మగ్లింగ్ వ్యవహారమే.కానీ చాలా తెలివిగా పథకం వేసుకుని వ్యవహరిస్తున్నారు. ఏమైనా స్మగ్లింగ్ వస్తువులు...అవి వజ్రాలు కావచ్చు.. మరేమైనా కావచ్చు ...అవి నగరంలో ఒక ఫ్యాన్సీ స్టోర్ నించి ఒక టైలరింగ్ హోం మారడానికి నాబోటి రెండు వేలరూపాయల ఉద్యోగి అవసరమా. అవసరమే అనుకుంటే ఈ వ్యవహారంలో అసలు లాభం ఇంకా ఎంత ఉంటుంది?

"నీకు విశాల్ ఫ్యాన్సీ స్టోర్స్‌లో కొనబోయే ముందు ఒకసారి పెట్టె చూపించడం జరుగుతుంది. ఆ తర్వాత మళ్ళీ పెట్టె తెరచి చూడ్డానికి ప్రయత్నించవద్దు. సుభద్రా టైలరింగ్ హోం నుంచి బయట పడ్డాక ఆ పెట్టె నీ స్వంతమే అవుతుంది. అంత వరకూ మాత్రం పెట్టెను నీ ప్రాణాలకంటె భద్రంగా చూసుకోవాలి-'అన్నాడతను.

"అలాగే." అన్నాను.

# 4

"చాలా నీటుగా వ్యవహరించావు-" అని మెచ్చు కున్నాడతను. నేను చేసిన పనికి ప్రతిఫలంగా మూడు వేలు వచ్చాయి. అక్కణ్ణించి తిన్నగా బజారుకు వెళ్ళాను స్టీల్ ఫర్నిచర్ షాపులో ప్రవేశించి-నాకు ఊహల్లో మెదుల్తూండే బీరువా సెలక్ట్ చేశాను. పదమూడు వందలు చెప్పాడు. వెంటనే డబ్బు ఇచ్చేశాను.

"అడ్రస్ ఇవ్వండి-ఇంటికి పంపేస్తాం-" అన్నాడు షాపు యజమాని.

అతడికి అడ్రస్ ఇచ్చి శరవేగంతో ఇల్లుచేరి చెల్లిని అప్పటికప్పుడు ప్రయాణం కట్టించి బజారుకు తీసుకు వెళ్ళి దానికి నచ్చిన రకరకాల డ్రస్సులు కొన్నాను. పదిరకాలు కొనేసరికి వెయ్యి రూపాయలలోపు అయింది.

"ఇంకచాలు అన్నయ్యా-" అంది చెల్లెలు-"పాపం అన్నయ్యాలిద్దరికీ కూడా ఏమైనా తీసుకోవా."

చెల్లాయి అన్న ఆ మాటలు వినగానే నాకు ఏదో కొత్త విషయం తెలిసినట్లనిపించింది. ప్రతి మనిషి

స్వార్థానికీ ఎంతో కొంతహద్దుంటుంది. హద్దు అధిగమించి నప్పుడు అతను ఇతరుల గురించి ఆలోచిస్తాడు. తనకు కొత్త బట్టలు కావాలన్న మోజులో చెల్లాయి ఇతరుల అవసరాలను గుర్తించలేదు. దానికి ఒక్క సారిగా పది కొత్తబట్టలు వచ్చేసరికి అన్నల అవసరాలు గుర్తించింది.

ఈ ప్రపంచంలో అందరికీ డబ్బు ఉండే మానవ త్వానికి ఇప్పుడున్నంత కొరత ఉండదు. కనీసావసరాలు తీరని మనిషికి మానవత్వం గురించి ఆలోచించే అవ కాశమెక్కడుంది?

తమ్ముళ్ళిద్దరికీ గుడ్డలు తీసుకున్నాను. ఇంటికి వెళ్ళే సరికి తన స్టీలు బీరువా చూసుకుని చెల్లెలు ఆశ్చర్యంతో మూర్ఛపోయి నంతపని చేసింది.

"నేను బీరువాకొన్నది నిన్ను మూర్ఛపోగొట్టడానికి కాదు-'' అన్నా నేను నవ్వుతూ.

అమ్మకూ, నాన్నగారికీ నేను పెట్టిన ఖర్చు అట్టే సంతోషాన్ని కలిగించినట్లని పించలేదు. నాన్న తన అసంతృప్తిని కళ్ళతోనే వ్యక్తపరుస్తూ- "ఉద్యోగంలో చేరి రెండ్రోజులు కాలేదు. అప్పుడే ఇంత డబ్బె క్కడిది!'' అన్నారు.

"నా సీటు చాలా మంచిది. లంచం బాగా దొరుకు తుంది -" అన్నాను. నాన్న ఇంకేమీ మాట్లాడ లేదు. లంచానికి వ్యతిరేకంగా ఏమీ మాట్లాడలేదు. ఆయన నన్నేం చేయగలడు? ఏమని ప్రశ్నించగలడు?

నా ఉద్యోగంతో మా ఇంటి ఆర్థిక పరిస్థితి బాగా మెరుగయింది! ఇంట్లో నాకు గౌరవం పెరిగింది. ఇంట్లో

వాళ్ళ కళ్ళల్లో మెరుపులారంభమైనాయి. నా గురించి పెళ్ళి సంబంధాలు కూడా వస్తున్నాయి.

పేరుకు నాకో ఉద్యోగముంది. పెయింట్స్ తయారు చేసే కంపెనీకి మేనేజర్ని. నేను ఆ కంపెనీలో నాకు నిర్ణయించబడిన స్థలంలోనే కూర్చుంటాను. అయితే కంపెనీకి సంబంధించిన వ్యవహారాలలో నాకేమీ సంబంధం లేదు. నాకు అసిస్టెంట్ గా అక్కడ రామ్‌చంద్ అనే అతనున్నాడు. అన్నీ అతను చూసుకుంటాడు. అతను తీసుకు వచ్చిన ప్రతి కాగితంపైన సంతకం పెట్టడం నా పని

ఆఫీసులో నా సీట్లో కూర్చున్నపుడు నాకు ' అతని ' నుంచి ఫోన్ కాల్ వస్తుంది. ఇద్దరం కలుసుకుంటాం. అతని ఆదేశం ప్రకారం నేను మసులుకుంటాను.

మొట్టమొదట సులభమైన పనులే అప్పగించబడి నప్పటికీ క్రమంగా చాలా కష్టమైన బాధ్యతలు స్వీకరించవలసి వస్తోంది. నా పల్లి కాడు అనడానికి వీల్లేదు. ఒక్కసారి కూడా పట్టుబడకుండా ఉండడానికి కారణం నా తెలివి తేటలో "అతని" సామర్థ్యమో తెలియడంలేదు కానీ నా నమ్మకం నానాటికి పెరిగిపోతోంది. ఎంత నమ్మకం లేకపోతే పోలీసులతో ముఖాముఖీ కావడానికి సిద్ధపడతాను.

అతను నాకు చాలా సింపుల్ గా చెప్పాడు.

జవానీ హోటల్లో వాళ్ళమనిషి ఒకడు మకాంచేశాడట. అతనివద్ద ట్రంకు పెట్టె ఒకటుంది. ఆ ట్రంకు గురించిన సమాచారం పోలీసులకు తెలిసింది. ఆ ట్రంకు పెట్టె పరిమాణము, రంగు వగైరా వివరాలన్నీ వారికి

తెలిసిపోయాయి. ఆ ట్రంకు పెట్టె హోటల్లోకి చేరినట్లు వాళ్ళకు తెలిసింది కానీ అది ఆ హోటల్లో ఎక్కడ ఉన్నదో వారికి తెలియదు.

ఆ హోటల్లో గొప్ప గొప్ప వారందరూ మకాంచేస్తారు. అందువల్ల తమకు అందిన రహస్య సమాచారం ఆధారంగా ఆ హోటల్ పై దాడిచేసే సాహసం వారు చేయలేక పోతున్నారు. కాబట్టి హోటల్ చుట్టూ పటిష్టమైన కాపలా ఏర్పాటు చేయబడింది. ఈ విషయం వాళ్ళకూ తెలిసింది. అందుకని ట్రంకుపెట్టెని వాళ్ళు బయటకు తీసుకు రావడంలేదు.

'ఆ ట్రంకులోని ముఖ్యమైనవస్తువులు మరోసూట్ కేసులోనికి మార్చి బయటకు రావచ్చు గదా!' అన్నాను నేను.

'అలా చేయగలిగితే ఇబ్బంది ఏముంది ?' అన్నాడు అతను నవ్వి-ఆ ట్రంకు సామాన్య మైనది కాదు. అదొక ఎలక్ట్రానిక్ కంప్యూటర్ వంటిది. దానికి కనీసం రంగు కూడ మార్చలేము. ఉన్నదాన్ని ఉన్న పళంగానే వాడుకోవాలి. మా వ్యవహారాలకు అది చాలా ముఖ్యమైనది!'

'మరి అది హోటల్లోకి వెళ్ళేటప్పుడు ఎవ్వరూ చూడలేదా ? అసలీవార్త పోలీసులకెలా చేరింది ?' అన్నాను.

'ఆ హోటల్ రిసెప్షనిస్టు మనవాడే! మన మనిషిని హోటల్లో ప్రవేసించినపుడు రిసెప్షనిస్టు ఒక్కడేఉన్నాడు. అందువల్ల ఎవరికీ తెలియకుండా ఒకరాత్రి మన మనిషి హోటల్లో ప్రవేశించాడు. అయితే ఆ రాత్రే పోలీస్ డిపార్టుమెంట్లోని మన మనిషి ఒకడు వార్త పంపించాడు. పోలీసులకు కొద్ది క్షణాలక్రితమే ఏవో కొన్ని కాగితాలు

దొరికాయనీ-వాటిని బట్టి ఆ ట్రంకు హోటల్ జవానీకి చేరిందనీ....

'అప్పుడేం చేశారు?'

'జవానీ హోటల్ గది నుంచి కొన్ని రహస్య సంకేతాలు పంపాలను కున్నాం. అందుకు అనువైన స్థలం అదే. అయితే పోలీసులకీ సమాచారం తెలిసిందని తెలియగానే ఆ ట్రంకును గానీ అందులో ఉన్న ఏ పరికరాలను గానీ ఉపయోగించ కుండా ఉండేలా మామనిషికి ఆదేశాన్నిచ్చాం....'

'ఇప్పుడేం చేస్తారు?'

'ఆ ట్రంకు నువ్వు సాధించి తీసుకురావాలి....'

'ఎలా ?, అన్నాను అప్రయత్నంగా.

'ఎలా అని అడిగితే లాభంలేదు. ఏదైనా మంచి పథకం వేసి హోటల్లోంచి ఆ ట్రంకును బయటకు తీసుకు రావాలి....'అన్నాడు అతను.

క్షణంపాటు నాకు నోట మాట రాలేదు. హోటల్ చుట్టూ పటిష్ఠమైన కాపలా ఉందంటున్నాడు. ఆ ట్రంకు పరిమాణం గురించిన పూర్తివివరాలు పోలీసులకు తెలుసునంటున్నాడు. పోలీసులు చూస్తుండగా హోటల్లో ప్రవేశించి-మళ్ళీ వాళ్ళు చూస్తుండగానే హోటల్లోంచి ట్రంకు పెట్టె బయటకు తీసుకు రావాలంటున్నాడు. బహుశా అతనికి నన్ను జైలుకు పంపాలన్న కోరిక కలగలేదుకదా!

'ఈ పని నీ వల్ల కాకపోతే బహుశా నీ ఉద్యోగానికి స్వస్తి చెప్పవలసి ఉంటుంది-' అన్నా డతను చాలా తాపీగా.

'ఉద్యోగం ఇచ్చినవుడు మీ రేమన్నారు: నేను పట్టు

బడకుండా కాపాడే భారం మీదే నన్నారు. మీరు చెప్పి నట్లు చేయడమే నా విధి అన్నారు. ఇప్పుడు మీరు చెప్పి నట్లు విని హోటల్లోంచి ఆ ట్రంకును బయటకు తెచ్చా ననుకోండి. మీకా ట్రంకు పోతుంది. నేను జైలు పాలూ అవుతాను. ఇద్దరికీ నష్టమే । అన్నాను.

అతని ముఖం గంభీరంగా అయిపోయింది-'ఎల్ల కాలం ఒకే స్థాయిలో ఉండేవాడు అధముడనిపించు కుంటాడు. మనిషి తనకు దొరికిన అవకాశాల్నుపయో గించుకొని జీవితంలో పైకి పోవడానికి ప్రయత్నించాలి. అలాంటి మనుషులే నాక్కావాలి. నువ్వు కొంత కాలంగా నా పథకాలనుపయోగించుకుని కొన్ని సాహస కృత్యాలు చేశావు సంతోషం. అయితే నా పథకాలు నీ మెదడుకు పట్టే పదును ఎటువంటిది? ఒక్క ఐన్ స్టీన్ కారణంగా తియరీ అఫ్ రెలెటివిటీ కనిపెట్టబడి ఉండవచ్చు. కానీ పదిమంది మేధావులు కలిస్తే కానీ మనిషి చంద్రమండలంమీద అడుగు పెట్టగలిగి ఉండే వాడు కాదు.

ఎల్లకాలమూ నేనొక్కడినే ఆలోచించాలంటే కష్టం కదా! నాకు నీలాంటి మనిషి కావాలి. ఉదాహరణకు ఇప్పుడు కలిగిన ఈ అనుకోని ఇబ్బందికి నాకు మతి పోయినట్లయింది. సహకరించలేకపోతే నువ్వు నాకు అనవసరం. సహకరించగలిగితే పదివేలరూపాయల బహుమతితోపాటు నా దగ్గర నీ స్థానం మరింత బల పడుతుంది. బాగా ఆలోచించుకో-కానీ ఎక్కువ వ్యవధి తీసుకోకు....'

పదివేల రూపాయలనగానే నా గుండెలు వేగంగా

కొట్టుకున్నాయి. అప్పటికప్పుడు బుర్రకు పదును పెట్ట సాగాను. బహుశా నేను చాలా తెలివైన వాణ్నే అయుండాలి. వెంటనే ఏదో స్ఫురించింది.

'ఆ ట్రంకు ఎలా ఉంటుందో ముందుగా తెలుసు కోవాలి!' అన్నాను.

అతని ముఖం వికసించింది.. 'అది నీకు చూపిస్తాను మొదల్ నా దగ్గర ఉంది. కానీ ఏంచేయాలనుకుంటు న్నావో చెప్పు...'

'చాలా సింపుల్! ఆ ట్రంకును ఇంకో లెదర్ కేసులో పెడతాను. దానిలో హోటల్‌కు వెడతాను. తిన్నగా మన మనిషిఉన్న గదికి వెడతాను. అతను నా దగ్గరున్న ఈ నకిలీ ట్రంకు తీసుకొని బయట పడ తాడు. అతడు పోలీసుల్ని తప్పుదారి తొక్కిస్తాడు. తర్వాత అసలు ట్రంకును నేను లెదర్ కేసులో పెట్టు కుని బయటకు వస్తాను. పోలీసులు తమకు ట్రంక్ గురించి వచ్చిన సమాచారం తప్పుఅయినా అనుకుంటారు లేదా ఆ ట్రంక్‌లోని అద్భుతశక్తుల్ని వెతకడానికి నానా అవస్థ పడుతుంటారు....."

అతను నా కేసి ఆశ్చర్యంగా చూసి- 'నువ్వు నేనూహించినకంటే చాలా పెద్ద జీనియస్‌వి. ఐ విష్ యూ ఆల్ లక్-' అంటూ చేతులు ముందుకు సాచాడు. నేను చేయి చాపాను కానీ అతను నాకు షేక్‌హ్యాండివ్వ లేదు. నన్ను గట్టిగా కౌగలించుకుని- "నీ కారణంగా ఒక పెద్ద సమస్యకు పరిష్కారం దొరికింది. నువ్వు ఇంకా ఇంకా పైకి వస్తావు-" అన్నాడు.

నా పథకం ప్రకారమే ఆ డ్రింకును అతని స్వాధీనం చేశాను_అతను నాకు బహుమతిగా పన్నెండువేల రూపాయలు ఇస్తూ- 'నీకు చాలామంచి భవిష్యత్తు ఉంది_' అన్నాడు.

చేతిలోకి వచ్చిన పన్నెండువేల రూపాయల వంక చూస్తూ- 'ఇంతకంటె మంచి భవిష్యత్తు నాకు ఆరోగ్యకరమేనా?' అనుకున్నాను.

# 5

ఇంట్లో నా పెళ్ళి గురించిన తొందర ప్రారంభమైంది. చాలామంచి సంబంధాలు వస్తున్నాయని అమ్మ గొణుగ పెడుతోంది. నేను ఏమాటా చెప్పడంలేదని నాన్నగారు విసుక్కుంటున్నారు.

నేను ఏ మాటా చెప్పనిమాట నిజమే- అందుక్కారణం సునీత.

నేనెవరో తెలీకుండా, నా హోదా ఏమిటో తెలుసుకోకుండా ఆరాధనతో కూడిన దృష్టుల్ని నా పైన ప్రసరించిన మొదటి అమ్మాయి 'సునీత' మా ఇద్దరి పరిచయం ఒక సినిమాహాలు దగ్గర విచిత్రంగా జరిగింది. ఆమె నన్ను పలకరించే వరకూ నేనామెను గమనించనే లేదు.

'నా పేరు సునీత।' అన్నదామె.

హఠాత్తుగా వచ్చి ఆమె తన పేరు చెప్పడంతో నేను తడబడ్డాను. అందుక్కారణం ఆమె చాలా అందమైనది కావడం కూడా కావచ్చు।

'ఏమీ ఎరుగని మిమ్మల్నిలా పలకరించి పేరు చెప్పు

కొంటున్నావని మరోలా అనుకోకండి. మిమ్మల్ని చూడ గానే మీ పర్సనాలిటీలో, మీముఖంలో, మీ కళ్ళలో విచిత్ర మైన ఆకర్షణ కనబడింది. నేను ఎన్నోసార్లు సినిమాలకు వచ్చాను. బజార్లో తిరిగాను. కానీ మీలాంటి మగవాణ్ణి చూడలేదు. మీతో పరిచయం చేసుకోవాలనిపించింది. మీ పేరు తెలుసుకోవచ్చా?'

చెప్పాను.

"రూపానికి తగ్గ అందమైన పేరు"- అంటూ మెచ్చు కున్నదామె. ఆమె కళ్ళలో నాపట్లగల ఆరాధనాభావం స్పష్టంగా గోచరిస్తోంది. అందుకు నాకు చాలా సంతోషం గానే ఉన్నప్పటికీ ఆడపిల్ల తనకు తానై వచ్చి నన్ను పలకరించడం వల్లనేమో కాస్త తేలిక భావం కూడా కలిగింది. ఆ పిల్ల అందంగా ఉంది కాబట్టి తేలికభావాన్ని వెంటనే ప్రసరించలేకపోయాను.

ఒక ఆడపిల్ల అందులోనూ అందంగా ఉన్నదీ, అధు నికంగా అలంకరించుకున్నదీ, చదువుకున్న దానిలా కన బడుతున్నదీ నాతో ఇలా మాట్లాడటం నాకు చాలా గర్వంగా ఉంది. సినిమాలో ఆమె నాకు మంచి కంపెనీ ఇచ్చింది. సినిమా కంటె ఆమెతో సంభాషణే బాగుండడంవల్ల నేను సినిమా నాట్టే చూడలేదు.

ఆ విధంగా ప్రారంభమైన సునీత పరిచయం దిన దిన ప్రవర్ధమానమవుతోంది. క్రమంగా నాకు ఆమెపట్ల ఏర్ప డిన తేలిక భావం కూడా తొలగిపోసాగింది.

సునీతకు చదువుంది, సంస్కారముంది. అందముంది, వయసుంది. ఆమెకు లేనిదల్లా డబ్బు ఒక్కటే. ఆమె సాహచర్యం ఎంత మధురమైనదంటే క్రమంగా నేనామెను

విడిచి ఉండలేని స్థితి ఏర్పడింది. ఆమెతో సంభాషించడం కోసం ఎదురు చూసే పరిస్థితి ఏర్పడింది. కొంతకాలం గడిచే సరికి నేనామెను ప్రేమిస్తున్నానని అనుమానించ సాగాను. అనుమానం బలపడ్డాక - ఓరోజు ఆమెను అడి గేశాను. సునీత బదులేమీ చెప్పకుండా నవ్వి ఊరుకుంది.

'నువ్వు కూడా నన్ను ప్రేమిస్తున్నావా?' అని మళ్ళీ అడిగాను.

'ఈ ప్రశ్నకు జవాబు చెప్పలేను-' అంది సునీత.

'ఏం?' అన్నాను ఆశ్చర్యంగా.

'కొంతకాలం పాటు నాకూ, ప్రేమ అన్న పదానికీ కుదరదు...'

'ఎందువల్ల?'

'మానాన్న అనారోగ్యంతో బాధపడుతున్నాడు. ఆయన ఆరోగ్యానికి నా సేవలు అవసరం. ఆయన మందులకు నా సంపాదన అవసరం. ఒక సంవత్సర కాలంలో ఆయన బాగా కోలుకొంటారని డాక్టరు అన్నాడు. ఆయన కోలు కునే దాకా మాఇంట్లో ప్రేమలు, పెళ్ళిళ్ళు లాంటి పదాలు వినపడ్డానికి వీల్లేదు-'

నేను కాస్త నిర్లక్ష్యంగానే- 'మీ నాన్నగారి సేవలకు ఓ మనిషిని పెడదాం. ఆయన వైద్యానికయ్యే ఖర్చంతా నేను భరిస్తాను. మనం పెళ్ళి చేసుకుందాం' అన్నాను.

నా మాటలకు సునీత బాగా నొచ్చుకుంది ..'మా అను బంధం తెలిసుంటే మీరిలా అనేవారుకాదు. చిన్న తనం నుంచీ ఆయన నన్ను కంటికి రెప్పలా పెంచారు. నన్ను విడిచి బ్రతకలేరాయన. నాకు వివాహం అన్నమాట వింటేనే ఆయన కలవరపడతారు. అనుకోకుండా ఆర్నెల్ల

క్రితం ఆయనకీ జబ్బువచ్చిపడింది. ఈపరిస్థితుల్లో నా సేవలే ఆయనకు బలాన్నిస్తున్నాయి. నేనుఇల్లు విడిచి వెళ్ళిపోతా ననీ, నా భర్తతో హాయిగా జీవిస్తుంటానని ఊహించు కున్నా- అటువంటి జీవితం కోసం నే నాత్రపడుతున్నా నన్న అనుమానం కలిగినా - ఆ ముసలి హృదయం తట్టుకోలేక తల్లడిల్లిపోతుంది.

మీకు నేను కావాలనుకుంటే మరికొంతకాలం మీరు వేచి ఉండక తప్పదు. ఆయన్ను నెమ్మదిగా మభ్యపెట్టి మన పెళ్ళికి సుముఖుణ్ణి చేస్తాను. అంతకాలం మీరు ఆగ లేక ఈలోగా మరెవరినైనా అమ్మాయినిచేసుకున్నా నేను బాధపడను. ప్రేమ ప్రేమ అని మనం అనుకుంటాం కానీ అది వయసుకు సంబంధించిన వట్టి ఆకర్షణ మాత్రమే! అసలుప్రేమసంవత్సరాలపరిచయంతోపుట్టుకు వస్తుంది-'

తర్వాత నేను సునీత తండ్రిని కలుసుకున్నాను. ఆయనతో పెళ్ళి విషయం మాట్లాడలేదు కానీ సునీత ఆయన గురించి చెప్పినవన్నీ నిజమేనని గ్రహించాను.

ఆయనకు కూతురంటే పంచ ప్రాణాలునూ. మంచం మీద కూర్చునేస్థితిలో కూడా లేకపోయినా ఆయన నాకూ సునీతకు ఉన్న పరిచయమెలాంటిదో తెలుసు కోవడం కోసం లక్ష ప్రశ్నలు వేసి చంపాడు. ఈ కారణంగా నేను మరోసారి ఆయన ఇంటికి వెళ్ళడానికి ఇష్టపడలేదు. సునీతను బయట కలుసుకోవడమే బాగుంది నాకు.

సునీత గురించి ఇంట్లో చెప్పాలో చెప్పకూడదని పరి స్థితి ఇంకా అలానడుస్తూనే ఉంది.

# 6

"నువ్వు నాకు మరింత దగ్గరగా రాబోతున్నావు-" అన్నాడతను.

ఆ మాటలకు నేను కాస్త భయపడ్డాను. అతనికి దగ్గరగా వెళ్ళాలన్నకోరిక నాకు లేదు. అయినా ఆశకు బానిసనై అతను చెప్పినట్లల్లా చేస్తూ అతనికి దగ్గరవుతూనే ఉన్నాను. నిజం చెప్పాలంటే అతనికి వీలైనంత దూరంలో ఉండాలన్నదే నాకోరిక.

"చెప్పండి," అన్నాను.

"చాలా కాలంగా నాకు కొరకరాని కొయ్యలుగా ఉన్న ముగ్గురు వ్యక్తులున్నారు. ఆ ముగ్గుర్నీ నా దారికి తీసుకురావాలి...." అన్నాడతను.

"ఎవరు వాళ్ళు?"

"ఒకడు ఒక చిన్న ఆఫీసులో చిన్న గుమాస్తా. కానీ వాడి కారణంగా మనకు చాలా పెద్ద పనులు ఆగిపోతున్నాయి. లంచాలు ఆశచూపిస్తే పడలేదు! పేరు మోసిన ఆ నిజాయితీపరుడి పేరు సత్యనారాయణ...."

"మీ వల్ల కానిపని నావల్ల అవుతుందంటారా?"

'చెప్పలేను. కానీ చివరి ప్రయత్నం చేయాలిగదా!'

'చివరి ప్రయత్నమంటే....?'

'తర్వాత చెబుతాను...కానీ రెండో మనిషి సంగతి విను. వాడు బ్యాంకులో పని చేస్తున్నాడు. అందులోనూ క్యాషియర్. వాడు తలచుకుంటే నాదగ్గరున్న దొంగ నోట్లని క్షణాల మీద మంచినోట్లుగా మార్చవచ్చు. కానీ వాడూ నిజాయితీ పరుడే. ఆ మహానుభావుడి పేరు హరిశ్చంద్రమూర్తి ..'

'మూడో మనిషి ఎవరు?' అన్నాను.

'ముందు ఈ ఇద్దరి సంగతీ తేల్చు. మూడో మనిషి సంగతి చెబుతాను....'

నేను వెళ్ళి సత్యనారాయణను కలుసుకున్నాను. అతడి పరిస్థితి చాలా దయనీయంగా ఉంది. అతగాడికి వృద్ధులైన తలిదండ్రులున్నారు. భార్యఉంది, ఇద్దరు పిల్లలున్నారు. పెళ్ళి కాని ముగ్గురు చెల్లెళ్ళూ, చదువుకుంటున్న ఒక తమ్ముడూ ఉన్నారు. అతనుండే ఇల్లు నివాసయోగ్యంగాలేదు. ఇంత మందీ అతడి ఒక్క సంపాదన మీద ఆధారపడ్డారు. అతని విజాయితీకి హర్షించాలో బాధపడాలో తెలియలేదు.

నేనెవరినో మాటలలో చెప్పకుండా సత్యనారాయణతో నాకున్న అవసరాలను పరోక్షంగా సూచించి, అందుకు అతనికి లభించే ప్రతిఫలాన్ని ప్రత్యక్షంగానే చెప్పి నా వాక్చాతుర్యాన్నంతా ఉపయోగించి అతనితో మాట్లాడాను. కానీ అతను నామాటల్ని చెవుల కెక్కించుకోలేదు. ఒక్క నమస్కారం పెట్టి వెళ్ళమన్నాడు.

తర్వాత హరిశ్చంద్రమూర్తిని కలుసుకున్నాను. ఇతడి పరిస్థితి కూడా ఇంచుమించు సత్యనారాయణకు వలెనే ఉంది. ఇతడు కూడా అతడికి లాగే నామాటలకు ఏ మాత్రమూ చలించలేదు. నమస్కారం పెట్టలేదు కానీ మళ్ళీ తనవద్దకు రావద్దని ప్రత్యేకంగా కోరాడు.

నిరుత్సాహంగా అతని వద్దకు వెళ్ళాము.

'నీ ముఖం చూస్తూనే తెలుస్తోంది. పని కాలేదు. కదూ?' అన్నాడతను.

'లేదు...' అన్నాను.

'విచారించకు. సృష్టికి ప్రతిసృష్టి చేయగలిగిన సర్వశక్తిమంతుడు విశ్వామిత్రుడు—హరిశ్చంద్రుడి చేత అబద్ధం—ఒక్కటంటే ఒక్కటి చెప్పించలేక పోయాడు. అలాంటి వాళ్ళు కొందరు అక్కడక్కడ ఈ భూమ్మీద ఉండి ఇదింకా ఇలా నిలబడ్డానికి కారణమవుతున్నారు. వాళ్ళ పేరు చెప్పుకుని మనలాంటి వాళ్ళం పది కాలాల పాటు హాయిగా జీవించ గలుగుతున్నాం. ఇది నీ శక్తికి ఏ మాత్రమూ పరీక్ష కాదు. అసలైన పరీక్ష ఇప్పుడుంది....' ఆగాడతను.

'ఏమిటది?' అన్నాను.

నువ్వుద్యోగంలో చేరినప్పుడో మాట అన్నాను గుర్తుందా?'

'చాలా మాటలన్నారు. ఏమాటో ఎలా చెప్పేది?'

'నువ్వు చేరబోయే ఉద్యోగంలో బాధ్యత లేమిటో తెలుసుకోగోరావు. చట్ట విరుద్ధమైన పనులు చేయాల్సొంటుందని చెప్పాను. చట్ట విరుద్ధమైన పనులంటే ఎలాంటివని అడిగావు. అప్పుడు నేను...'

'వద్దు-చెప్పొద్దు—' అని అరిచాను. ఒకసారి ఆపాదమస్తకమూ వణికి పోయాను. అతనాక్షణంలో ఏమన్నాడో నాకు ఎప్పటికీ గుర్తుందనే ఉంటుంది. ఆ క్షణంలో అతనన్న మాట అతని నోటినుంచి మళ్ళీ వినాల్సొచ్చే క్షణంవస్తుందేమోనన్న భయం నాకెన్నడూ ఉందనే ఉంది. మొత్తం మీద ఇప్పుడా క్షణం రానే వచ్చింది.

'నేను చెప్పినా చెప్పకపోయినా నువ్వు చేయాల్సిన పని తప్పదు—' అన్నాడతను.

నేను తమాయించుకుని— 'ఈ పనికినన్నే ఎందుకు ఎన్నుకుంటున్నారు? మీరు స్వయంగా చేయలేరా?' అన్నాను.

అతను మాట్లాడ్డానికి ముందుకొస్తూ నవ్వాడు—'ఒక సమాన్యమైన గుమస్తాని, చిన్న బ్యాంకు కాయషిర్ని నా చేతుల్తో చంపడానికి నా కిష్టముంతదు. అది నాకు అవమానం. నువ్వు నా అంతటి వాడివి కావాలంటే ఈ హత్యలు చేయక తప్పదు....'

'నేను చేయనంటే....'

'ఈ ఉద్యోగానికి స్వస్తి.... అదీ కాక- హత్యకో లక్షలభిస్తూంటే వదులుకోగలవా నువ్వు?' అన్నాడతను.

'హత్య కొక లక్షా?' అన్నాను అప్రయత్నంగా. లక్ష అన్నా పదం ఎంత బ్రహ్మానందాన్ని కలిగిస్తోందో హత్య అన్నపదం అంత భయంకరంగా బెదిరిస్తోంది. ఈ రెండు పదాలూ ఒక దాని కొకటి పక్కన చేరి నన్ను పలకరించడం నాదురదృష్టం.

'బాగా ఆలోచించుకో. హత్యకు పథకం నేనే చెబుతాను. ఆచరణ మాత్రమే నీది. నీ మీద ఎవరికీ అనుమానం రాదు. ఆత్మహత్య చేసుకున్నారను కుంటారు....'

'మొత్తం ఇద్దరు.... అంటే రెండు లక్షలన్నమాట...' నేను నాలో నేను గొణుక్కున్నాను అస్పష్టంగా.

అది అతనికినపడినట్లుంది-'నీ అదృష్టం బాగుంటే రెండు మూడు కావచ్చు...' అన్నాడు.

అప్పుడే నాకు గుర్తుకు వచ్చింది- 'అన్నట్లింకా మూడో మనిషి ఒకడు కదూ? వాడెవరూ.' అనడిగాను.

'ఆ సంగతి తర్వాత చెబుతాను. ముందు ఈ ఇద్దరి

పనిపూర్తి చేయి...'

'ఎలా?' అన్నాను. లక్ష అనేపదాన్ని హత్యనించి విడదీసి చూడ్డానికి ప్రయత్నిస్తున్నాను నేను.

అతను జేబులోంచి రెండు కాగితాలు బయటకు తీశాడు.

"ఒకసారి ఈ సత్యనారాయణా, హరిశ్చంద్ర మూర్తి ఒకనాటకంలో పాల్గొన్నారు. వాళ్ళకు తెలియకుండానే ఆ నాటకానికి నా మనుషుల ద్వారా వారి ప్రోత్సాహం అందింది. పోర్షన్స్ ఇద్దరూ కాపీలు తీశారు. నాటకంలో ఆత్మహత్య చేసుకుంటున్నట్లు ఒక ఉత్తరం రాస్తాడు. వీళ్ళిద్దరి దస్తూరిలోనూ ఆ ఉత్తరం కాపీలు కూడా తియ్యబడ్డాయి. వాటిని సేకరించి దాచి ఉంచాను నేను. నువ్వు చేయవలసినదల్లా వాళ్ళని ఏదో ఏకాంత స్థలానికి రప్పించి వాళ్ళచేత విషంమింగించి వాళ్ళజేబుల్లో ఈ ఉత్తరాలు పెట్టిరావడం...." అన్నాడతను.

అతని తెలివితేటల్ని అభినందించకుండా ఉండలేక పోయాను. అంతలోనే నాకో సందేహం గలిగింది-

"వాళ్ళు చావడంవల్ల నీకేమిటి ప్రయోజనం?"

వాళ్ళస్థానాల్లో నామనుషులు - ఉద్యోగాల్లో ప్రవేశిస్తారు. వీళ్ళచావు నా మనుషులకు తిరుగులేని హెచ్చరికగా ఉంటుంది-" అన్నాడతను.

"వీళ్ళచేత బలవంతంగా విషంమింగించడ మెలా?"

"శివాజీ పార్కు- ఊరికిదూరగా చివరఉంది. అందులోకి సాధారణంగా జనంవెళ్ళరు. ఏదో మిషమీద వాళ్ళను అక్కడికి రప్పించు. నువ్వు చప్పట్లుకొడితే విలాడ్యు

లైన నా మనుషులిద్దరు వస్తారు. మెప్పించెబితే అది చేస్తారు...." అని నవ్వాదతను.

నాకు నవ్వురాలేదు.

# 7

చెల్లెళ్ళకు పెళ్ళిసంబంధాలు, కానీ కట్నం అక్కర్లేదు అనగానే వాళ్ళు ఎంత ఉత్సాహ పరితులయ్యారో ఫోన్లో వాళ్ళ కంఠాన్ని విని గ్రహించగలిగాను. శివాజీ పార్కులో నన్ను ఏ విధంగా కలుసుకోవాలో వాళ్ళకు వాళ్ళకు ఫోన్లో వివరించి చెప్పాను. అన్నటయిముకు పార్కుకువెళ్ళాను. అక్కడ ఇద్దరూ నాకోసం ఎదురు చూస్తున్నారు.

నన్ను చూడగానే ఇద్దరిముఖాల్లోనూ నిరుత్సాహం కొట్టొచ్చినట్లు కనబడింది.

"మీరా?" అన్నారిద్దరూ ఒకేసారిగా.

"అవును. నేనే!" అన్నాను.

"పెళ్ళి సంబంధం మాట నిజంకాదా?"- ప్రశ్నలో చిన్న ఆశ.

"కాదు-" ఒక్కమాటలో ఆశను త్రుంచేశాను.

"అయితే మమ్మల్నెందుకు పిలిచినట్లు?"

"మీరు కట్నంలేకుండా మీ చెల్లెలుకు వరుడుదొరుకుతాడనుకొని నిర్మానుష్యమైన ఈ ప్రాంతానికి వచ్చారు. అంతకంటె సులభంగా ఆ కట్నం డబ్బులు సంపాదించే మార్గం ముందుగానే నేను చెప్పాను. మీరు వినడం లేదు-" అన్నాను.

"అయినా మమ్మల్నిప్పుడిక్కడికి ఎందుకు

పిల్చినట్లు!''

''ఆఖరిసారిగా హెచ్చరించ డానికి....''

''అంటే?''

''హెచ్చరిక పాటించకపోతే మీ ప్రాణాలుండవు నేను చప్పట్లు కొట్టగానే ఇద్దరు మనుషులు ఇక్కడికి వస్తారు....'' అన్నాను.

ఇద్దరికళ్ళలోనూ భయంకనపడింది. ఇద్దరికీ నోట మాట రాలేదను కుంటాను. నా ముఖం చూస్తోంటే అన్నంతపని చేసేవాడిలాగే కనపడుతూండి ఉండాలి.

ఇద్దరూ నన్నెంతగానో ప్రార్థించారు. తమప్రాణాలు తీయవద్దన్నారు. తమమీద ఎందరో ఆధారపడి ఉన్నా రన్నారు.

అప్పటికి నేను చప్పట్లు కొట్టడం అయింది. ఉక్కు పిడుగుల్లాంటి ఇద్దరు మనుషులు వచ్చి సత్యనారాయణ, హరిశ్చంద్ర మూర్తికి వెనక నిలబడ్డారు.

''మీ ప్రాణాలు మీ చేతుల్లోనే ఉన్నాయి...'' అన్నాను.

ఇద్దరూ నన్నెంతగానో ప్రాధేయపడు తున్నారు. ఎన్నో విధాల వేడుకుంటున్నారు. కానీ నిజాయితీని వదిలిపెట్టడానికి మాత్రం అంగీకరించడంలేదు.

''మీ కర్మ!'' అని జేబులు తడుముకున్నాను. విషం సీసా, రెండు ఉత్తరాలు– చేతికి తగిలాయి. సంతృప్తిగా నిట్టూర్చి- ''చావుకు సిద్ధంకండి!'' అన్నాను.

ఒక్కసారి ఆలోచించు. నువ్వే మాపరిస్థితుల్లో ఉండి చనిపోతున్నావనుకో–

హరిశ్చంద్రమూర్తి మాటలు వింటూ– 'నేనుమీపర్థి

తుల్లో ఉంటే మీ అంత తెలివి తక్కువగా ఎప్పుడూ ప్రవర్తించను'- అన్నాను. కానీ అప్పుడు నాకళ్ళ ముందు కొన్ని దృశ్యాలు అప్రయత్నంగానే మెదిలాయి.

నేను లేకపోతే నా ఇల్లు ఎలా ఉంటుంది?

ఇటీవల నా సంపాదనతో ఇంట్లో ఖర్చులు పెరిగాయి. అందరూ దర్జాగా మసలడానికి అలవాటు పడ్డారు. నాన్న గారు కొద్దికాలంలో రిటైరై పోతాడు. నేను లేకపోతే నా వాళ్ళంతా ఏమైపోతారు?

నేను మెత్తబడుతున్నానని ఆలోచించేవో ఏమో "నేను లేకపోతే మావాళ్ళంతా మలమల మాడిపోతారు. నా ఉనికి వాళ్ళకు జీవనాధారం-" అన్నాడు సత్య నారాయణ.

నా కళ్ళ ముందు నా చెల్లి స్త్రీలు బీరువా అమ్మేస్తోంది. చెల్లీ అని అరవబోయి ఊరుకున్నాను.

ఉక్కుపిడుగుల్లాంటి ఆ మనుషులిద్దరూ నా ఆజ్ఞ కోసం నాకేసి చూస్తున్నారు. నేను హరిశ్చంద్రమూర్తి, సత్యనారాయణవంక చూసి- "ఒక్కరోజు గడువివ్వ గలను. మీ మనసు మార్చుకోగలరా?" అన్నాను.

"ప్రాణాలకంటే నిజాయితీయే ఎక్కువమాకు. నీలో మానవత్వముంటే మమ్మల్ని వదిలిపెట్టు. సత్ప్రవర్తన తప్పుకాదు. ఆ తప్పుకు నీవు మమ్మల్ని చంపదల్చు కుంటే దేవుడు అందుకు నిన్ను క్షమించవచ్చు. కానీ

చావు కారణంగా మావాళ్ళంతా అనాథలైపోతారు. వాళ్ళ జీవితం దుర్భరమైపోతుంది. వాళ్ళ పరిస్థితి చూసినపుడల్లా నిన్ను నువ్వే క్షమించుకోలేవు-" అన్నారిద్దరూకూడా.

నేను ఉక్కు పిడుగు కేసి చూసి దగ్గరగా రమ్మనమని పిలిచాను. ఇద్దరూ వచ్చారు. వాళ్ళకు జేబులోంచి ఒక సీసా తీసిఇచ్చాను. ఇద్దరూ అందులోని బిళ్ళలు బైటకు తీశారు.

సత్యనారాయణ, హరిశ్చంద్రమూర్తి బలవంతంగా ఆ బిళ్ళలు తిన్నారు.

# 8

"అతిముఖ్యమైన పని ఇంకొకటి మిగిలిపోయింది-" అన్నాడు అతను.

"చెప్పండి-"

"అదే మూడో హత్య!"

"మనిషిని మనదారికి మళ్ళించకుండానే హత్యా?" అన్నాను.

"అ ప్రయత్నాలన్నీ నేనుచేశాను. ఫలించలేదు. విసిగి పోయాను. ఇంక మిగిలినదల్లా హత్య ఒక్కటే!"

"ఎవరామనిషి!"

"ఆమె పేరు సునీత?" అన్నాడతను.

"సునీతా?" అన్నాను షాక్ తిని.

"అవును. సునీతే-అది నీకూతెలుసునని నాకు తెలుసు. తెలిసినవాళ్ళను హత్య చేయడం చాలా సులభం!"

"కానీ నేనామెను ప్రేమిస్తున్నాను!" అన్నాను చటుక్కున.

అతను నవ్వాడు- "ప్రేమా? మనకు ప్రేమేమిటయ్యా! పిల్ల ఎర్రగా బుర్రగా ఉన్నదని మోజు పడుతున్నావేమో!

దావికిమించిన అప్సరసలాంటి అమ్మాయిని నీకు ఇల్లాలుగా తీసుకొస్తాను. సునీత లాంటి అమ్మాయిలు నలుగురు వాడుకుని వదిలేయడానికి బాగుంటారు. అ అభిప్రాయంతోనే నేను దానికోసం ప్రయత్నించాను. లొంగ లేదు. నాకు లొంగని ఆడది జీవించిఉండడానికి వీల్లేదు..''

అతని మాటలు వింటూంటే నాకు సునీతపైన గౌరవం పెరిగింది. ''నేను సునీతను చంపలేను....'' అన్నాను.

''ఎందుకు చంపలేవు? ఒక్క సునీత కోసం నువ్వు నీవాళ్ళందరూ నాశనం కావడానికి అంగీకరిస్తావా?'' అన్నాడతను.

అది బెదిరింపు. నాకు అర్థమయింది. ఈ పని నేను చేయక తప్పదు. కానీ ఎలా?

అతను నాకు ఒక్కరోజు గడువిచ్చాడు. నేను అక్కణ్ణించి కదిలాను.

సునీత హత్య పూర్తి చేయగానే నాకు మొత్తం మూడు లక్షలు అందుతాయి. లేని పక్షంలో నావాళ్ళు కష్టాల పాలవుతారు? నావాళ్ళకోసం నేను ఇతరులను చంపాలి!

# 9

నేను సునీతను కలుసుకున్నాను. పార్కులోకి ఆహ్వానించాను. క్లుప్తంగా ఒకటి రెండు మాటలయ్యాక- ''నేను నిన్నిక్కడికి చంపాలని తీసుకొచ్చాను-'' అన్నాను.

సునీత కళ్ళలో ఆశ్చర్యమేకానీ భయం కనబడలేదు-
"నన్నా, ఎందుకు?"

"నిన్ను చంపితే నాకు లక్షరూపాయలు వస్తాయి...."

"లక్షరూపాయలకోసం నన్ను చంపేస్తావా?"

"నిన్ను చంపకపోతే నావాళ్ళంతా నాశనమవుతారు."

"నేను చస్తే నావాళ్ళ సంగతేమిటి?"

"ఆమె పై ఆశలన్నీ పెట్టుకున్న ఆమె ముసలి తండ్రి గుర్తుకువచ్చాడు- విందు యవ్వనంలో ఉన్న నిన్ను చంపాలనుకునేవాణ్ణి-ముసలాడిగురించి ఆలోచిస్తానా?" అన్నాను

"మానవత్వం ఉన్నవాడు తప్పక ఆలోచిస్తాడు...." అంది సునీత.

ఆమె చెప్పింది నిజమే। నాలో ఇంకా కొంత మానవత్వం మిగిలేవుంది. నేనాముసలాడిగురించి ఆలోచించడం మాత్రమేకాదు. జాలికూడా పడుతున్నాను.

"అసలు నిన్ను హత్యకు పురమాయించిందెవరు?" అనడిగింది సునీత.

కాసేపు తటపటాయించినా సునీతకు అతని గురించీ, నా జీవితం గురించీ చెప్పాను. ఎలాగూ ఆమెను నేను చంపనున్నాను కాబట్టి ఏమి చెప్పినా ఫరవాలేదనిపించింది.

"నాకు చావంటే భయం లేదు. అలాగని అర్థాంతర చావు ఇష్టపడను. నువ్వు డబ్బు కోసం చాలా పనులు చేశావు. అవన్నీ నేను క్షమించగలను. కానీ నువ్వు చేసిన రెండు హత్యలూ, చేయనున్న మూడో హత్య మాత్రం క్షమించరానివి. ఏ పరిస్థితుల్లోనూ మనిషి సాటి మనిషిని చంపే నీచ స్థితికి దిగజారకూడదు......."

నేను పట్టుకున్నాను - "ఇంతవరకూ నేను హత్యలు చేయలేదు. సత్యనారాయణ, హరిశ్చంద్రమూర్తి నా కస్టడీలో ఉన్నారు. వారికి విషానికి బదులు మత్తు మందిచ్చాను. చూసి చూసి ఓ నిండు ప్రాణాన్ని తీయలేక కొంత జాప్యం చేశాను. నీ విషయంలో అతను చేసిన హెచ్చరిక విన్నాక - మూడు హత్యలు చేయక తప్పదనిపిస్తోంది" - అన్నాను.

సునీత నా వంక అభినందనపూర్వకంగా చూసి "ఏ పరిస్థితుల్లోనూ హత్య చేయటం మనిషి దిద్దుకోలేని తప్పు అదొక్కటే -" అంది.

"నిన్ను హత్య చేయకుండా వదిలిపెట్టాలంటే నువ్వు 'అనిల్' తో కనీసం ఒక్క రాత్రి గడపాలి" అన్నాను నేను నెమ్మదిగా.

"ఆ తర్వాత నువ్వు నన్ను పెళ్ళి చేసుకుంటానని మాటిస్తావా ?"

సునీత ఇలా అడుగుతుందని నేనూహించలేదు. ఒక్క క్షణం నా నోట మాట రాలేదు. నెమ్మదిగా తమాయించుకొని - "సునీతా ! నువ్వు చాలా తెలివైనదానివి. ప్రస్తుతం నా మెదడు పని చేయడం లేదు. ఈ పరిస్థితి లోంచి హత్యలు చేయకుండా నేనెలా బయట పడగలను?" అన్నాను.

"ఒకే ఒక్క ఉపాయం. అతన్ని చంపెయ్ -" అంది సునీత.

# 10

సునీత చెప్పిన విషయం చాలాబాగుంది. అతనెప్పుడూ ఒంటరిగా ఉంటాడు. అతనికి నాపైన అనుమానం లేదు.

అతని దగ్గర చాలా డబ్బు ఉంటుంది. అతను చచ్చినా వివరాలు బైటకు రావు.

అతన్ని చంపి దొరికిన డబ్బు తెచ్చుకుని – ఇక శాశ్వతంగా ఈ జీవితం నుంచి బయటపడవచ్చు. అతను చావడం వల్ల ఈ ప్రపంచానికి లాభమే కాని నష్టంలేదు.

నేను ఉద్దేశపూర్వకంగానే అతని దగ్గరకు అర్ధరాత్రి బయల్దేరాను.

అతని ఇంటికి తాళం ఎప్పుడూ వేసి ఉంటుంది. తలుపుకు కీ హోల్ మాత్రం ఉంటుంది. నా వద్ద ఎప్పుడూ ఒక తాళం ఉంటుంది.

నేను తలుపు తీసుకుని ఇంట్లోకి ప్రవేశించాను.

అతను నిండా ముసుగు వేసుకుని నిద్ర పోతున్నాడు. దుప్పటిలోంచి గురక వినిపిస్తోంది. నేను చప్పుడు చేయకుండా అతన్ని సమీపించాను. జేబులోంచి కత్తి తీశాను.

నా చేతులు వణుకుతున్నాయి. జీవితంలో నేను చేయనున్న తొలి హత్య అది।

దేవుణ్ణి స్మరించుకున్నాను. కత్తి పిడిని రెండు చేతులతోటీ పట్టుకుని బలంగా కత్తిని అతని గుండెల్లోకి దించాను. కత్తి సులభంగా దిగిపోయింది. చిన్న కేక కూడా వినబడలేదు. బహుశా సరాసరి గుండెల్లోకి దిగబడి ఉండవచ్చు. కానీ గురక మాత్రం అలాగే వినిపిస్తోంది.

చటుక్కున దుప్పటి లాగి చూశాను.

వరుసగా తలగడాలు మనిషి ఆకారంలో పేర్చబడి వున్నాయి. తల ఉండే స్థానం వద్ద ఒక టేప్ రికార్డరు ఉన్నది. నేను తెల్లబోయాను. అప్పుడే నన్ను భయం

ఆవహించింది. అదే సమయంలో వెనక నుంచి నా భుజం మీద ఎవరిదో చేయి పడింది. భయం రెట్టింపు కాగా వణుకుతూనే వెనక్కి తిరిగాను.

అతను ! !

'చివరకు నమ్మక ద్రోహానికి తలపడ్డావన్న మాట !' అన్నాడు.

నేను ధైర్యం తెచ్చుకుని-'మంచి వాళ్ళనూ నిజాయితీ పరుల్నీ అమాయకుల్నీ చంపడం నా వల్ల కాదు. మీరు చెప్పిన మూడు హత్యలూ చేయడం వల్ల మూడు కుటుంబాలు అష్టకష్టాల పాలవుతాయి -' అన్నాను.

"వెర్రివాడా - వాళ్ళ సంగతే చూసుకొన్నావు నువ్వు. ఇప్పుడు నీగతేమిటి ?'

'అన్నింటికీ సిద్ధపడే ఇక్కడకు వచ్చాను....'

'కంగారు పడకు. నీకే ప్రమాదమూలేదు. నిన్నేమీ చేయను. కానీ నువ్వు నాదగ్గర ఉద్యోగం చేసే అర్హత కోల్పోయావు...." అన్నాడతను.

ఇంతకాలం నేను గడుపుతున్న ఖరీదైన జీవితం గుర్తుకు వచ్చింది. మళ్ళీ పాత నిరుద్యోగపు రోజులు వస్తాయనే సరికి భయం వేసింది- 'నన్ను క్షమించండి. హత్యల విషయం వదలిపెట్టి మామూలు పనులు నాచేత చేయించుకోండి- జీతం కాస్త తక్కువైనా ఫరవాలేదు-' అన్నాను.

అతను తమాషాగా నవ్వాడు- "నువ్వు మాకు పనికి రావు, మామూలు పనులు చేయడానికి మాదగ్గర చాలా మంది మనుషులున్నారు. అందుకు నీ అవసరం లేదు. నీలాంటి యువకుల్ని చేరదీసి వాళ్ళను క్రమంగా అమాను

షంగా తీర్చిదిద్దడమే నా ఆశయం. మా ముఖ్య వ్యవహారాల్లో మనిషికి మానవత్వం పనికిరాదు. అవసరమైతే దగ్గర బంధువుల్నికూడా పూర్వాపరాలు ఆలోచించకుండా హత్య చేయాల్సొంటుంది.

నేను గత కొద్దిమాసాలుగా నిన్నందుకే సంసిద్ధున్ని చేస్తున్నాను. నీమీద చాలా ఆశలు పెట్టుకున్నాను. సత్యనారాయణ, హరిశ్చంద్రమూర్తి, సునీత - నువ్వను కొన్నంత నిజాయితీపరులు కారు. నా దగ్గర డబ్బు తీసుకుని నేనాడించిన నాటకంలో పాత్రలుగా వ్యవహరించారు. ఆ నాటకమే నేను నీకు పెట్టిన పరీక్ష. ఆ పరీక్షలో నువ్వు ఓడిపోయావు. నీలో ఇంకా చాలా మానవత్వం మిగిలి ఉంది. అదుంటే నువ్వు మాకు పనికిరావు..."

తెల్లబోయాను. అతని తెలివితేటల్ని నేను చాలా తక్కువ అంచనా వేశాను.

అతను ఇంకా చెబుతున్నాడు-'నీలో మానవత్వంలేదని ఋజువు చేసుకొనేందుకు నీకింకొక్క అవకాశం. సత్యనారాయణ, హరిశ్చంద్రమూర్తి, సునీతలను ఈ రాత్రికే వెళ్ళి హత్య చేయి. నువ్వు నా మనిషివౌతావు. లేదా ఇంకెన్నడూ ఈ దరిదాపుల్లో కనపడవద్దు...."

నాలో మానవత్వం ఉండకూడదూ?....ఆలోచించాను. అలాచేసిన పక్షంలో ఇంక నాకు నావాళ్ళెందుకు? నేను నాకోసంకాదు. నావాళ్ళకోసం జీవిస్తున్నాను. అతనుపెట్టిన పరీక్షలో నేను ఓడిపోయాను

కానీ ఆ పరీక్ష నాలో మానవత్వ మున్నదని ఋజువు చేసింది. అదినాకు చాలా ఆనందంగా ఉంది. అతని దృష్టికి నాది ఓటమి! కానీ నా దృష్టిలో నాదే గెలుపు. మనిషికి

మానవత్వం ఉండాలి. అతను పెట్టిన పరీక్షలో నా మాన వత్వాన్ని నేను నిలుపుకొని గెలిచాను.

నేను నా జేబులోని తాళంచెవి తీసి అతనికిచ్చి- 'సెలవు!' అన్నాను....

కొద్ది రోజుల్లో నాకు ఒక బ్యాంకులో ప్రొబేషనరీ ఆఫీసరుగా అపాయింట్ మెంట్ ఆర్డరు వచ్చింది. అది నా మానవత్వం నాకిప్పించిన ఉద్యోగం అనిపించింది. అప్పుడే - నేనిదివరలో చెల్లెలి కోసం కొన్న స్టీలు బీరువా నా దానవత్వానికి చిహ్నం అనిపించింది. అది అమ్మించేశాను.

ఉద్యోగంలో చేరాక చెల్లెలికి స్టీలు బీరువా కొనడానికి సరిగ్గా మూడేళ్ళు పట్టింది. కానీ ఈ బీరువా కొన్నప్పుడున్న తృప్తి - పూర్వం కలిగినట్లు నాకు అనిపించలేదు

- ఐపోయింది -

# పగిలిన రమ్ బాటిల్ !

టెంపోరావ్

సినిమా ముగిసింది. ఆనందరావు, అతడి భార్య రేవతి రోడ్డమ్మట నడుస్తున్నారు. నడిచి వెళ్తే అరగంటలో వాళ్ళు యింటికి చేరుకోగలరు !

ఆనంద్ సిగరెట్ వెలిగించాడు. పొగపీల్చి, వదుల్తూ ఆమె ప్రక్కనే నడుస్తున్నాడు. నిర్మానుష్యంగా వున్న రోడ్డమ్మట వాళ్ళు వెళ్తున్నారు.

"ఈ రోడ్డుమీద ఎవ్వరూ లేరు!" అందామె గాభరాగా.

'నేను నీ ప్రక్క నున్నానుగా!' అన్నాడతను నవ్వుతూ.

ఆమె జవాబివ్వలేదు. అతడి చెయ్యిని పట్టుకుంది. అతడు రోడ్డుమీద ఆగి ఆమె పెదిమలను ముద్దెట్టు కున్నాడు.

'ఎవరేనా చూస్తారు!' అందామె.

'ఎవ్వరూ లేరుగా ?' అన్నాడు ఆనందరావు నవ్వుతూ

మరి కొంచెం దూరం వాళ్ళు నడిచారు. రోడ్డు యిరు వైపులా విశాలమైన కాంపౌండు వున్న యిళ్ళున్నాయి. టైమ్ ఒంటిగంట దాటింది. ఇళ్ళలోని వాళ్ళు సుఖంగా నిద్రపోతున్నారు.

ఎవరో ఎదురుగా వస్తున్నారు :

ఆమె గాభరాగా భర్తవైపు చూసింది.

అతను చీకటి పిశాచంలా వాళ్ళకెదురుగా నిలబడ్డాడు. చీకటిలో అతడి రూపం స్పష్టంగా కనపడ్డంలేదు.

"మిష్టర్, ఎవరు నువ్వు ? ఏం కావాలి ?" అడిగాడు ఆనందరావు.

అతడు జవాబివ్వలేదు. చేతిలో వున్న యినపకడ్డీతో చటుక్కున ఆనందరావు తలపైన కొట్టాడు. ఆనందరావు అరుస్తూ క్రిందపడ్డాడు. బలమైన చేతులు రేవతిని చుట్టేశాయి.

ఆమె అర్చింది. అతనామెను వదల్లేదు. రోడ్డువారగా ఆమె నేల మీద పడింది. అతడామె మీద వాలాడు. ఆమె పెదిమలను ముద్దెట్టుకున్నాడు.

"యూ రోగ్ !" అర్చిందామె.

అతడామె చంపమీద గట్టిగా కొట్టాడు.

"నన్ను ఎదిరిస్తే నువ్వు చస్తావు !" అన్నాడతను.

రోడ్డు వారన అతడామెను బలాత్కరించాడు. ఆమె ఏమీ చెయ్యలేక నోరు మూసుకుంది. తన కామతృష్ణను తీర్చుకున్నాక అతడామెను వదిలి, వెళ్ళిపోయాడు. ఆమె లేచి కూర్చుంది. తన భర్తవైపు చూసింది. అతడిని తట్టి లేపింది. అతడు మూలుగుతూ లేచాడు.

చీకటిలో తన భర్త ఏ స్థితిలో వున్నాడో ఆమె తెల్సుకోలేకపోయింది.

అతడు లేచి కూర్చున్నాడు. ఆమె చెయ్యి పట్టుకున్నాడు

'నీకే ప్రమాదం రాలేదుగా?' అడిగాడతను.

తన కొచ్చిన ప్రమాదాన్ని గురించి చెప్తే అతడు నొచ్చుకొంటాడు బాధపడ్తాడు. అతడికదంతా చెప్పిలాభం లేదు.

'నేను బాగానే వున్నాను.' అందామె.

ఇద్దరూ లేచి నిలబడ్డారు. మెల్లిగా యింటికి నడిచారు. లైట్ కాంతిలో ఆమె అతడి తలవైపు చూసింది. తల మీద పెద్దబొప్పి కట్టింది. రక్తం జుత్తుమీద ఎండి పోయింది.

'ఆ దుర్మార్గుడు ఏమయ్యాడు?'

'మీరు స్పృహతప్పి కింద పడ్డాక అతడు నన్ను పట్టుకున్నాడు. అతడి చెవిని కొరికాను, ఒంటి మీద గోళ్ళతో గోకాను. వాడు భయపడి పారిపోయాడు,' అందామె.

'వాడొక స్ట్రీట్ లోఫర్! దొంగై వుంటాడు,' అన్నాడతను.

'నా గొలుసు లాగడానికి ప్రయత్నించాడు,' అందామె.

"అప్పుడు ఏం చేశావు?"

'వాడిని గోళ్ళతో గుచ్చి గీకాను. భయపడి పలాయనం చిత్తగించాడు,' అందామె.

'రేవతీ, బాగా చేశావు! ఆ దుర్మార్గుడికి తగు విధంగా బుద్ధి చెప్పావు,' అన్నాడతను.

# 2

ఇరవై యిడ్లీలు తిని వేడి కాఫీ తాగి ఇండియా కింగ్స్ సిగరెట్ వెలిగించాను.

"ఎవరో మీ కోసం వచ్చారు," అంది పార్వతి.

హాల్లో కొచ్చిన స్త్రీ వైపు నవ్వుతూ చూశాను. ఆమె ముఖంలో నవ్వు లేదు. ఆమెను సోఫాలో కూర్చో మన్నాను

"పరశురామ్ గారూ, మీ సహాయం నాకు కావాలి," అందామె.

సిగరెట్ పొగ వదుల్తూ ఆమె వంక చూశాను.

ఆమె వయస్సు 22 దాటి వుండదు. చాలా అందంగా వుంది. ఆమె శరీరం పచ్చగా మెరుస్తోంది-కోల ముఖం-తీర్చిదిద్దిన ముక్కు. బొడ్డు కిందకు చీరను కట్టుకుంది. కాళ్ళకున్న జోళ్లు ఎర్రగా మెరుస్తున్నాయి.

"ఏ విషయంలో?" అన్నాను.

రాత్రి జరిగినదంతా ఆమె వివరంగా చిత్రించింది. తన పేరు రేవతని చెప్పి అడ్రసు యిచ్చింది.

"వాడొక చీకటి పిశాచం, సార్. నాకు జరిగినది మరెవ్వరికీ జరగకూడదని నా ఆశ,' అందామె.

'అతడెలా వున్నాడు?'

'చీకట్లో అతడి రూపం నాకు కనబడలేదు. అతడు చాలా బలవంతుడని నేను చెప్పగలను. ఒక చేత్తో నా నోరును నొక్కి అతడు నన్ను అనుభవించాడు, ఎంత ప్రయత్నించినా నేను అతడిని ఆపలేకపోయాను'. అందామె.

"ఇదంతా మీ భర్తకు తెలుసా?"

"ప్లీజ్, ఇది నా భర్తకు తెలియదు. ఏదీ కాలేదని నేను నా భర్తతో చెప్పాను. ఏదేనా జరిగిందని తెలిస్తే ఆయన బాధపడ్తారు. అటువంటి దుర్మార్గుడు పట్నంలో తిరగడం అందరికీ ప్రమాదకరం. అతడిని మీరు తొందరగా పట్టుకోవాలి," అందామె.

"ప్రయత్నిస్తాను," అన్నాను ధీమాగా.

క్షణ కాలం గదిలో నిశ్శబ్దంగా వుంది.

"మీరు పోలీస్ రిపోర్టు యిచ్చారా?" అడిగాను.

"ఇవ్వలేదు. ఎలా యిస్తాను? ఇస్తే నిజం చెప్పాలి అది చెప్పడం నాకిష్టం లేదు. అందుకే మీ దగ్గిర కొచ్చాను."

"నేను దర్యాప్తు చేస్తాను," అని ఆమెను పంపించేశాను.

# 3

టైమ్ చూశాను. పదిదాటింది. ఇన్‌స్పెక్టర్ నాయర్‌కి ఫోన్ చేశాను.

"ఇన్‌స్పెక్టర్ నాయర్," అంది అటువైపు కంఠం.

"నాయర్ ఐయామ్, పరశురామ్ స్పీకింగ్! ఎవడో రేపిస్టు పట్నంలో తిరుగుతున్నాడట. అతడిని గురించి ఏమైనా రిపోర్టులు వచ్చాయా?"

"బ్రదర్, మూడు రోజుల క్రితం సుశీల తండ్రి గంగరాజు ఒక రిపోర్టు యిచ్చాడు. అతడు సూతుర్తో, రాత్రి పన్నెండు తర్వాత యింటికి వెళ్తున్నాడట. ఎవడో వ్యక్తి అతడిని తల మీద కొట్టి ఆమెను బలాత్కరించాడట. ఆమెకు ఇంకా పెళ్ళి కాలేదు."

'వాళ్ళ అడ్రెస్ చెప్పగలవా?'

ఇన్‌స్పెక్టర్ నాయర్ అడ్రెస్ యిచ్చాడు. దాన్ని నా డైరీలో రాసుకున్నాను.

'బ్రదర్, నావద్గర కెవరేనా వచ్చారా?'

'నాయర్ భాయ్, అమాయకులైన యువతులను బలాత్కరించే యీ రేపిస్టును నంమ పట్టుకోవాలి,' అన్నాను.

నువ్వు రంగంలోకి దిగితే పట్టుకోగలవు!'

'నాయర్ భాయ్. అతడి కోసం యివాళనుంచి అన్వేషిస్తాను. వుయ్ మస్ట్ కాచ్ హిమ్!' అన్నాను.

'గుడ్ లక్ టు యు.' అన్నాడు నాయర్.

రిసీవర్ని పెట్టేశాను. మేడ మెట్లు దిగి క్రిందకి వెళ్ళాను. షెడ్‌లో వున్న డాట్జి కారులో కూర్చొని, దాన్ని బయటికి పోనిచ్చాను.

మేడ్లీ రోడ్డు మీదున్న నంబర్ 12 యింటి ముందు కారాపి దిగాను. డాబా యిల్లు. లోపలకు వెళ్ళి ముందు గుమ్మం తలుపును తట్టాను. తలుపు తెరవబడింది. తలుపు తెరిచిన వ్యక్తి నా వంక ప్రశ్నార్థకంగా చూశాడు.

"ఐయామ్ డిటెక్టివ్ పరశురామ్," అన్నాను.

అతడు తృళ్ళిపడి నన్ను సోఫాలో కూర్చోమన్నాడు. సోఫాలో కూర్చొని సిగరెట్ పీలుస్తూ అతడి వంక చూసాను.

'నా పేరు గంగరాజు,' అన్నాడతను.

'మీరు పోలీస్ రిపోర్టు యిచ్చారట!' అన్నాను.

'అవును, సార్.'

'ఆ రాత్రి ఏం జరిగిందో చెప్పండి!'

'పన్నెండు దాటింది. నేనూ, అమ్మాయీ చుట్టాల యింటికి వెళ్ళి తిరిగి వస్తున్నాం. ఎదురుగా వచ్చి అతడు మాకు అడ్డుగా నిలబడ్డాడు. తప్పుకోమని నేను అర్చాను. అతడు నా తలమీద కొట్టాడు. నేను కింద పడ్డాను. లేవ లేకపోయాను.

నేను మేలుకునేసరికి అమ్మాయి సుశీల వెక్కి వెక్కి ఏడుస్తోంది. ఆమెను లేపి డాక్టరుకు చూపించి తర్వాత పోలీసు రిపోర్టు యిచ్చాను.'

'పోలీసులు ఏదేనా చెయ్యగలిగారా?'

'ఇదంతా జరిగి పది రోజులు దాటింది. కాని పోలీసులు ఏమీ చెయ్యలేదు.'

"ఇదంతా ఎక్కడ జరిగింది?"

"అన్నానగర్ ప్రాంతంలో. రాత్రిళ్ళు అక్కడ జన సంచారం ఎక్కువగా వుండదు."

"మీ సుశీల చదువుకొంటోందా?"

"బి. ఏ. చదువుతోంది. ఈ సంఘటన జరిగాక మానసికంగా ఆమె బాగా దెబ్బ తింది. ఈ సంఘటన జరిగాక మానసికంగా ఆమె బాగా దెబ్బ తింది. నేనూ, నా భార్యా ఆమెకు ధైర్యాన్నిచ్చాం. మొన్నటి నుంచి కాలేజికి వెళ్తోంది."

సోఫాలోంచి లేచి కారు దగ్గరకు నడిచాను. అతడు నా కూడా వచ్చాడు.

'పరశురామ్‌గారూ, ఆ పిశాచాన్ని మీరు పట్టుకోవాలి. పోలీసుల మీద నాకు నమ్మకం లేదు!'

'ఆ ప్రయత్నంలోనే వున్నాను,' అని కారును పోనిచ్చాను.

# 4

రాత్రి పది దాటింది. బిలాల్ హోటల్ కాబిన్‌లో అతడు కూర్చున్నాడు. సర్వర్ లోపలకు వచ్చి అతడిని చూసి వులిక్కిపడ్డాడు.

ఆరడుగుల మనిషి: గున్న ఏనుగులా వున్నాడు. చింపిరి జుత్తు, పెద్ద మీసాలు, గెడ్డం. కళ్లు ఎర్రగా వున్నాయి. పైజమా, జుబ్బాలో వున్నాడతను. టేబుల్ మీద నల్లటి ప్లాస్టిక్ బాగ్ వుంది.

ప్లాస్టిక్ బాగ్‌లోంచి రమ్‌బాటిల్ తీసి అతడు తాగుతున్నాడు.

'ఇక్కడ తాగకూడదు సార్!' అన్నాడు సర్వర్.

అతడు కోపంగా సర్వర్ వంక చూశాడు.

ఆ చూపుకు సర్వర్ తృళ్ళిపడ్డాడు.

'నోరు మూసుకో!' అర్చాడతను.

సర్వర్ మౌనం వహించాడు.

'అర ప్లేట్ చికెన్ బిర్యానీ పట్రా! చికెన్ కుర్మా, చపాతీ పట్రా!' అన్నాడతను.

సెర్వర్ బయటికెళ్ళాడు. అతడు అడిగిన పదార్థాలు తెచ్చి ప్లేట్లను టేబుల్‌మీద పెట్టాడు. గ్లాసులో చల్లటి నీళ్ళు వుంచాడు.

''మీరిక్కడ తాగుతున్నట్లు తెలిస్తే నా వుద్యోగం పోతుంది, సార్,'' అన్నాడు సెర్వర్.

"నువ్వు వాగితేగాని ఎలా తెలుస్తుంది? నీ నోరుకు తాళంవేసి నీ పని చూసుకో. నువ్వేదేనా వాగితే నీ పీక పిసికేస్తాను,'' అన్నాడతను.

ఆ మాటలు విని సెర్వర్ లోలోపల భయపడ్డాడు.

"నేను వాగను సార్!" అన్నాడతను భయంగా.

"అలా కోపకురా. నే వెళ్ళేటపుడు నీకు మంచి టిప్ ఇస్తాలే," అన్నాడతను.

సెర్వర్ వెళ్ళిపోయాడు. అతడు ఆకలితో తిన సాగాడు. తింటూ మధ్యలో రమ్ సేవిస్తున్నాడు. నీళ్ళు కలుపుకోకుండా రమ్‌ను తాగేస్తున్నాడు।

టేబుల్ మీదున్న ప్లేట్లు ఖాళీ అయినాయి. కొన్ని ఎముకలు మాత్రం టేబుల్‌మీద పడున్నాయి.

సెర్వర్ మళ్ళీ గదిలో కొచ్చాడు. ఖాళీ ప్లేట్లవంక చూశాడు.

"బిల్లు యివ్వనా?" అడిగాడు సెర్వర్.

"మరో అరప్లేటు బిరియానీ!" అన్నాడతను.

కాస్సేపట్లో బిర్యానీ ప్లేటును సెర్వర్ టేబుల్ మీద పెట్టాడు.

అతడు మరికొంత రమ్‌తాగి తింటూ కూర్చున్నాడు. అతను తిండి పూర్తిచేసే సరికి పదకొండు దాటింది. రమ్ బాటిల్ ఖాళీ అయింది.

సెర్వర్ కాబిన్‌లోకి వచ్చాడు. అతడు బిల్‌వైపు చూశాడు. వెంటనే బిల్లు చెల్లించాడు.

'ఒక రూపాయి నీకు' అన్నాడతను.

వినయంగా సెర్వర్ అతడికి థాంక్సు చెప్పాడు.

అతడు హోటల్లోంచి బయటకు నడిచాడు. రోడ్డమ్మట మెల్లిగా నడవసాగాడు.

గతంలోంచి ఏవేవో దృశ్యాలు అతనికి కనిపిస్తున్నాయి।....

తన తల్లి దండ్రులు మరణించారు. దిక్కులేని స్థితిలో అతడు మావయ్య యింటికి చేరుకున్నాడు. అతడితో తన అక్కయ్యకూడా వుంది. మావయ్య యింటికి వెళ్ళేసరికి అతని వయసు పది సంవత్సరాలు. అక్కయ్య వయస్సు పదమూడు. ఆమె అప్పుడే పెద్ద మనిషి అయింది.

మావయ్య గురుమూర్తి వయస్సు నలభై దాటింది. అతడికి నలుగురు పిల్లలు.

అక్కయ్య అంటే అతనికెంతో ప్రేమ. తనకు తల్లిలేదు. అక్కయ్య తనకు తల్లిగా వుండేది.

ఒకనాటి రాత్రి అక్కయ్య అతడు పడుకున్న గదిలోకి వచ్చి పరుపుమీద పక్కనే వాలిపోయి ఏడుస్తోంది!

అతడు మేలుకున్నాడు. ఏడుస్తున్న అమెవంక చూశాడు.

"ఎందుకు ఏడుస్తున్నావు?" అడిగాడతను.

ఆమె తన పావడావంక చూపించింది. అతడామె పావడావైపు చూశాడు. రక్తం మరకలు!

"ఏమైంది? ఎక్కడేనా పడ్డావా?" అడిగాడతను.

"మావయ్య నన్ను చెరిచాడు." అందామె.

అతడికి అర్థంకాలేదు. మావయ్య ఏం చేశాడు?

ఆమె వివరంగా చెప్పలేదు. ఆమె చెప్పినా అతడికి అర్థమయ్యేది కాదు:

కాసేపట్లో అతడికి నిద్రపట్టేసింది.

నిద్రపోతున్న తమ్ముడిని ఆమె పక్కనే పడుకో పెట్టుకొని, అతడి మీద చెయ్యి వేసింది....

అతడు రోడ్డమ్మట నడుస్తూ సిగరెట్ వెలిగించాడు. పొగవదుల్తూ పైకి చూశాడు.

ఆకాశంలో అర్ధ చంద్రుడు ప్రకాశిస్తున్నాడు.

నక్షత్రాలు మెరుస్తున్నాయి. తిరిగి మెల్లిగా రోడ్డమ్మట నడవసాగాడు.

# 5

రాత్రి పన్నెండు దాటింది. కేవలరామ్ తన భార్యతో రోడ్డమ్మట నడుస్తున్నాడు. లేట్ షో సినిమా చూసి వాళ్ళు వస్తున్నారు.

అతడి భార్య నిరుపమ చాలా హుషారైన యువతి. ఆమె వయస్సు పదహారు దాటింది. పచ్చగా పొడుగ్గా వుంటుందామె. ఎర్రటి పెదిమలు, పొడుగాటి జడ.

ఆమె చాలాచమత్కారంగా మాట్లాడుతుంది. 'ఎవడో రేపిస్టు పట్నంలో తిరుగుతున్నాడని అన్ని పత్రికల్లోనూ ముద్రించారు. ఈ సమయంలో మనం యిలా తిరగడం ప్రమాదకరం!' అందామె.

'ఆ రేపిస్టును రానీ! వాడికి బుద్ధి చెప్తాను.' అన్నాడు కేవల్‌రామ్, కరాటేలో అనుభవం వున్న వ్యక్తి.

'అతడిని చంపేస్తారా?' అందామె.

'చంపినంత పని చేస్తాను,' అన్నాడతను.

రోడ్డులైట్లు పగిలి పోవడం వలన వెలగడం లేదు. ఆమె పక్కనే అతడు నడుస్తున్నాడు. ఎవరో ఎదురుగా వస్తున్నారు.

ఆమె ఆగి అతడిని పట్టుకుంది.

'నిరుపమా, భయపడకు! నేనున్నాగా!' అన్నాడు.

ఎదుటి వ్యక్తి దగ్గరగా వచ్చాడు. అతడి చేతిలోని ఆయుధం పైకి లేచింది. కేవల్‌రామ్ అతడిని కాల్తో తన్నాడు. వెనక్కి పడబోయి అతడు ఆపుకొన్నాడు.

"రాస్కెల్, నన్ను ఎదిరిస్తావా?" అర్చాడతను.

రెప్ప పాటులో అతడు కేవల్‌రామ్ మీదకు దూకాడు. కేవల్‌రామ్ చంపమీద కొట్టాడు. అతడు కిందపడ్డాడు. కాని వెంటనే లేచాడు. ఆ వ్యక్తివంక చూశాడు కేవల్‌రామ్. పిశాచంలా వున్నాడతను.

ఇద్దరూ పది నిముషాలపాటు ఘోరంగా పోట్లాడారు. ఆమె పరుగెత్తుకెళ్ళి ప్రహరీ గోడ ప్రక్కనే నక్కి దాక్కుంది. అక్కడ కొంచెం చీకటిగావుంది.

రోడ్డుమీద రెండు ఆకారాలు ఆమెకు కనిపిస్తున్నాయి. ఒక ఆకారం లేచినుంచుంది. తన భర్త ఏమయ్యాడు? నిలబడిన వ్యక్తి తన భర్త కాదని ఆమె పోల్చగలిగింది.

కాస్సేపట్లో రోడ్డుమీది ఆకారం తనవైపు రావడం గమనించి ఆమె పరుగెత్త సాగింది. ఆమె గట్టిగా అరుస్తూ పరుగెత్తింది.

రోడ్డు ఇరువైపులా ధనవంతులు నివశించే పెద్ద మేడలున్నాయి. కొంతమంది రోడ్డుమీదకు పరుగెత్తు కొచ్చారు, ఆమె అరుపులు విని.

"ఎవరో స్త్రీ వచ్చింది? ఆమె ఎక్కడుందో?" అన్నాడొకవ్యక్తి.

ఆమె కోసం అందరూ వెతికారు. ఆమె రోడ్డు వారన ప్రహరీగోడ పక్కన పడుంది. ఆమె తలమీద బొప్పికట్టింది కాస్సేపట్లో ఆమె మేలుకొంది. వెక్కి

వెక్కి ఏడ్వసాగింది.

మెల్లిగా ఆమె తన భర్త పడున్న చోటకు వెళ్ళింది. రక్తం ముడుగులో పడున్న అతడిని చూసి ఆమె భయంతో అర్చిచి. అతడిమీద పడిపోయింది.

"ఏమైందమ్మా?" అడిగాడు కర్నల్ శాస్త్రి.

కర్నల్‌శాస్త్రి రిటైరయ్యాడు. ఒకప్పుడు అతడు ఆర్మీలో పనిచేశాడు. పెద్ద మేడలో అతడు నివశిస్తున్నాడు.

"ఆ దుర్మార్గుడు దొరికాడా?" ప్రశ్నించిందామె.

"లేదు. అతడు పారిపోయాడు," అన్నాడు శాస్త్రి.

కర్నల్ శాస్త్రి వేగంగా తన యింట్లోకి వెళ్ళాడు.

పోలీసు రిపోర్టు యిచ్చాడు.

"కర్నల్. మేం వస్తున్నాం. అంతవరకూ మీరు అక్కడే వుండండి." అన్నాడు ఇన్‌స్పెక్టర్ నాయర్.

"అలాగే," అన్నాడు కర్నల్ శాస్త్రి.

# 6

ఇన్‌స్పెక్టర్ నాయర్ జీప్ వెనకనే డాడ్జి కారాపి కిందకు దిగాను. నాయర్ నా దగ్గరకు వేగంగా వచ్చాడు.

రోడ్డుమీద అనేక మంది వున్నారు. అక్కడక్కడ కానిస్టేబుల్సు కనిపిస్తున్నారు.

'బ్రదర్, యీ సారి హత్యలోకి దిగాడు మనం వెతుకుతున్న రేపిస్ట్!' అన్నాడు నాయర్.

ముందుకు వెళ్ళి అతడిని టార్చి కాంతిలో పరీక్షిం

చాను. పాంటు, స్లాక్‌లో వున్నాడతను. కాళ్ళకు ఖరీదైన బూట్లు. అతని పక్కనున్న ఆమెవైపు చూశాను. ఆమె వయస్సు యిరవై నాలుగుంటుంది. చాలా అందంగా వుంది.

మళ్ళా పడున్న అతడి వంక చూశాను. బట్టల మీద రక్తం మరకలు. అతడి తల పగిలింది.

ఆమె కేసి జాలిగా చూశాను.

'ఏమైంది? అడిగాను.

ఆమె జరిగిన దంతా చెప్పింది.

'నేను అరవడం మూలంగా అతడు బాగా భయపడి వుంటాడు. నా తల మీద కొట్టి అతడు పారిపోయాడు," అందామె.

'అతడిని నువ్వు బాగా చూశావా?'

'చూశాను సార్. పొడుగ్గా బలంగా వున్నాడు. పైజామా, జుబ్బా ధరించాడు. చేతిలో వల్లటి బాగ్ వుంది, గడ్డం, చింపిరి జుత్తు. దూరంలో వున్న అతడిని చూడ గానే నా కెందుకో భయమేసింది. నా భర్తతో చెప్పాను. ఆయన కరాటే నేర్చుకుంటున్నాడు, భయపడొద్దని అన్నా రాయన,' అందామె.

పోలీస్ డాక్టర్ సుధాకర్ వచ్చి శవాన్ని పరీక్షించ సాగాడు. ఇన్‌స్పెక్టర్ నాయర్‌తో నేను దూరంగా వెళ్ళాను. సిగరెట్ వెలిగించాను. చల్లగాలి వీస్తోంది.

'బ్రదర్, ఏమంటావు?' అడిగాడు నాయర్.

'మనం వెతికే రేపిస్టు అతడే। సందేహం లేదు. ఆమె భర్త అతడిని ఎదిరించాడు. ఆ పరిస్థితుల్లో హత్య జరిగింది. ఆమె అరవడం మూలంగా అనేకమంది యిళ్ళ

లోంచి బయటకు వచ్చారు. ఆమెను బలాత్కరించే అవ కాశం అతడికి చిక్కలేదు. ఆమె తలమీద కొట్టి అతడు పారిపోయాడు,' అన్నాను.

'బ్రదర్, అతడివి మనం తొందరగా పట్టుకోవాలి ఈ హత్యను గురించి పేపర్లలో విశేషంగా ప్రచారం జరుగుతుంది. ప్రజలు పోలీసులను తిడ్తారు!' అన్నాడు ఇన్‌స్పెక్టర్ నాయర్.

'.నాయర్ భాయ్, యీ ప్రదేశాన్ని పూర్తిగా గాలిం చండి అతడు ఎక్కడేనా ఏదేనా వదిలేశాడేమో కనుక్కోండి' అన్నాను.

'వెతకమంటావా,' అన్నాడు యిన్‌స్పెక్టర్.

డాక్టర్ సుధాకర్ మా దగ్గర కొచ్చాడు.

'పన్నెండున్నర ప్రాంతంలో అతడు మరణించాడు. తల పగలడం మూలంగా మరణం సంభవించింది. యినప కడ్డీతో తలమీద బలంగా చాలా సార్లు కొట్టి వుండాలి,' అన్నాడతను.

మరి కొన్ని వివరాలు నేను తెల్సుకున్నాను. అతడి పేరు కేవలరామ్. ఒక యింజనీరింగ్ కంపెనీలో అతడు పని చేస్తున్నాడు. పెళ్ళయి మూడేళ్ళయింది. అతడికి పిల్లలు లేరు!

ఇన్‌స్పెకర్ నాయర్ నా దగ్గర కొచ్చాడు.

'బ్రదర్, యిలారా!' అన్నాడతను.

అతడితో వెళ్ళాను. రోడ్డు వారగా సగాన్ని పగిలిన రమ్ బాటిల్ వైపు టార్చి కాంతిలో చూశాను.

"అతడు డ్రంకర్డ్ అయి వుండాలి!" అన్నాడు నాయర్.

"దానిమీద వేలి ముద్రలు వున్నాయేమో చూడండి," అన్నాను.

ఫింగర్ ప్రింట్ ఎక్స్పర్ట్ సుగేశన్ వచ్చాడు. తన పరీక్షలు ముగించి కొన్ని నిమిషాల తర్వాత అతడు నా దగ్గరకు వచ్చాడు.

"పరశురామ్‌గారూ, ఆ బుడ్డీ మీద వేలి ముద్రలు వున్నాయి," అన్నాడతను.

"ఈ బాటిల్ అతడు పడేసిందో, కాదో!" అన్నాను.

"అతడే పడేశాడని మనం అనుకోవాలి," అన్నాడు ఇన్స్పెక్టర్ నాయర్.

'ఆల్ రైట్. వేలి ముద్రలను బట్టి అతడెవరో కనుక్కోడానికి ప్రయత్నించండి. ఇంతకు ముందు నేరాలు చేసి అతడు జైలుకి వెళ్ళి వుండొచ్చు!'

"అది చేయిస్తాను," అన్నాడు నాయర్.

నేను నా యింటికి వెళ్ళిపోయాను. రాత్రి ఏడింటికి టెలిఫోన్ మ్రోగింది. ఇన్స్పెక్టర్ నాయర్ కంఠం అటువైపునుంచి వినబడింది.

'బ్రదర్! అతడు యింతకు ముందు ఏ నేరాలూ చేసినట్లు లేదు. అతడి వేలిముద్రలు మా దగ్గర లేవు.' అన్నాడు నాయర్.

"కొత్తవాడై వుండాలి," అన్నాను.

'కొత్తవాడే! సందేహం లేదు,' అన్నాడు నాయర్.

కాస్సేపు ఆలోచిస్తూ మౌనంగా వున్నాను.

'నాయర్ భాయ్, పట్నంలో అనేక చోట్ల అతడు తిరుగుతున్నాడు. అతడి కోసం పట్నం నలువైపులా మనం అన్వేషించాలి,' అన్నాను.

'ప్రస్తుతం రెండు వందలమంది పట్నంలో అతడి కోసం గాలిస్తున్నారు. రాత్రి పదితర్వాత వాళ్ళ పట్నంలో తిరుగుతున్నారు.'

'మనం యింకా ఎక్కువ మందిని పెట్టాలి. కనీసం 500 మంది రాత్రిళ్లు తిరుగుతూ వుండాలి' అన్నాను.

'అలాగే వెంటనే ఏర్పాటు చేస్తాను,' అన్నాడు నాయర్.

# 7

రాత్రి పది దాటింది.

డాడ్జి కారును వేగంగా పోనిస్తున్నాను. చల్లటి గాలి వీస్తోంది. ఆకాశంలో నక్షత్రాలు మెరుస్తున్నాయి. చంద్ర కాంతి హాయిగా వుంది.

పర్సవాకంవైపు కారును పోనిచ్చాను. నా మెదడులో ఆలోచనలు సాగుతున్నాయి. అతడు ఎవరో ప్రస్తుతం మాకు తెలియదు. కాని అతనికి రమ్ సేవించే అలవాటుంది. అతడు తెగించిన మనిషి. ఏది చెయ్యడానికైనా వెను దీయడు।

పర్సవాకం వీధుల్లో అంతగా జన సంచారం లేదు. దినపత్రికల్లో ప్రచురించిన పోలీస్ హెచ్చరికను ప్రజలు చదివి వుంటారు. ప్రజలు తొందరగా యిళ్ళకు పోయి జాగ్రత్త పడుతున్నారు.

ఎండమ్ రోడ్డులో వున్న టీ షాపు ముందు కారు ఆపాను. కార్లో ఆలోచిస్తూ కూర్చున్నాను.

టీ షాపువైపు చూస్తున్నాను. నలుగురు వ్యక్తులొచ్చి టీ తాగి వెళ్ళిపోయారు.

కారును పోనిచ్చాను. ఐ.సి.ఎఫ్ ప్రాంతంలో కారును హఠాత్తుగా ఆపాను.

రోడ్డు వారగా ఎవరో పడున్నారు. కార్లోంచి దిగి అతడి వైపు నడిచాను. అతడు పాంటు, స్లాక్‌లో వున్నాడు. తలమీద దొప్పి కట్టింది. అతడిని చూస్తుంటే నాకు నిరుపమ గుర్తుకొచ్చింది.

అతడి నోటిలో కొద్దిగా విస్కీ పోశాను. అతడు కూర్చున్నాడు. నా వైపు గాభరాగా చూశాడు.

"ఐయామ్ పరశురామ్," అన్నాను.

అతడు నా చెయ్యి పట్టుకున్నాడు.

"పరశురామ్‌గారూ, అతడు యీ రోడ్డమ్మట వెళ్ళాడు. పైజామా, జుబ్బా, చింపిరి జుత్తునుబట్టి అతడిని నేను అనుమానించాను. అతడిని ఆపాను. అతడితో నేను ఎక్కువగా మాట్లాడలేక పోయాను. తటాలున అతడు నా తలమీద కొట్టాడు. నేను కింద పడ్డాను. మీరు వచ్చాక నాకు మెలుకువొచ్చింది," అన్నాడతను.

అతడొక పోలీస్ సి.ఐ.డి. అని తెల్సుకున్నాను. నాయర్ ఏర్పాటు చేసిన ఐదువందల మందిలో అతడు ఒకడు।

"అతడు ఎటు వెళ్ళిపోయాడు?" ప్రశ్నించాను.

"చెప్పలేను. ఇనపకడ్డీ నా తలమీద పడ్డాక అతడు ఎలా వెళ్ళాడో నేను చూడలేకపోయాను," అన్నాడతను.

"అతడిని నువ్వు బాగా చూశావా?"

"చూశాను సార్. చేతిలో నల్లటి బాగ్ వుంది. అందుకే అతడిని నేను అనుమానించాను. అతడిని పట్టుకోడానికి సాయిశక్తులా ప్రయత్నించాను. కాని

అతడు చాలా బలమైన వ్యక్తి." అన్నాడతను.

అతడిని కారులో కూర్చోమన్నాను. కారును వేగంగా పోనిచ్చాను. నా పక్కనే వున్నాడతను. రాయిపేట హాస్పిటల్లో అతడిని చేర్చి ఇన్‌స్పెక్టర్ నాయర్‌కి ఫోన్ చేశాను.

# 8

సావిత్రి తల్లి వైపు నవ్వుతూ చూసింది.

"నే వెళ్ళి నాన్నకు మందులు కొనితెస్తానమ్మా," అందామె.

తల్లి టైమ్ చూసింది. పది దాటింది.

"ఇంత రాత్రివేళ ఒంటరిగా వెళ్ళగలవా?" అడిగింది తల్లి.

"మరేం ఫరవాలేదమ్మా," అంది సావిత్రి.

తండ్రి నారాయణరావు జ్వరంతో పడున్నాడు. టెంపరేచర్ 102 దాటింది. వాళ్ళకు ఒక్కర్తే కూతురు. సావిత్రి బి.ఎ. చదువుతోంది. చాలా ధైర్యంగల వనిత. "ఇంత రాత్రి వేళ వెళ్ళొద్దమ్మా! ఎవరో రేపిస్టు పట్నంలో తిరుగుతున్నాడని పత్రికల్లో ప్రచారం చేస్తున్నారు' అందితల్లి.

"ఎవరో వెళ్ళి మందులుకొని తేకపోతే నాన్న బాధ పడ్తూవుంటాడు. నేను వెళ్ళతాను," అంది సావిత్రి.

"జాగ్రత్తగా వెళ్ళిరా," అంది తల్లి.

సావిత్రి యింట్లోంచి బయటకు నడిచింది. అరమైలు దూరంలో ఒక మందులషాపుంది. అది రాత్రంతా తెరిచివుంటుంది. దాని వైపు ఆమె వేగంగా అడుగు

లేస్తోంది.

రోడ్డుమీద జన సంచారం ఎక్కువగా లేదు. మొగాళ్ళు మాత్రం రోడ్డమ్మట నడుస్తున్నారు. ఆడవాళ్ళు ఎక్కడా లేరు.

ఆమె రోడ్డు వారగా వేగంగా నడుస్తోంది. ఎవరో ఎదురుగా వస్తున్నారు. ఆమె భయపడలేదు. ధైర్యంగా ముందుకు వెళ్ళింది.

అతడామె చెయ్యి పట్టుకొని నోరునొక్కాడు. ఆమె అరవలేక పోయింది. గింజుకొని దూరంగా పోడానికి ఆమె ప్రయత్నించింది. అతడి చేతుల్లోంచి ఆమె బయట పడలేక పోయింది.

అతడామెను నేలమీదకు పడగొట్టాడు. ఆమె మీద వాలాడు. ఆమె కాళ్ళతో అతడిని తన్నింది. అతడామె చెంప మీద బలంగా కొట్టాడు. ఆమె వెనక్కి పడింది.

డాక్టర్ కారును వేగంగా పోనిస్తున్నాను. హెడ్ లైట్ల కాంతిలో రోడ్డు వారగా పడున్న వాళ్ళవైపు చూశాను. చటుక్కున కారును ఆపి కిందకి దూకాను.

వాళ్ళ వైపు కదిలాను. ఆమె అరవడానికి ప్రయత్ని స్తోంది. కాని అరవలేక పోయింది. అమాంతంగా అత డిని వెనక్కి లాగాను.

అతడు నా వైపు కోపంగా చూశాడు. ఇనపకడ్డీ పైకి లేచింది. నా తల వైపు దిగింది. చటుక్కున ప్రక్కకు జరిగాను. కడ్డీ నేలకుకొట్టుకొంది. కాల్తో అతడి పొట్టలో తన్నాను. అతడు వెనక్కి పడ్డాడు. అతడి మీదకు దూకాను. నేల మీద పడున్న అతడిపైన కూర్చున్నాను. చేతి వెనక భాగంతో అతడి చంపల్ని బాగా వాయించాను.

అతడు మూలుగుతూ నావైపు చూశాడు. 'రాస్కెల్' అర్చాను.

అతడి చంపల్ని మరో సారి కొట్టాను. అతడు కదల కుండా పడున్నాడు. లేచాను. అతడిని లేవదీసి కాల్తో మళ్ళా తన్నాను. అతడు దూరంగా పడ్డాడు.

అతడివైపు వెళ్ళాను. అతడు కదిలే స్థితిలో లేడు. అతడి చేతులకు బేడీలు వేశాను. వెనక్కి తిరిగి ఆమె దగ్గరకి పరిగెత్తాను.

ఆమె లేచి నా వైపు భయంతో చూసింది.

'ఐ యామ్ డిటెక్టివ్ పరశురామ్,' అన్నాను.

ఆమె నా చెయ్యి గట్టిగా పట్టుకుంది.

" పరశురామ్ గారూ, మీరు నన్ను రక్షించారా !" అందామె.

'ఎక్కడి కెళ్తున్నావు ?' అడిగాను.

ఆమె అంతా వివరంగా చెప్పింది.

అతడు గింజుకుంటున్నాడు. అతడి దగ్గరగా వెళ్ళి మళ్ళా చంపల్ని వాయించాను. కదిలే స్థితిలో లేడతను.

నా కార్లో వెనుక సీటుమీద అతడిని పడేశాను. ఆమెను ముందు కూర్చోమన్నాను. కార్ను పోనిచ్చాను. మందులషాపు ముందు కారాపాను. ఆమె మందులు కొంది. టెలిఫోన్‌లో ఇన్‌స్పెక్టర్ నాయిడితో మాట్లాడాను.

"బ్రదర్, ఏమిటి?" అడిగాడు నాయర్.

"మన రేపిస్టు నాకు దొరికాడు. కమ్ ఎట్ ఒన్స్!" అన్నాను.

"ఎక్కడున్నావు నువ్వు?"

"రాజా మెడికల్ స్టోర్స్‌లో' అన్నాను.

"అక్కడే వుండు. వస్తున్నాను,' అన్నాడు నాయర్.

రిసీవర్ పెట్టేశాను. ఆమెవంక నవ్వుతూ చూశాను.

"ఈ మందులు నాన్నకు తొందరగా అంచచేయాలి,' అంది సావిత్రి.

కార్లో ఆమెను తీసుకెళ్ళి యింటిదగ్గర దింపాను. ఆమె నాకు థాంక్స్‌చెప్పి లోపలకు వెళ్ళిపోయింది. కారును వేగంగా రాజా మెడికల్స్‌కి పోనిచ్చాను.

పోలీస్ జీప్ అక్కడ ఆగివుంది. ఇన్‌స్పెక్టర్ నావైపు వచ్చారు. కార్లోంచి దిగాను.

"అతడు నా కార్లో వెనక సీటుమీద పడుకొని వున్నాడు. చెక్ హిమ్' అన్నాను నవ్వుతూ.

ఇన్‌స్పెక్టర్ నాయర్ కారు లోపలకు వంగిచూశాడు.

"ఇతడిని జీప్‌లో పడేయండి,' అన్నాడు నాయర్ సమీపంలో వున్న కానిస్టేబుల్‌తో.

"బ్రదర్, యీ పక్కలకు నువ్వెలా వచ్చావు?"

"నాయర్ భాయ్, గాయపడి హాస్పిటల్లో వున్న జయదేవ్‌ను మనం మెచ్చుకోవాలి. అతడు యీ రేపిస్టును చూశాడు. అతడిని హాస్పిటల్లో చేర్చి యీ పరిసరాల్లో తిరగసాగాను. నేను అనుకొన్నట్లు అతడు నాకు చిక్కాడు,' అన్నాను. సావిత్రిని గురించి నాయర్‌తో చెప్పాను. ఆమెఅడ్రెస్ యిచ్చాను.

"ఈ దుష్టుడు ఆమెను బలాత్కరించబోయాడు. సరైన టైములో వెళ్ళి ఆమెను కాపాడ గల్గినందుకు సంతోషిస్తున్నాను," అన్నాను హుషారుగా.

"బ్రదర్, చాలాథాంక్స్,' అన్నాడు నాయర్.

—: ఐపోయింది :—

# బర్త్ డే గిఫ్ట్

కె. వి. యస్. కుమార్

"ఐతే విమల మళ్ళీ నన్ను ప్రేమిస్తుందంటారా సిస్టర్ !?" నీరసంగా ప్రశ్నించాడు రాజారావు.

"తప్పకుండా...."

"ఏమో సిస్టర్ ! నా కేమో చాలా భయంగా వుంది. విమల స్వభావం నాకు బాగా తెలుసు. ఆమె అలాంటిది కాదు. కాని నన్ను, నాకు సంక్రమించిన ఈ రోగాన్ని తల్చుకుంటే నాపై నాకే అసహ్యం వేస్తోంది. అలాంటి నన్ను చూస్తూ చూస్తూ ..."

"మీరు పొరబడు తున్నారు రాజారావు గారూ ! ఒక ప్పుడు 'T. B.' అంటే ఎంతో భయపడే వారు. కాని ప్రస్తుతం ఆ భయమేమీ అక్కర్లేదు. కొత్త కొత్త మందులెన్నో సృష్టించ బడుతున్నాయి. భయంకరమైన బాధలవల్ల నరకయాతన అనుభవిస్తోన్న ఎందరో రోగుల్ని మృత్యు ముఖం నుండి కాపాడ గలుగు

తున్నాయి. అయినా మీరు ఆరంభ దశలోనే కనుక్కొని అడ్మిటయ్యారు. మీ కొచ్చిన భయమేమీ లేదు. నెలలోగా మీరు తిరిగి ఎప్పటిలా అవుతారు. విమలగారి ప్రేమను తప్పక పొందగలరు."

'సిస్టర్...'

'చెప్పండి....'

'...నా ఆయుర్దాయ మెంతో చెప్పగలరా ?'

'మీ ప్రశ్నకు జవాబు భగవంతుడు తప్ప నువెవ్వరూ చెప్పలేరు రాజారావు గారూ ?'

'ఆ భగవంతుడు మీలో వున్నాడు సిస్టర్ ! ....సిస్టర్ ....ఒకవేళఅకస్మాత్తుగా నా ప్రాణం పోవడం సంభవిస్తే దయచేసి ఈ వార్త నా విమలకు తెలుపుతారు కదూ !' రాజారావు కంఠం వణికింది.

'రాజారావుగారూ !' లాలనగా అంది యామిని.' మీ రనవసరంగా ఆందోళన పడుతున్నారు. విపరీతాలోచనల వల్ల అనవసరంగా మీ హృదయాన్ని మీరే గాయపరచు కుంటున్నారు. మనషికి మానసిక విశ్రాంతి చాలా అవ సరం. అది లేని నాడు ఎంత ఆరోగ్య వంతుడైనా రోగి కాక తప్పదు. అటువంటి వ్యక్తికి ఏ ఆస్పత్రి మందూ పనిచెయ్యదు. ముఖ్యంగా ఇటువంటిసమయాల్లో పూర్తిగా రెస్టు తీసుకోవాలి. లేకపోతే మీ ఆరోగ్యం చెడ్పతిని ప్రమాదంగా పరిణమించే ప్రమాదం వుంది !....నే చెప్పి నట్టు వింటూండండి. ముప్పైరోజుల్లోగా మీరు తిరిగి పరి పూర్ణారోగ్యంతో, సంపూర్ణ కళాకాంతులతో వెళ్ళగలరు. అంతేకాదు. త్వరలోనే విమలగారితో వచ్చి వెడ్డింగ్ కార్డు నా చేతికివ్వగలరు....'

'నిజంగానా ?!' రాజారావు కళ్ళు ఒక్క క్షణం మెరిశాయి.

'మర్చి పోతారా ?' వెంటనే అంది యామిని.

'ప్రాణం పోసిన తల్లిని, ప్రాణం నిలబెట్టిన చెల్లిని మరచినవాడు బ్రతికి చచ్చిన వాడితో సమానం సిస్టర్.... మీరు నన్నపార్థం చేసుకున్నారు నేనన్నది...'

'అర్థం చేసుకున్నాను. జోగ్గా అన్నాను. మరోలా అనుకోకండి....'

'ఒకవేళ మీరన్నట్టు జరిగితే తొలి శుభలేక మీకే అందుతుంది సిస్టర్....'

'థాంక్స్....ఆ శుభ సమయం కోసం ఆత్రుతగా ఎదురు చూస్తూ ఉంటాను. ఆఁ...ఇక పడుకోండి. ఏదీ ఆలోచించక హాయిగా నిద్రపోండి....'రాజారావు గుండెలపై మృధువుగా చేతి వ్రేళ్ళతో రాసి అతని ఛాతి వరకు రగ్గు కప్పింది యామిని,

తృప్తిగా కళ్లు మూసుకున్నాడు రాజారావు.

స్టూలుపై ఖాళీ సిరంజీని తీసుకొని తన సీటువద్దకు వచ్చి కూర్చుంది యామిని రాజారావు గురించేఆలోచిస్తూ.

వెన్నలాంటి హృదయం రాజారావుది। అతనికి, తనకు మధ్య సోదర భావాన్ని సృష్ఠించిన ఈ హాస్పిటల్ ఋణం ఎలా తీర్చుకోగలదు తను? అతని ప్రేమ కథంతా ఓ సీరియల్‌లా చెప్పాడుతనతో. అఫీసుకు సెలవైతే పెట్టాడు కాని విమలకు మాత్రం విషయం తెలియనివలేదు· మామూలుగా ఉత్తరాలు రాస్తూనే వున్నాడు।

'విమలకు నేను ద్రోహం చేస్తున్నానేమో సిస్టర్'

అంటాడు. 'ఒకవేళ నా రోగం ముదిరి నేనేమైనా ఐపోతే నా విమలకు దిక్కెవరు సిస్టర్!?....నేను బ్రతకాలి. నాకోసం కాకపోయినా నా విమల కోసమైనా నేను బ్రతకాలి. బ్రతికి తీరాలి. దయచేసి నన్ను బ్రతికించండి సిస్టర్!' అని రోదిస్తాడు.

విమలపై అతనికెంతో ప్రేమ!?!

రాజారావు గతాన్ని గుర్తుకు తెచ్చుకునేసరికి యామిని హృదయం అదోలా అయ్యింది. అతని పవిత్ర ప్రేమను తలపుకు తెచ్చుకునేసరికి అమె కన్నుల్లోంచి ఆనంద భాష్పాలు జలజలా రాలాయి. కాని ఆ వెనుక దుఃఖభాష్పాలుకూడ పరుగులు తీశాయ్!

....సుధీర్....తన సుధీర్‌కూడ ఇలాంటి మనసు గలవాడైవుంటే!: ఓహ్! తన జీవితం పూలమయం అయ్యుండేది! మరి..మరి..ఎందుకిలా అయ్యింది? తను అధోగతిపాలు కావటానికి కారణం ఎవరు?

ఈ ప్రశ్నకు జవాబెవరు చెప్పగలరు?

'మనిషికి మానసికంగా ప్రశాంతత చాలా అవసరం. మానసికాందోళనలున్న వ్యక్తులెంత ఆరోగ్యవంతులైనా రోగులు కాక తప్పదని రాజారావుకు సులభంగా సలహా లివ్వగలిగిందితను. మరి ఈ విషయంపై తనెంత వరకు కృతకృత్యురాలు కాగలిగింది? తన హృదయంలో రగులుతోన్న అగ్నికణాల్లాంటి సంఘటనల్ని మరువ గలుగుతోందా?

అ విమల ఎవరో కాని ఎంత అదృష్ట వంతురాలు? రాజారావు లాంటి సహృదయుడ్ని భర్తగా పొందబోతోంది.

మరితను....'??

విధి తనతో ఎందుకు చెలగాట మాడింది ? భగవంతుడు తనతో ఎందుకంత క్రూరంగా ఆడుకున్నాడు ? అసలు తన్నెందుకు సృష్టించాడు ? తనలాంటి వారికి గుణపాఠం నేర్పాలనేనా ? ... తను గత జన్మలో ఎవరికేం పాపం చేసింది ?

ఆ నిశ్శబ్ద ప్రశాంత వాతావరణంలో ఒంటరిగా మూగగా హృదయ విదారకంగా రోదించింది యామిని. గత సంఘటనలు ఆమె హృదయం లోంచి తన్నుకు రాసాగాయి....

# 2

'హేపీ బర్త్‌డే టూ యూ....' స్నేహితుల, స్నేహితురాళ్ళ కేరింతల మధ్య అందంగా కేక్ కట్ చేసింది పద్మ. అందరూ చప్పట్లు కొట్టారు. ఆడారు. పాడారు....

ఫంక్షన్ అయిపోతుండగా వచ్చిందిరేఖ. ఆలస్యంగా వచ్చిన స్నేహితురాల్ని చూసి కోపంతో చిందులేసింది పద్మ.

' యూ బ్రూట్! త్వరగా రమ్మని మరీ మరీ చెప్పాను. విన్నూ...'

ఎక్స్క్యూజ్ మీ పద్దూ! మా నాన్నగారు....'

'ఏం? మీ నాన్నగారు స్నేహితురాలి బర్త్‌డే క్కూడ పంపని సంకుచిత స్వభావులు కారే!

'అసలు విషయం....'

'అవున్లే, నాకంటే ముఖ్యమైన పనులెన్నో, ముఖ్యమైన ఫ్రెండ్స్ఎందరో నీకు. మేం గుర్తుంటామా? నువ్వం

దరికంటే ముందొస్తావని ఆశించి ఆశను పెంచుకొని ఎదురు చూడ్డం నాదే బుద్ధి తక్కువ.'పద్మ కళ్ళలో నీళ్లు తిరిగాయ్.

'నాకు మాత్రం నిన్ను బాధ పెట్టాలనే ఉద్దేశం ఉందంటావా పద్మా!' రేఖ కళ్ళు ద్రవించాయ్.

'మరైతే ఇంతాలస్యం చేశావేం?' వెక్కుతూ అంది పద్మ.

'చెప్పేది పూర్తిగా విను... పద్మా! మా నాన్నగారి సంగతి నీకూ పూర్తిగా తెలుసుగా! ఈ రోజు మరీ ఎక్కువగా వుంది చెస్ట్‌పెయిన్. డాక్టరుగారిని తీసికెళ్ళి కాస్త బాధ తగ్గే వరకూ ఉండాల్సొచ్చింది.'

'అ....!?'

'నిజం పద్మా!'

'ఇప్పుడెలా వుంది?' పద్మలోని కోపం పటాపంచలై దానిస్థానే ఆత్రం ఆక్రమించుకుంది.

'ఇంజక్షనిచ్చి వెళ్ళారు డాక్టరుగారు. నిద్రపో తున్నారు.'

"సారీ రేఖా! ఆవేశంలో తొందరపడ్డాను. నువ్వు రాలేదనే కోప్పడ్డాను కాని అసలు విషయం తెలుసు కోటానికి కాస్త ఓర్పు చూపలేకపోయాను. నన్ను క్షమించవూ!" పద్మ కన్నీళ్ళు బుగ్గల మీదుగా జారాయి.

"మరి నే వెళ్లొస్తా పద్మా! నువ్వు బాధ పడుతుంటా వని ఈ విషయం చెప్పిపోదామని వచ్చాను. మళ్ళీ కలు స్తాను." హడావుడిగా వెళ్ళిపోయింది రేఖ...

పద్మ, రేఖలది మామూలు స్నేహం కాదు. చిన్నప్ప ట్నుండీ ప్రాణ స్నేహితులు. ఏడవ తరగతి నుండి

కలిసే చదివారు. ఒకర్ని విడిచి ఒకరు ఒక్క క్షణం కూడ ఉండేవాళ్ళు కాదు. రేఖ తండ్రి భూషణంగారు లాయరుగా పేరుతో బాటు డబ్బు కూడ బాగా సంపాదించారు.

ఏడాది క్రితం రేఖ తల్లి సుందరమ్మగారి మరణం భూషణం గార్ని బాగా క్రుంగదీసింది. పిచ్చిపట్టిన వాడిలా అయిపోయారాయన! కేసులు తీసుకోవటం మానేశారు. ఎప్పుడూ ఆలోచిస్తూ శూన్యంలోకి చూస్తూ గడిపేవారు విపరీతంగా సిగరెట్లు కాలుస్తూ. తండ్రి పక్కనే వుంటూ ఎప్పుడూ ఆయన్ని కనిపెట్టుకొనుండే బాధ్యత రేఖను కాలేజీ మాన్పించింది. ఆదాయం లేకపోయేసరికి ఉన్న ఆస్తి క్రమంగా తరిగిపోసాగింది.

....రేఖ కుటుంబ పరిస్థితులు నానాటికీ దిగజారిపోసాగాయి. భూషణంగారికి గుండె జబ్బు సంక్రమించింది. సుదర్శనం గారాయనకి ప్రాణం పొయ్యసాగారు.

పద్ధెనిమిదేళ్ళు నిండని రేఖ ముఖంలో నలభై ఏళ్ళని చూస్తూ పద్మ ఎంతో బాధ పడేది. భూషణంగారిని ఒప్పించి తన తండ్రి పలుకుబడి నుపయోగించి రేఖకో ప్రయివేట్ కంపెనీలో జాబ్ యిప్పించింది.

రేఖ కుటుంబం నెమ్మదిగా సర్దుకోసాగింది.

అటువంటి రేఖ తగిన కారణం లేందే పద్మ బర్త్ డే కఫెంక్షన్ కాకుండా వుండగలదా? .... మరి రేఖ లేందే పద్మ పుట్టిన రోజు సంతోషంగా గడవగలదా???

# 3

'రేఖా ! మామయ్య కెలా వుంది?' అంటూ వచ్చింది పద్మ ఆ సాయంత్రమే.

"కాస్త నయమే ! కమాన్. ఏదేనా ప్రోగ్రామా ?" తడి చేతుల్ని నాప్‌కిన్‌కి తుడుచుకుంటూ వచ్చింది రేఖ.

"నువ్వు లేని లోటు బాగా కన్పించింది రేఖా...." దిగులుగా అంది పద్మ.

"భ లే దా ని వే. యిప్పుడంటే సరే .... రేపు పెళ్ళయ్యాక ....?"

"ఆ సంగతికేం గాని, నీకు పరిచయం చెయ్యటానికి వీల్లేకపోయింది. మా బావొచ్చాడు...."

"అలాగా !"

"ఆఁ .... యిక్కడికి తీసుకొచ్చాను. బావా .... !"

వెనక్కి చూస్తూ పిలిచింది పద్మ. నెమ్మదిగా లోపలికి ప్రవేశించాడతను.

చామనచాయ. ఆకర్షణీయంగా వున్నాడు. నొక్కుల క్రాపు. లాల్చీ పైజమాలతో సింపుల్‌గా వున్నాడు.

"మీట్ మై బావ. సుధీర్. ఎల్. ఐ. సి లో వుద్యోగం." నవ్వుతూ పరిచయం చేసింది పద్మ, ప్రాణ స్నేహితురాలిగా రేఖనీ సుధీల్‌కి పరిచయం చేస్తూ.

నమస్కార ప్రతినమస్కారాలయ్యాయి.

'నిలబడే వున్నారు. కూర్చోండి... '

'లేదు రేఖా ! వెళ్ళాలి. మా బావ రేపు వెళ్ళి పోతా నంటున్నాడు. వద్దన్నా వినకుండా సిన్మా ప్రోగ్రామ్ వేశాడు.'

'సిన్మాకేగా .... వెళ్ళి రండి....'

'నాకైతే వెళ్ళాలని లేదు. అందులోనూ నువ్వు....'

'యిది మరీ బావుంది. పాపం మీ బావగారు సరదా పడుతోంటే....'

'అలా చెప్పండి మీ ఫ్రెండుకి....' కల్పించుకున్నాడు సుధీర్ నవ్వుతూ.

'మా స్నేహితురాలు మరీ అమాయకురాలు కాదు లెండి' తనూ నవ్వింది రేఖ.

"మీరు చక్కగా మాట్లాడతారు." నవ్వుతూనే అన్నాడు సుధీర్.

"లేకపోతే నీలా మొద్దులా వుండమన్నావా ఏం?" వెంటనే అంది పద్మ.

'ఏమిటి పద్మా! అల్లరిచేయటానికి సమయం, సందర్భం వుండక్కర్లా....?' బుంగమూతి పెట్టాడు సుధీర్.

యికపై శాస్త్రిగారి సలహాలతో ముహూర్తాలు చూసి మరీ ఏడిపిస్తోంటాను. సరేనా?'

ముగ్గురూ బిగ్గరగా నవ్వుకున్నారు.

'...రేఖా! మామయ్యని చూద్దాం...'

'రండి' ప్రక్కగదిలోకి దారితీసింది రేఖ.

'—నాన్నా .... పద్మొచ్చింది.'

నెమ్మదిగా కళ్ళు తెరిచారాయన.

'.... ఎలావుంది మామయ్యా' మృదువుగా అందిపద్మ

'....ఎందుకమ్మా ఈ రాలటోయే పండుటాకుపై మీ అందరికీ యింత ఆపేక్ష?" నీరసంగా అన్నారు భూషణం గారు.

'అదేమిటి మామయ్యా అలాగంటారు? మీరు లేక పోతే రేఖనెవరు చూస్తారు? దానికోసమైన మీరు బ్రతకాలి.'

"నువ్వుండగా నా రేఖకేం లోటమ్మా!?....పద్మా! ఒక వేళ నాకేదేనా సంభవిస్తే నారేఖని మీ రేఖగా చూసు కుంటావు కదూ!?"

"కంటికి రెప్పలా చూసుకుంటాను మామయ్యా! రేఖ విషయంలో ఓ రేదిగులు పెట్టుకోకండి."

"నాన్నగారెప్పుడొస్తా రమ్మా!?"

"రాత్రికి రావాలి. రాగానే పంపిస్తాను."

"ఆహాఁ.... అందుకా్కదమ్మా"

"మీరనవసరంగా స్ట్రెయిన్ తీసుకుంటున్నారు. మానసిక రుగ్మతకంటే భయంకరమైన జబ్బేమీలేదు." నిశ్చింతగా నిద్రపోండి."

నీరసంగా కళ్ళు మూసుకున్నారు భూషణం గారు.

ముగ్గురూ యువతలి కొచ్చేశారు.

"మరి వస్తాం రేఖా...."

"అబ్బ.... కాసేపుఖూర్చోవే! కాఫైనా త్రాగి వెడు దురుగాని-"

"నీ మొహం.... యిప్పుడెం కాఫీ? ఆరుకావచ్చింది."

"యింత దూరంవచ్చి...."

"సిన్మాదారేగా! నేను మాటిమాటికి నిన్ననుకోవటం గమనించిన మాబావ నిన్నుచూసి వెడదామని పట్టు బట్టాడు. అందునా రేప వెళుతున్నాడుగా!"

"అయితే బావగారి బలవంతం తప్పితే నీకు...."

"అదేదో నీ మనసుకే తెలియాలి. మాకు తెలవిస్తే..."

మనం మళ్ళీ కలుద్దాం...."

'మరి నాకు సెలవా?' చేతులు జోడించాడు సుధీర్.

"నమస్కారం." తనూ చేతులు జోడించింది.

యిద్దరూ వెళ్ళిపోయారు.

# 4

రేఖ గారికి,

నమస్తే. యాదృచ్ఛికంగా మీ పరిచయం కలిగినందుకు నేనెంతో ఆనందిస్తున్నాను. మీరు నాకు పరిచయం కావటానికి కారణమైన వద్మ నభినందిస్తున్నాను.

రేఖగారూ! నాకెవరితోనూ పరిచయంలేదు. ముఖ్యంగా ఆడవాళ్ళతో. కాని స్నేహమంటే ఏమిటో నాకు బాగా తెలుసు. స్నేహానికున్న విలువ నాకు పూర్తిగా తెలుసు. నా దృష్టిలో స్నేహం అతి పవిత్రమైనది. కొందరు పలకరిస్తేనే విసుక్కుంటారు. అలాంటి వాళ్ళతో పరిచయం కంటే పాత సిన్మాకెళ్ళి కూర్చోటం నయమంటాన్నేను. మరి మీరేమంటారు?

స్నేహితుల్తో మాట్లాడే సమయంలో నేను కాలాన్నే మరుస్తాను. గంటల్ని క్షణాలుగా గడిపేస్తాను. అందులో వింత అనుభూతిని పొందుతాను. మీతో పరిచయమయ్యాక కొద్దిక్షణాల్లోనే వెళ్ళిపోవటం, ఆ మర్రోజే వూరొావలటం నాకెంతో బాధను కల్గిస్తోంది.

కాని ఏం చేయను చెప్పండి! లీవ్ లేదు! అందుకే తప్పనిసరిగా బయలుదేరాల్సి వచ్చింది. మనిషిక్కడున్నా కాని మనసక్కడే వుంది. కొత్తగా పరిచయమైన మీతో మాట్లాడలేక పోయానే; మీరేమనుకుంటారో నన్న బాధ

నన్ను కృంగదీస్తోంది....అలా అనుకోలేదు కదూ ! త్వరలో మళ్ళీ రావటానికి ప్రయత్నిస్తాను. చొరవతో ఉత్తరం రాసినందుకు క్షంతవ్యుణ్ణి. మీ కభ్యంతరం లేక పోతే రిప్లై రాస్తారు కదూ !

మన స్నేహం పెంపొందాలని ఆశించే
స్నేహితుడు
సుధీర్ ...."

ఆఫీసులోనే చించి చదువుకుంది రేఖ. చదువు తున్నంతసేపూ ఆమె శరీరం సన్నగా వణుకుతూనే వుంది. ఒళ్ళంతా చిరు చెమటలు పట్టేశాయి. చేతులు కంపించసాగాయి. ఆనందమో, అనుమానమో, భయమో తెలీదు గాని ఆమె మనసంతా అదోలా అయ్యింది.

తనకింతవరకూ ఎవరి వద్ద నుండీ డైరెక్ట్‌గా ఉత్తరం రాలేదు. ఇదే మొదటి ఉత్తరం ! అందులోనూ ఓ మగాడి వద్దనుండి !...ఏం చెయ్యాలి ? నాన్నగారికి చూపిస్తే ? ....నాన్నగారేమైనా అంటే? పోనీ పద్మకు చూపిస్తే... ఏమంటుందో ?

'ఈ విషయం కూడ నాతో చెప్పాలా ?' అంటే ?.... దాన్ని గురించి రాయలేదే ఇతను ? లేక పద్మకూ వేరుగా రాశాడా ? ఈ లెటర్ చూపిస్తే పద్మ ఏమైనా అను కుంటుందా ! అసలు తనీ ఉత్తరానికి బదులు రాయాలా ? ఏం చెయ్యాలి ? అప్పుడేం చెయ్యాలి ? ?

ఆ లేఖను మరోసారి చదువుకుంది రేఖ. ముత్యా ల్లాంటి అక్షరాలు. పదునైన భాష. విలువైన ఆశయాలు. అసభ్యత్వానికి చోటివ్వక ఎంతో చక్కగా రాశాడు.

తన స్నేహాన్ని వాంఛిస్తున్నాడు. స్నేహంగా ఉన్నంత మాత్రాన ప్రమాదమేమీ లేదుగా!

ఇప్పుడు తను రిప్లై ఇవ్వకపోతే అతనెంత బాధ పడతాడు? తననెంత నీచంగా ఊహించుకుంటాడు? తనొక్క సంస్కారహీనురాలిగా భావిస్తాడు.... స్నేహ పూర్వకంగా ఉత్తరం రాయటంలో తప్పేముంది? తనేమీ ప్రేమలేఖ రాయటం లేదుగా:

పేపరు, పెన్ను అందుకుంది రేఖ. వణికే చేతుల్తో మొదలు పెట్టింది. కాని ఏం రాయాలో, ఎలా రాయాలో తోచలేదు. నాలుగైదు పేపర్లు రాసి చెత్తబుట్ట కర్పించి చివరకిలా రాయగల్గింది.

"సుధీర్ గారికి,

నమస్కారం. మీరు వ్రాసిన లెటర్ అందింది. స్నేహంపట్ల మీకున్న అభిమానం నిజంగా గర్వించదగ్గది. అవసరాలకు మాత్రం పనులు జరుపుకొని ఆ తర్వాత అసలు కన్పించని వాళ్ళెక్కువగా ఉన్న ఈ రోజుల్లో మీలాంటి వాళ్ళు చాల అరుదు. అ కొద్ది మందైనా ఉండబట్టే "స్నేహం" అనే పదం ఇంకా వాడుకలో ఉందని భావిస్తాను. మీ మంచి తనాన్ని చిరకాలం స్థిరంగా ఉంచుకొని అచిరకాలంలోనే ఆ మంచి తనపు వెలుగులను నలుప్రైపులా విరజిమ్మాలని, విరజిమ్మ గలరని ఆశిస్తున్నాను. పద్మ కులాసాగా వుంది. ఏం రాయాలో తోచటంలేదు. క్షమించండి. ప్రస్తుతాని కుంటాను.

నమస్కారాలతో-

రేఖ"

మరోసారి ఉత్తరం పూర్తిగా చదివి అతికించి పోస్టులో వేసే వరకూ గుండెదడ తగ్గలేదు రేఖకు।

ఆ తర్వాత వారం వరకూ ఉత్తరం రాలేదు సుధీర్ నుంచి. తనేం పొరపాటుగా రాసిందోనని భయపడింది రేఖ. కాని అదే రోజే వచ్చింది ఉత్తరం. ఆత్రంగా చించింది.

'స్నేహితురాలు రేఖకు,

ఈరోజు నాకెంత సంతోషంగా వుందో మీకు చెబుదామనుకుంటే మనిద్దరి మధ్యా రెండు వందల మైళ్ళదూరం వుంది. ఏం చెయ్యను చెప్పండి బలవంతంగా అణచుకోవలసి వచ్చింది మితి మీరిన ఆనందాన్ని। ఇంతకీ ఎందుకో తెల్సా? ఊఁహూఁ.... మీకు తెలీదు. ఎలా తెలుస్తుంది? నే చెప్పాలిగా!!!

ఉత్తరం రాసినందుకు అపార్థం చేసుకొనుంటారేమో। కోపగించుకొని ఉత్తరంలో ఎన్ని చీపురు దెబ్బలు పంపిస్తారోననే భయంతో ఆత్రంగా గంటను దినంగా గడుపుతోన్న నాకు మీ ఉత్తరం వెయ్యేనుగుల బలాన్ని ప్రసాదించింది. పిచ్చిపిచ్చిగా గంతులేశాను.

ఇక గంతులు చాలించి అసలు విషయాని కొద్దాం.

ఉత్తరంలో చాలా పొగిడేశారు. పొగడ్తలంటే నాకిష్టంలేదు. ఎందుకంటే అనుకున్నవన్నీ ఆచరించటం కష్టం. అలా చెయ్యాలంటే అగడ్తల పాలు కావలసుంటుంది. దయచేసి ఇకపై అలాంటివి రాయటం మానేస్తారు కదూ।

నా స్నేహాన్ని సహృదయంతో అర్థం చేసుకున్నందుకు చాలా సంతోషిస్తున్నాను. మీలాంటి స్నేహశీలి

నాకు స్నేహితురాలిగా లభించి నందుకు గర్విస్తున్నాను. ఆరోగ్యం సరిగా లేనందువల్ల ఉత్తరం కాస్త ఆలస్యంగా పోస్టు చేస్తున్నందుకు క్షంతవ్యుణ్ణి.

మీ వివరాలు తెల్పగలరు.

మనం ఇంకా చేరువ కావాలని కాంక్షించే-

మీ స్నేహితుడు
సుధీర్.

గుండెలో మంచుగడ్డ పెట్టినట్లయింది రేఖకు. గాల్లో తేలి పోతున్నట్టు అనుభూతి చెందింది. రాస్తూన్న పైలు మూసి కాగితం, కలం అందుకుంది.

"సుధీర్ గారికి,

రేఖ వ్రాయునది. మీరు రాసిన జాబు చేరింది. ఆలస్యంగా అందటంవల్ల కాస్త భయపడాల్సొచ్చింది... ఉత్తరంలో ఏం పొరపాట్లు దొర్లాయోనని! కాని అలాంటి వేవీ జరగనందుకు తృప్తి పడుతున్నాను.

మొదట ఉత్తరం రాయాలంటే భయమేసింది. కాని మీ ఉత్తరాలు, ఆ శైలి చూస్తోంటే నాకూ అలా రాయాలనే ఉత్సాహం ఉరకలు వేస్తోంది. మీలా చక్కగా రాయలేకపోయినా అలా రాయాలనే ఆసక్తి, చక్కగా రాయగలిగే విధానం నేర్చుకోవాలనే తాపత్రయం నాలో అధికమౌతోంది. ఈ విధంగా ఆలోచిస్తే నేను మీకు శిష్యురాల్ని. అవునా!!

మన మధ్య రెండు వందల మైళ్ళుందని రాశారు. కాని నాకలా అన్పించటంలేదు. మీ ఉత్తరం చదువుతోంటే మీరు నా ఎదురుగా కూర్చొని మాట్లాడుతూన్నట్టుంటుంది!

ఆ తర్వాత మీరు గుర్తొచ్చినప్పుడల్లా మీ ఉత్తరం చదువుకుంటూ నా ఎదురుగా మిమ్మల్ని ఊహించుకోకుండానే చూస్తుంటాను.

కలం స్నేహం కమ్మగా వుంటుందని మీ ఉత్తరాలు ఋజువు పరుస్తున్నాయ్. మానసిక, కుటుంబ చిక్కులున్నప్పుడు మీ ఉత్తరాలు చదువుకుంటూ వాటిని మర్చిపోతుంటాను మీర్రాసిన 'చీపురు దెబ్బలు' చదువుకున్నప్పుడల్లా నాకు నవ్వొస్తుంది.

ఆరోగ్యం బాగోలేదని రాశారు. ఇప్పుడెలా వుంది? మీరు ఆరోగ్యాన్ని గూర్చి అశ్రద్ధ చేస్తున్నారనిపిస్తోంది. లేకపోతే పాడుకావలసిన అవసరం దానికేముంది చెప్పండి? కొంపదీసి ఉత్తరాల్లో ఏంరాయాలోనని ఆలోచిస్తూ రాత్రులు మేలుకోటంలేదుకదా! దయచేసి ఆ పని మాత్రం చెయ్యకండి. ఆరోగ్యం పాడవుతుంది. మేనేజర్‌గారు పిలుస్తున్నారు. ఉంటాను. తీరిగ్గా కూర్చోటానికిది మీలా గవర్నమెంటాఫీస్ కాదుగా! నమస్తే....

స్నేహితురాలు
రేఖ"

నాల్రోజులయ్యాక.....

"ప్రియమైన రేఖకు,

ఈ రోజు ఆదివారం. పబ్లిక్ పార్కులో కూర్చుని వుంచే అంతరంగంలో వింత వింత ఆలోచనలు ముసురుకుంటున్నాయ్. ఫౌంటెన్ లోంచి నీరు ఎత్తుగా చిమ్మబడుతోంటే నాకేమనిపిస్తోందో తెల్సా? మనసులో కూర్చబడిన తలపులన్నీ ఉవ్వెత్తున బయటకు రావాలని

సన్నాహాలు చేస్తున్నట్టుంది. చిలకల కిలకిలా రావాలు వింటోంటే మన స్నేహలత ఇంకా గట్టిగా పెనవేసుకు పోవాలని అవి ఆశీర్వదిస్తోన్నట్టుగా వుంది.

చూశారా ! ఉత్తరంలో మళ్ళీ పొగిడేశారు నన్ను. ఈసారి పొగిడారంటే నేనూరుకోను. తెల్సిందా? ఆఁ....!

మీ ఉత్తరం చూశాక నాకుచాలా ఆనందం కల్గింది. మీ బాధా సమయాల్లో నా ఉత్తరాలు మీకు ఉపశమనం కల్గిస్తున్నాయంటే.... అవునూ, ఏవో మానసిక చిక్కు-లన్నారు. కాని వాటిని గురించి రాయనేలేదే! ఏం? రాయకూడదనుందా? మీ బాధలు నాతో చెప్పకూడదా? కేవలం సంతోషంలోనే తప్ప మీ బాధల్లో భాగం పంచుకునే అర్హత నాకు లేదా? స్నేహమంటే ఇదేనా? మీ ఉత్తరంలోని మేటర్ చదివాక ఎంత బాధపడ్డానో మీకేం తెన్సు? నాకు మీపై చాలా కోపం వచ్చేసింది. ముందు నా కోపం ఎలా పోగొట్టుకోవాలో ఆలోచించు కోండి....

బంగమూతితో
సుధీర్.

"....సుధీర్....సుధీర్....నువ్వు....నువ్వు నిజంగా నిజమైన స్నేహితుడివి. నేనంటే నీ కెంత అభిమానం. పంచుకుంటాను సుధీర్! నా బాధలు కూడ ఇకపై నీతో పంచుకుంటాను. నాకు నీ కంటే ఆత్మీయులెవరున్నారు చెప్పు...రేఖ 'కళ్ళు ఆనందంతో వర్షించాయి. 'డియర్ సుధీర్'...అంటూ మొదలెట్టింది ఉత్తరం.

# 5

'ఛీఛీ.... మేనర్‌లెస్ బ్రూట్! చదువుంది ఎందుకు!.... దండగ! స్నేహితురాల్నర్థం చేసుకోలేకపోయాక చదువెందుకు? సంస్కారమెందుకు? హృదయంలో ఇంత కుళ్ళుంచుకుని పైకి స్నేహంగా కన్పించినంత మాత్రాన తనంత తెలివితక్కువదికాదే! తనిన్నాళ్ళూ మోసపోయింది. ...పరిచయం చేసింది. నిజమే! ఒప్పుకుంటుంది తను. ఆ తర్వాత దాన్ని పెంపొందించుకుందెవరు?

... అంత మాత్రాన తన బావను గూర్చి తానే నీచంగా చెబుతుందా? ఇది కేవలం అసూయ కాదూ! సుధీర్‌ను తనకాకుండా చేస్తున్నానని మితిమీరిన ఈర్ష్య కాదూ! తనకాబోయే మొగుణ్ని తను వల్లో వేసుకుంటోందనే అర్థం లేదూ అందులో! అంత కోరిగ్గా వుంటే ముందుగానే ఏడవరాదూ!...ఇంకా నయం. తామిద్దరి మధ్యా దాదాపు నలభై ఉత్తరాల దాకా జరిగాయని చెప్పలేదు తను. అలా చెప్పి వుంటే ఇంకా ఎంత రభస చేసేదో!

సుధీర్ ప్రతి ఆడపిల్లను అదే భావనతో చూస్తాడట! విషయలోలుడట! ఆడపిల్లలంటే పడి చస్తాడట!! కన్పించిన ప్రతి ఆడదాన్నీ లోబరుచుకోకుండా వదలడట!! పైగా ఒకటి రెండు సంఘటనలను గూర్చి తనకు బాగా తెలుసుట!....ఏం తెల్సు దానికి? తన కంటే పూర్తిగా తెల్సా? ఒకవేళ మరదలైతే కావచ్చు!

సుధీర్ హృదయాన్ని పూర్తిగా చదివింది తను! అతని ఉత్తరాలను చదివితే చాలు. హృదయం పుల

కిస్తుంది. 'రేఖా డార్లింగ్' అన్న ఆ సాల్యుటేషన్‌లో ఎంత తీయదనం దాగుంది ?

తన హృదయాన్ని ఎంత త్వరగా ఆకర్షించుకున్నాడతను ? సాధ్యమైనంత త్వరలో మన వివాహం జరగాలి అని ఎన్ని ఉత్తరాల్లో ఎన్నిసార్లు రాశాడు ? ఇవన్నీ.... ఇంకా అతనప్పుడప్పుడూ రాసిన చిలిపి మాటలు తన్ను పెండ్లికి తొందర పెడుతున్నాయ్. 'ఎప్పుడెప్పుడతని ఒడిలో వాలి తీయని కలలు కందామా....' అని మనసారాట పడుతోంది. అటువంటి ప్రేమ మూర్తిని.... తన సుధీర్‌ని...

ఛీఛీ.... పద్మలో ఇంత విషం దాగుందని కల్లో కూడ అనుకోలేదు తను. అందుకే తనతో మాట్లాడవద్దని నిశ్చితంగా చెప్పేసింది. ఇటువంటి వ్యక్తుల్తో స్నేహం చేసే కన్నా గంగలో దూకటం నయం !

ఎలాగైనా పద్మకు బుద్ధొచ్చేలా చెయ్యాలి ఏం చెయ్యాలి ? ఆ.... మరో వారంలో తన బర్త్‌డే రాబోతోందిగా. ఎలాగైనా సుధీర్‌ని రమ్మని రాయాలి. తను రమ్మని వ్రాస్తే రాకుండా ఉండగలడా ? ఆ తర్వాత తన బర్త్‌డే పార్టీకి పద్మను పిలవటమా ? మానటమా ? ఛ.... దాన్ని మాట్లాడొద్దని తనిన్సైవేట్ చేస్తే ఎంత ఇన్సల్ట్ !

'ఉహూ.... ఎలాగైనా దాని కళ్ళలో నీళ్ళు తెప్పించాలి. అసూయతో అది ఉడికిపోవాలి. ఆ.... అంతే....'

నిద్ర పట్టలేదా రాత్రి రేఖకు !

• • •

రైల్వేస్టేషన్ రద్దీగా ఉంది. రైలు రాబోతోందన్నట్టుగా చివర బెల్ కొట్టారు. అంత దూరంలో రైలొస్తూ కన్పించింది.

"వెధవది....దీనికంటే ఎద్దుల బండి నయం ...." విసురుగా అనుకుంది.

రణ గొణ ధ్వని చేస్తూ ఆగింది రైలు. పాసింజర్లు మామూలుగా ఎగబడ్డారు రైలులోని వారు దిగకముందే!

అసహనంగా పరికించ సాగాయి రేఖకళ్ళు.

దూరాన చివరి కంపార్టుమెంటు లోంచి చివరగా దిగాడు సుధీర్.

రేఖ హృదయం పులకరింతతో జలదరించింది.

దాదాపు పరిగెడుతూన్నంత వేగంగా నడిచింది. అందంగా గాల్లో చేయూపాడు చిర్నవ్వు ముఖంతో.

'బావున్నావా రేఖా !'

'ఏదో ఉన్నానిలా....తమ దయవల్ల ! పెళ్ళి గామందు కోగానే భయపడలేదుగా !

'అంతులేని ఆనందంతో భయపడ్డాను.'

'ఆఁ....నీ చమత్కృతులు తర్వాత గాని వెడదాం పద....' సుధీర్ చేతిలోని బేగ్ అందుకుంది రేఖ. బయ ల్దేరారిద్దరూ.

ప్రేమగా పలకరించారు భూషణంగారు సుధీర్‌ను. అతనికి అన్ని వసతులూ కల్పించబడ్డాయి.

మధ్యాహ్నం ఆఫీసున్నదంటూ వెళ్ళిపోయింది రేఖ. భూషణంగారు, సుధీర్ మాట్లాడుకుంటూ కూర్చున్నారు.

రేఖ ఆఫీసులో కూర్చుంది కాని ఆమె మనసంతా యింట్లోనే వుంది !

# 6

'హేపీ బర్త్‌డే టూ యూ ....' పద్మ తప్ప తక్కిన ఫ్రెండ్సందరితో ఆనందంగా గడిచి పోయింది రేఖ పుట్టినరోజు. రేఖ వాళ్ళింట్లోనే అందరికీ డిన్నర్ అరేంజ్ చెయ్యబడింది. భోజనాలు కాగానే ఓ అరగంట విశ్రమించాక సుధీర్ తప్ప తక్కిన ఫ్రెండ్సందరూ నిష్క్రమించారు.

ఆ రోజు సాయంత్రం సుధీర్, రేఖలు సినిమా ప్రోగ్రాం వేసుకున్నారు. వెళ్ళబోతుండగా టపాలులో రేఖకో ఉత్తరం వచ్చింది.

అందుకొని చించింది.

'రేఖా !

నీ పుట్టిన రోజు పండక్కైనా పిలుస్తావని ఆశించాను. కాని అలా జరగలేదు. పోనివ్వు...కాని నీ స్నేహితురాలిగా ఆఖరు సారిగా నీకో మాట చెబుతున్నాను. గుర్తుంచుకో.

నల్లనివన్నీ నీళ్ళు, తెల్లనివన్నీ పాలనే భ్రమలో వున్నావు నువ్వు. చదువుకున్న దానివి. తెలివిగల దానివి. నీ కన్ని విషయాలూ విడమర్చి చెప్పనక్కర లేదు. పంతాలకు, పట్టింపులకు పోయి నీ బంగారు జీవితాన్ని నాశనం చేసుకోకు. జీవితం వడ్డించిన విస్తరి లాంటిది. దాన్ని కుక్కల పాలు చెయ్యకు. నేను నీ కింత కంటే ఎక్కువగా చెప్పను.

నీ జన్మదిన శుభ సందర్భాన నా శుభాకాంక్షలందుకో.

— పద్మ...."

కోపంతో పళ్ళుకొరికింది రేఖ.

''ఏమిటది?" అడిగాడు సుధీర్.

'టైమ్ కావస్తోంది. తర్వాత చెబుతాను పద ....' తొందరచేసింది.

ఆవరణ దాటగానే ఆటో పిలువబోయాడు సుధీర్.

''వద్దు. సరదాగా నడిచి వెడదాం...."

ఇద్దరూ నడవసాగారు.

"రేఖా...." పిలిచాడు సుధీర్.

"ఆఁ...."

'ఒక్కసారి.... మనం రాసుకున్న ఉత్తరాలన్నీ ఎదురెదురుగా కూర్చొని చదువుకోవాలనుంది. ఏమంటావు.'

''గుడ్ అయిడియా. మరి ఉత్తరాలో?''

"నువ్వు రాసినవన్నీ తెచ్చాను."

"మరి నువ్వు రాసిన ఉత్తరాలు....?"

"నీ పెట్టెలోంచి పట్టుకొచ్చాను."

"యూ.... నాటి బోయ్.... నువ్వొట్టి....''

'దొంగనా ?'

"అవును."

'మరి ఈ నేరానికి శిక్షేమిటో !'

'ఇక నోరుముయ్యి. ఇది పబ్లిక్ రోడ్డు. అదినరే గాని ఇంటి కెళదాం పద.'

'సీది పట్టి మట్టిబుట్ట రేఖా! ఉత్తరాల విషయం మీ నాన్నగారికి తెలిస్తే ఏమనుకుంటారు ?'

'మరెలా? బీచికి వెడదామా?'

'ఏదైనా దగ్గరలో ఉన్న హోటలు కెడదాం. అంత దూరం నేనడవలేను.'

"అవును. ఎంచక్కా తో ఫామిలీ రూమ్‌లో కూర్చో వచ్చు."

"ఫామిలీ రూమేం ఖర్మ.... ఓ రూమే తీసుకుందాం."

"ఎందుకు సుధీర్ రెండు గంటలకోసం...."

"మనకి డబ్బుకాదు ప్రధానం. ఏకాంతం. ప్రశాంతత. సినిమావదిలే లోగా పని పూర్తవదూ!"

ఇద్దరూ అక్కడికి దగ్గర్లోవున్న 'హోటల్ సంగీత్‌కు' వెళ్ళారు. ఇద్దరిపేరా ఓ రూమ్ బుక్ చేశాడు సుధీర్. బోయ్‌వచ్చి రూమ్ చూపి వెళ్ళిపోయాడు.

ఫోన్ ఆన్‌చేసి కూర్చున్నాడు సుధీర్. తెల్లని బార్ లైట్ వెలుగు ఆ గదిని పూర్తిగా ఆవరించింది. ఉత్తరాల కట్టలు బయటకు తీశాడు.

"కాఫీ కావాలా సార్" అంటూ వచ్చాడు బోయ్.

"ఇప్పుడవసరంలేదులేవోయ్! ఆ తర్వాత నే పిలుస్తాలే. నువ్వెళ్ళు" బోయ్ వెనుకనే వెళ్ళి తలుపేసి వచ్చాడు సుధీర్. 'వెధవలు....ఓటికీ మాటికీ వస్తుంటారు' అంటూ.

"అం.... మొదట్నుండీ చూద్దామా?" అన్నాడు తనే.

"తలుపేశావెందుకు?"

"తెరవ మంటావా?....గాలి వస్తోందిగా! ఎవరెవరో తిరుగుతుంటారు. మనల్ని ఉత్తరాల్ని చూస్తే ఏం బావుంటుంది?"

"సరే వుండనివ్వు... మరి నువ్వు రాసిన...."

"ఇవిగో," ఓ కట్ట తీసిచ్చాడు సుధీర్. ఇద్దరూ ఒకటివెంట ఒకటి చదువుకోసాగారు.

ఓ ఉత్తరం చదువుతూ సిగ్గుపడుతూ అంది రేఖ.

''ఎంత స్నేహితుడివైనా మరీ ఇంత యిదిగా రాయ టం బాగోలేదు సుమా!''

''ఆ ఉత్తరం రాసేప్పుడు స్నేహితుణ్ని కాదు తెల్సా? ప్రేమికుణ్ని!.... అయినా ఏం రాశాను? ఏదీ...!...నీ శరీరాన్నంతా మృదువుగా స్పృశిస్తూ ఆ పులకింతతో నువ్వు పరవశిస్తోంటే నిన్ను అంచంగా నా కౌగిట్లోకి లాక్కుని అమాంతం....''

''ఛీ '' సిగ్గుతో సుధీర్ హృదయంలో తలదాచు కుంది రేఖ.

''రేఖా....'' మత్తుగా పిలిచాడు సుధీర్.

''ఊఁ....''

''నిజంగా మనది విచిత్రబంధం కదూ!''

''అవును సుధీర్! ఇది ఎన్ని జన్మల బంధమో! లేక పోతే నువ్వు నాకు పరిచయం కావటం, మన స్నేహాన్ని ఉత్తరాలద్వారా పటిష్ఠం చేసుకోటం, మనమధ్య అను రాగలత బలంగా పెనవేసుకుపోవటం ఎంత ఆశ్చర్యంగా వుందో ఊహించుకుంటే. నాకు నిజంగా 'కలా?-నిజమా? అన్పిస్తుంది.''

''అవును రేఖా!'' రేఖను తనకేసి మరింతగా అదుము కుంటూ అన్నాడు సుధీర్. ''మన ఈ ఆనందం స్థిరంగా ఇలాగే నిల్చిపోతే ఎంత బావుంటుందో!''

''తప్పక నిల్చిపోతుంది సుధీర్!'' మైకంగా అందిరేఖ.

రేఖ వీపును సుధీర్ చేతులు ఆవేశంగా నిమురు తున్నాయి. నెమ్మదిగా అతని చేతివ్రేళ్ళు ఆమె జాకెట్ హూక్స్‌పైకి మళ్ళాయి.

''ఏమ్...ఏమిటీపని?'' సుధీర్ హృదయానికి బల్లిలా

అతుక్కుపోయిందామె.

"ఇది మితిమీరిన ఆనందం రేఖా! ఏం?....నీకు హాయిగా లేదా?" సుధీర్ చేతులు రేఖ బ్రాసరీని కూడ తప్పించాయి:

"అ....బ్బా! ఏమిటీ చిలిపిపని సుధీర్! నరాలు.... జివ్వుమంటున్నాయి. శరీరం తేలిపోతోంది. నీ చేతుల్లో ఎంత శక్తి దాగుంది సుధీర్" రేఖ కళ్ళు మైకంతో మూతలు పడుతున్నాయి.

"రేఖా! ఈ మధుర క్షణాలను మనం జీవితంలో మరుపగలమా?"

'ఎలా మరువగలం సుధీర్!? ... జీవితాంతం మరువ లేని .... అ .. బ్బా...యూ...నాటీ' అంటూ తలగడలో ముఖం దాచుకుంది రేఖ అపరిమితమైన సిగ్గుతో.

# 7

యామిని కళ్ళలో నీళ్ళు ధారావాహికంగా కారి పోతున్నాయి. శరీరం నెమ్మదిగా కంపించ సాగింది. రెండు చేతుల్తోనూ ముఖం కప్పుకొని వెక్కి వెక్కి ఏడ్వ సాగింది.

తను కూర్చున్నది ఆస్పత్రి వార్డని, గుర్తుకు రాగానే ఉలికి పడింది తన్ను తాను సంబాళించుకుంది.

ఒకసారి వార్డంతా కలయ జూసింది. కళ్ళు తుడుచు కొని నెమ్మదిగా స్టూలు పైని సిరంజిని తీసికెళ్ళి యథా స్థానంలో ఉంచేసి అల్మైరాలోని స్లీపింగ్ టాబ్లెట్స్ బాటిల్ తెరిచింది. రెండు మాత్రలు తీసుకొని నాలుగో నెంబరు బెడ్ పైపు నడిచింది.

'నాగయ్యా!" పిలిచింది.

'అమ్మా!"

'నొప్పిగా వుందా?'

'లేదమ్మా!'

"ఇదిగో. ఇవేసుకో. కాసేపట్నుంచి మొదలవుతుంది. మింగేసి నిద్రపో'

"అలాగే నమ్మా!'

మాత్రలు, నీళ్ళు నాగయ్య చేతికిచ్చింది యామిని.

"మస్తాన్‌కు తెలివొచ్చిందా?" మింగాక అడిగింది.

"వచ్చిందమ్మా! ఊరికే పడుకున్నాడు.'

"పదవ నెంబరు బెడ్ కేసి నడిచింది యామిని.

"మస్తాన్ భయ్యా...'

కళ్ళు తెరిచాడు మస్తాన్.

"కైసా హై ఆప్ కో?'

"ఠీక్ హై బహెన్...'

'దరద్...'

'నహీఁ హై...'

"అచ్ఛా... అబ్ దో గంటేమేఁ దో గోలియాఁ లేకర్ ఆ వుంగీ! వో దాల్‌కే సోజానా పడేగా ఆప్..."

"ఠీక్ హై బహెన్"

"అచ్ఛా" వస్తూ వస్తూ రాజారావు వంకచూసింది. ప్రశాంతంగా నిద్రపోతున్నాడు. తృప్తిగా నిట్టూర్చి తన కుర్చీలో కూర్చుంది. తిరిగి ఆలోచనలు ముసురుకోసాయ్.

ఆనాడు...

ఆనాడలా తామిద్దరూ ఒకటయ్యారు. ఆ తర్వాత

సుధీర్ ఒడిలో పడుకొని తనెన్నికలలు కంది:... అలా మరో గంటగడిచి పోయింది. సినిమా వైమైపోవ టంతో బయలుదేరారు.

దారిలో స్త్రీ సహజమైన భయం పొడచూపింది తనలో. ఆ విషయాన్ని గూర్చి అడిగింది.

"పిచ్చి రేఖా! అంతలో అలా మారిపోయావేమిటి? నీకు నాపై నమ్మకంలేదా? ఈ రోజు నీ పుట్టినరోజు. గుర్తుందా? ఈ రోజంతా ఆనందంగా గడపాలి నువ్వు. అందుకే నీకు ప్రత్యేకానందాన్ని ప్రజెంట్ చేశాను. నీకంత అనుమానంగా వుంటే పద. ఇప్పుడే గుడికెళ్ళి దండలు మార్చుకుందాం." అన్నాడు సుధీర్.

"నీపై నమ్మకంలేక్కాదు సుధీర్! పెళ్ళి కాకుండా తొందరపడ్డ ప్రతి స్త్రీకి సహజంగా కలిగే భయమే యిది. అంతేకాని నీపై అనుమానం కాని, అప నమ్మకంకాని లేవు. నన్ను క్షమించు.'' అంది తను.

అంతే... అతన్ని ఆవిషయంలో మరెప్పుడూ అను మానించలేదు.

ఆ మర్నాడే సుధీర్ వెళ్ళిపోయాడు. స్టేషన్లో మరీ మరీ చెప్పింది ఉత్తరం రాయమని. ...రైలు కదలి వెళ్ళిపోతోంటే తన హృదయం తన శరీరం నుండి దూరమై పోతున్నట్టనిపించింది తనకి.

వెళ్ళిన వెంటనే ఉత్తరం రాశాడు సుధీర్. అది చేరేంత వరకూ తనకు గుబులుగానే వుంది. ఆ తర్వాత వారం వారం మామూలుగా సుధీర్ నుండి తీయని ఉత్తరాలందుకుందితను. తనూ రాస్తుండేది.

ఓ రోజుదయం కాఫీచేస్తోంటే కళ్ళు తిరిగాయి తనకి.

అర్థంచేసుకుంది. ఓ ప్రక్క ఆనందం, మరో ప్రక్క భయం తన్నుక్కిరి బిక్కిరి చేశాయి. తండ్రితో చెబితే? ...ఆయన గుండె అసలే నీరసంగా ఉంది. ఈ హఠాత్పరిణామాన్ని ఆయన భరించగలరా? ... ఉహూ... చెప్పకూడదు. ముందు సుధీర్‌కు ఉత్తరం రాయాలి.

...నో! స్వయంగా తానే వెడితే!!??

అవును. అలనే చెయ్యాలి. సుధీర్ ఇన్ని ఉత్తరాలు రాశాడు. ఒక్క దాంట్లోనైనా తన్ని రమ్మని రాశాడా? రాయలేదు. అందుకే తను వెళ్ళాలి. పోనీ టెలిగ్రామిస్తే? .. ఉహూ.... సర్‌ప్రైజ్ విజిట్ చెయ్యాలి. అకస్మాత్తుగా తనని చూసేసరికి సుధీర్ అవాక్కై పోవాలి. ఆనందంతో తన్ను అమాంతం కౌగిలించు కోవాలి. అప్పుడు చెబుతుంది అసలు విషయం. బలే సంతోష పడతాడు. 'ఆడపిల్లనా?'.... 'మగపిల్లాడా?' అనడుగుతాడు అప్పుడు తనేంచెప్పాలి? తనకి తెలిస్తేగా!

ఊహలతో మురిసిపోయింది.

మర్రోజే బయలుదేరింది తను. 'ఓమ స్టాఫ్‌తో కలిసి అజంతా; ఎల్లోరా గుహలు చూడటానికి ఎక్స్‌కర్షన్ ప్రోగ్రామ్ వేసుకున్నామని నాన్నకి చెప్పి.... రైలెక్కేసింది సుధీర్ గురించే ఆలోచిస్తూ.

సుధీర్ అడ్రస్ కనుక్కోటానికి రెండు గంటలు పట్టింది.

అతనుంటున్నది రూమ్‌కాదు. ఓ యింటినే అద్దెకు తీసుకున్నట్టున్నాడు. తలుపు తెరిచేవుంది. తలుపు

పై భాగంలో 'సుధీర్' అని నేమ్‌ప్లేట్ తగిలించబడి వుంది తృప్తిగా నిట్టూరుస్తూ లోని కడుగు పెట్టింది. ఓ హాలుదాటి ప్రక్కనున్న గదిలోకడుగు పెట్టబోతూ ఆగిపోయింది.

లోపలున్నుండి గట్టిగా మాటలు వినవస్తున్నాయి.

'వతే యిప్పుడు మాఅమ్మాయి గతేం కావాలంటావ్?' గంభీరమైన ఓ మగ గొంతు !

'నాలుగు రోజులు ఓపిక పట్టండి .... ' నమ్రతగా సుధీర్ జవాబు !

'ఏమిటి ఓపిక పట్టేది ? అమ్మాయికి నాలుగో నెల ! మమ్మల్నిపూళ్ళో ఉండమంటావా లేక ఎటైనా పారి పొమ్మంటావా ? ప్రేమించానన్నావ్. పెళ్ళి చేసుకుంటా నని మాటిచ్చావ్. సరదాగా తిరిగావ్. పిల్ల శీలాన్నే దోచుకున్నావ్. నా న్నెల్ల నుండీ పెళ్ళి వాయిదా వెయ్యటంలో నీ ఉద్దేశ్య మేమిటి ?'

'నా కే దురుద్దేశమూ లేదు. మీరు నన్నపార్థం చేసుకుంటున్నారు.'

'మరి మొన్న మూడు రోజు లెక్కడి కెళ్ళావ్ ?"

' .... ... .... '

'ఏం మాట్లాడవు ?

'....తెనాలి వెళ్ళాను. మా బంధువులింటికి.'

'ఆధారం ?'

'నన్ను నమ్మండి....'

'నిన్ను నమ్మే ఈ స్థితి కొచ్చాం. బంగారు లాంటి నా బిడ్డ భవిష్యత్తును చేజేతులా నాశనం చేశాను. నీ కల్ల బొల్లి మాటలు నమ్మి కసాయి వాడికి గొడ్డెలా కన్న

కూతుర్ని నీ కప్పగించాను. నా అభిమానాన్ని అలుసుగా తీసుకొని నన్నాడించాలని చూస్తున్నావ్. ఇంతవరకూ నా అభిమానాన్నే చూశావ్. ఇక నా ఆగ్రహాన్ని కూడ చవిచూద్దువు గాని.... నా పలుకుబడి నుపయోగించానంటే నీ భవిష్యత్తేమవుతుందో ఒక్కసారి వూహించు... ఈ పరంధామయ్య పగలో పాముని మించినవాడు. నీ చర్య లన్నీ ఎప్పటి కప్పుడు గమనిస్తూనే వున్నాను. మా సర స్వతిని నాశనంచేసింది చాలక నువ్వు 'రాణి' అనే మరో పిల్ల వెంట తిరుగు తూన్నట్టు కూడ నాకు తెలుసు. ఆ పిల్లను పెళ్ళాడాలని చూస్తున్నావేమో! .... జాగ్రత్త! వచ్చేవారం నీకు సరస్వతికి పెళ్ళి. అడ్డుచెప్పటానిక్కాని తప్పించుకోటానిక్కాని ప్రయత్నించావో, నిన్ను చిత్ర వధ చేస్తాను. నా సంగతి తెలుసుగా ....'

.... గుమ్మం ఇవతల విల్చున్న తన గుండెలో అగ్ని పర్వతాలు బద్దలయ్యాయి. తన సుధీర్ .... ఏమిటిది? తను వింటున్నది నిజమా? ఈ సుధీర్ తన సుధీరేనా? లేక వేరొకడా? .... తలుపులు కాస్త తెరచి లోనికి చూసింది

అతను...అతని కాళ్ళు పట్టు కుంటున్నాడు.

ప్లీజ్ .... గట్టిగా అరచి నన్నల్లరి పాలు చెయ్య కండి. సరస్వతిని తప్ప నే నెవర్నీ ప్రేమించటం లేదు. ఒట్టు. రాణి నా చెల్లెల్లాంటిది. సరూను ఏక్షణాన పెళ్ళాడ టానికైనా నేను సిద్ధమే."

'అలారా దారికి ... అయినా నీ మాటెవరు నమ్మారు. ఈ కాగితంపై సంతకం చెయ్ .... ' అంటున్నాడతను.

'అలాగే' అంటూ లేస్తున్న సమయంలో అతని

ముఖం చూచింది తను. అంతే... స్తబ్ధురాలై పోయింది!

అతను....తన సుధీరే ! ! !

కళ్ళు తిరగ సాగాయ్. కాళ్ళ క్రింద భూమి కంపిస్తు న్నట్టయ్యింది హృదయంలో పెనుతుఫాను చెలరేగింది. అక్కణ్ణుండి ఎలా బయట పడిందో తనకే తెలీదు. ఆ బాధ వర్ణించ నలవి కానిది!

స్టేషన్ కొచ్చి కూలబడిందో బెంచీపై. బాగ్ లోంచి కవర్ తీసి గబగబా నాలుగు ముక్కలు రాసి లెటర్ బాక్స్‌లో పడవేసింది.

ఏం రాసిందో తనకే తెలియని పరిస్థితి అది!

రైలు బయలు దేరింది. కాని తన మనసు మాత్రం దాన్ని గమనించలేదు. సుధీర్ రాసిన ఉత్తరాల్లోని సంఘ టనలే బలవంతంగా గుర్తుకు రాసాగాయ్.

ఎంత నయవంచకుడు!.... ఎంత నీచుడు!!...

ఎందరి జీవితాలతో చెలగాట మాడుతున్నాడు?

వీడు మనిషా? పశువా??

పద్మ చెప్పిన మాటలు, ఆమె హెచ్చరికను ఎంత ప్రయత్నించినా గుర్తుకు తెచ్చుకో లేకుండా ఉండలేక పోతోంది. అవన్నీ గుర్తుకు వచ్చేసరికి తన హృదయం ముక్కలై పోయింది... పద్మ కాళ్ళపైపడి క్షమాపణ వేడుకుంటే తను చేసిన పాపం పోతుందా?

లేదు! ప్రాయశ్చిత్తం లేదు. తను పద్మకు చేసిన ద్రోహానికి ప్రాణం తీసుకున్నా ప్రాయశ్చిత్తం చేసు కున్నట్టుకాదు.

పద్మ ... పద్మ నిజంగా ఎంత మంచిది?

బండ బారిన గుండెతో వూరు చేరింది తను.

ఆ పరిస్థితిలో ఇంటికెలా వెళ్ళగలదు తను?... నాన్న ముఖం చూడగలదా? ఈ విషయం ఎలాచెప్పగలదు?తన కడుపులో పెరుగుతున్న సుధీర్ ప్రతిబింబాన్ని ఎన్నాళ్ళని దాచగలదు? విషయం తెలిస్తే భరించే శక్తి నాన్న గుండెకుందా?

...తనిలాగే వెళ్ళి సముద్ర గర్భంలో కలిసిపోతే?... నాన్న సంగతేమిటి? కూతురు రాలేదన్న భయంవల్ల ఆయన గుండె ఆగిపోతే?... భగవాన్! ఇప్పుడేం చెయ్యాలి??

ఆలోచిస్తూ యాంత్రికంగా యిల్లు చేరింది తను.

నిప్పును ఎన్నాళ్ళని గుప్పిట్లో ఉంచుకోటం? ఓరోజు బయట పడింది తన రహస్యం. గుండె చెరువయ్యేలా ఏడ్చారు నాన్న. ఆ సాయంత్రానికే గుండె నొప్పి మొదలైందాయనకి. హెచ్చింది. పద్మవాళ్ళింటికి పరిగెత్తింది తను.

వెంటనే వచ్చారు సుదర్శనంగారు. పద్మ లేదా సమయంలో. లేకపోతే వచ్చేదే! ఆ రాత్రంతా డాక్టరుగారు నాన్నవద్దే కూర్చున్నారు. చేతనైనంత సహాయం చేశారు. నాన్నను కబళించబోతోన్న మృత్యువుతో పోరాడి ఓడిపోయారు.

తన పాపిష్ఠి ముఖం చూడలేక కాబోలు. ఈ లోకం నుండే తప్పుకున్నారు నాన్న. తన గుండె మరోసారి పగిలింది.

సినిమా వదలగానే విషయం తెల్సుకున్న పద్మ వెంటనే వచ్చింది. పద్మను కరుచుకొని బావురుమంది తను. జరిగిన విషయమంతా తెలిపి తన మూర్ఖత్వాన్ని

క్షమించమని పద్మ కాళ్ళపై పడబోయింది. తన్ను చూసి జాలిపడింది పద్మ. 'నేనున్నా'నంటూ అక్కున చేర్చుకుంది।

నాన్నగారి అంత్యక్రియలు డాక్టర్ సుదర్శనంగారే చేయించారు. తను వాళ్ళింటికి తీసుకుపోబడింది. నెల గడిచింది.

పద్మ మంచి తనాన్ని చూస్తోంటే తను జీవించే ప్రయోజనం లేదనిపించింది. తను ఆమెను అపార్థం చేసుకున్నా ఆమె తన్ని ఎప్పటిలానే చూచుకోసాగింది.

అందుకే బ్రతకాలనిపించలేదు తనకి. క్షమించమని రాసి పద్మ తలగడ క్రింద వుంచి బయట పడింది. చీకట్లో నడవసాగింది. ఎంత దూరం నడిచిందో తెలీదు. ఓ బ్రిడ్జి చేరుకుంది. ఆలస్యం చెయ్యదల్చుకోలేదు. వెంటనే దూకేసింది.

కళ్ళు తెరిచేసరికి ఆస్పత్రిలో బెడ్ పై పడుకొనుంది। ప్రక్కగా సుదర్శనం గారు, పద్మ కూర్చొని వున్నారు.

"ఏం పనమ్మా ఇది....?" మృదువుగా మందలించారు సుదర్శనంగారు.

మృత్యువు తనని వరించలేదు. తన కడుపులోని శిశువును కబళించింది.

తను చేసింది అవివేకమట। పద్మ కోప్పడింది।। ఆ తర్వాత తను చావటానికి వీల్లేకుండా తను బయట కూడ వెళ్ళటానికి వీల్లేకుండా తగు జాగ్రత్తలు తీసుకున్నారు.

ఊరికే కూర్చుండలేకపోయింది తను. ఏదైనా ఉద్యోగం చూసి పెట్టమని కోరింది. 'ఏం ఉద్యోగం చెయ్యగల

వమ్మా?' అన్నారు సుదర్శనం గారు.

మళ్ళీ చదవమంది పద్మ....పిచ్చిగా నవ్వొచ్చింది తనకి.

"నాకు చదువుకోదు కావలసింది.పూర్తిగా మనశ్శాంతి. మీ ఆస్పత్రిలో నాకో నర్స్ పని ఇప్పించండి మామయ్యా! రోగులకు సేవలు చేస్తూ శేష జీవితం గడుపుతాను. నాకింకే కోరికా లేదు. దయచేసి నా యీ ఒక్క కోరికా తీర్చండి..." అని బతిమాలింది.

సరే నన్నారు డాక్టరుగారు. అప్లై చేయించారు. సెలెక్టైంది తను. ట్రెయినింగ్ పూర్తి చేసుకొని డాయినైంది.

ప్రశాంతంగా జీవించాలి. రోగులకి సేవలు చెయ్యటంలోనే తను ఆనందాన్ని అనుభవించాలి. తన జీవితాన్ని ఆస్పత్రికే అంకితం చెయ్యాలి. పూర్వపు సంఘటనలను గూర్చి తలవకూడదు. అందుకే తన పేరును 'యామిని'గా మార్చుకుంది

ఆ తర్వాత చాలా మార్పులు జరిగాయి. పద్మ ఎడ్యుకేషన్ పూర్తి చేసుకొని డాక్టర్నై చేసుకొని ఫారిన్ వెళ్ళిపోయింది. దాని పెండ్లికి తనే పెద్దగా నియమించబడింది!

ఆరునెల్లు గడిచింది. సుదర్శనం గారు విజయవాడ ట్రాన్స్ఫర్ కావటంతో వెళ్ళిపోయారు.

తను మాత్రం ఇలాగే జీవితాన్ని నెట్టుకు వస్తోంది విరాగినిలా. రోగులకు సేవలు చేస్తూ అందులో అవ్యాజమైన ఆనందాన్ని పొందగలుగుతోంది. రాజారావు లాంటి

వ్యక్తుల హృదయాల్లో చెల్లెలిగా శాశ్వత ముద్రగా నిలిచిపోతోంది. ఆ తృప్తిచాలు తనకి!

రేఖగా తనువు చాలించి తిరిగి యామినిగా ఉద్భవించింది. ఈ యామినిలో ఏ కోరికా లేదు! గత సంఘటనలు బలవంతంగా గుర్తుకువస్తే బాధతప్ప! దేనిపైనా అపేక్షలేదు. దేవుడిచ్చిన అయిద్దాయాన్ని భూమిపై సవ్యంగా వెళ్ళిస్తే తను ధన్యురాలు.

వచ్చిన మొదట్లో పూర్వపు బాధలు గాయాలై అమితంగా బాధించేవి. కాని ఇప్పుడవన్నీ మాసిపోయాయి. మానిపోయాయి. వాటి తాలూకు మచ్చలుకూడ లేవు తన హృదయంలో....' అనుకోటానికి పూర్తిగా వీల్లేదు. అప్పుడప్పుడూ ఇలా గుర్తుకు వస్తోంటాయ్ ఏ అర్నెల్లకో ఓ సారి!

తన గత చరిత్ర కనీసం ఒకరికైనా తెలిసుంటె బావుంటుందని తనతోపాటు ట్రైనింగై తనతో పాటు పని చేస్తోన్న సుమిత్రతో అంతా చెప్పేసింది. ఆమె తనపై సానుభూతి చూపించింది. తనకంతకంటే ఏం కావాలి?.. ఏనాడైనా తను చావక తప్పదు. సుమిత్ర కళ్ళు తనపై సానుభూతితో నాలుగు నీటి బిందువులు వర్షిస్తాయానాడు. అంతకంటే వేరే తిలోదకాలు తనకనవసరం....'

# 8

ఉన్నట్టుండి ఉలిక్కిపడి ఈ లోకంలో కొచ్చింది యామిని. వాచీ చూచుకుంది.

'ఫర్వాలేదు. మస్తాన్‌కి స్లీపింగ్ టాబ్లెట్సివ్వటానికి ఇంకా గంట వ్యవధి వుంది.'

మిగత పేషంట్స్ వంక చూసింది. అంతా నిద్ర పోతున్నారు. రాజారావు వంక దృష్టి మరల్చింది.

'అరె....మేలుకొని వున్నాడు. ఏదో చదువు కుంటు న్నాడు. బహుశ విమల రాసిన ఉత్తరమై వుంటుంది. ప్రక్కన అతని ఫ్రెండ్ శంకర్ కూర్చొని వున్నాడు. తన ఆలోచనల్లో అతని రాకనే గమనించలేదు.'

ఒక్కసారి వార్డంతా కలయజూసింది మళ్ళీ. ప్రశాం తంగా వుంది. తన వార్డెప్పుడూ ఇలాగే వుండాలి. ఎవరికీ ఏ లోటూ జరగరాదు....' అనుకుంటూ లోపలి కెళ్ళి గ్లాస్‌తో నీళ్ళు తాగి వచ్చి కూర్చుంది యామిని.

'సిస్టర్ !' అన్న పిలుపు విని ఆ వైపు చూసింది. రాజారావు పిలుస్తున్నాడు. నెమ్మదిగా ఆ వైపు నడిచింది. శంకర్ అతని వద్ద సెలవు తీసుకొని వెళ్ళిపోయాడు.

"పిలిచారా రాజారావుగారూ."

"అవును సిస్టర్....పిలిచాను. నేనే పిలిచాను. సంతో షాన్ని పట్టలేక.....నేనే పిలిచాను." రాజారావు ముఖంలో ఆనందం జ్యోతిలా వెలుగుతోంది!

"అబ్బా! ఇంత ఆనందం మీ ముఖంలో ఈనాడు చూశాను. ఏమిటండీ విశేషం?" స్టూలుపై కూర్చొని నవ్వుతూ అంది యామిని.

'నా విమల నుండి ఉత్తరం వచ్చింది సిస్టర్!?' ఉత్సాహంగా అన్నాడు రాజారావు.

'అప్పుడప్పుడూ వస్తూనే ఉన్నాయిగా!'

'అది వేరు....ఇది వేరు....నా అనారోగ్యం సంగతి నా విమలకి తెల్సిపోయింది సిస్టర్!'

"ఆ(..."

ఫరవాలేదు. మొన్న వాళ్ళన్నయ్య ఏదో పనిపై ఈ వూరికొచ్చి మా ఆఫీసులో అడిగితే చెప్పారట. టైమ్ లేక వెంటనే వెళ్ళిపోయాట్ట. ఎంత బాధ పడుతూ రాసిందో చూడండి...' ఇవ్వబోయాడు రాజారావు.

ఫర్వాలేదు. మీరు చెప్పండి...పైగా మీ నోటి ద్వారా వింటేనే నాకూ సంతోషం'

'ఓహో! మీకు ఇతరుల ఉత్తరాలు చదివే అలవాటు లేదుకదూ? నేనే చెబుతాను...నేను తన హృదయాన్నర్థం చేసుకోలేదట. ఆ వ్యాధి రాబోతుందని నేను మిమ్మల్ని పెళ్ళి చేసుకోకుండా వుంటానా రాజారావుగారూ! ఇదేనా మీరు నన్నర్థం చేసుకున్నది? మీ స్వచ్ఛమైన మనసును చూచి ప్రేమించాను. ఈ జన్మలో...ఈ జన్మలోనే కాదు. ప్రతి జన్మలోనూ మీరే భర్త...మీరే దైవం.

మీరిన్నాళ్ళూ నావద్ద ఈ విషయాన్ని దాచినందుకు నాకు చాల బాధగా వుంది. నాకేం రాయటానికీ తోచటం లేదు. వస్తున్నాను. నా ఉద్యోగానికి రిజైన్ చేసి వస్తున్నాను. మా అన్నయ్య కూడ ఒప్పుకున్నాడు. రేపే వస్తున్నాను. నేను స్వయంగా దగ్గరుండి మీ ఆరోగ్యాన్ని కాపాడుకుంటాను. మిమ్మల్ని బ్రతికించుకొని నా వాన్ని చేసుకుంటాను. రేపు రాత్రికి మీ వద్దుంటాను... మీ విమల....

చూశారా సిస్టర్! నా విమలనన్నర్థం చేసుకుంది. నన్ను ప్రేమిస్తోంది. ఇంకా ప్రేమిస్తోంది. ఇకపై కూడ ప్రేమిస్తుంది' సంతోషం పట్టలేక పోయాడు రాజారావు.

'అంతేకాదు. మీ వివాహానికి నన్ను పిలుస్తారు. అంటే మీరిద్దరూ త్వరలో వివాహం చేసుకుంటారన్న మాట...'

'మిమ్మల్ని పిలవకపోవటమా? మీరు లేందే మా పెళ్ళి జరగదు....సిస్టర్! మీరన్న మాటే నిజమైంది!'

'నాకు తెలుసు రాజారావు గారూ ఆడదాని మనసు... ఎందుకో తెల్సా? నేనూ ఆడదాన్ని కాబట్టి! కాని... కాని...' మిగతా కావ్యాన్ని బాధగా మనసులోనే పూర్తి చేసుకుంది యామిని.

'ఏమిటి సిస్టర్?'

'అబ్బే...ఏమీ లేదు. కాని మీరు ఆమె వచ్చింతర్వాత కూడ ఇలా బాధపడకూడదు.'

''ఇక నాకే బాధాలేదు సిస్టర్! ఇదొక్కటే!! ఇకపై అంతా సంతోషమే!"

"మరింకేం నిశ్చింతగా వుండండి. భగవంతుడు మీ పక్షాన ఉన్నాడు. ఎక్కువగా ఆవేశ పడక హాయిగా విశ్రాంతి తీసుకోండి..."

"యామినీ!" అన్న పిలుపు విని వెనక్కి తిరిగి చూసింది. సుమిత్ర వస్తోంది. వస్తూవస్తూ యామినిని రమ్మని సైగ చేసింది.

'ఇప్పుడే వస్తాను.' రాజారావుతో చెప్పి ఆవైపు నడిచింది యామిని.

'ఏమిటే ఇలా దారి తప్పొచ్చావ్?'

"ఇలారా! నీతో ఓమాట..." బిరబరాలాక్కెళ్ళిందామెను సుమిత్ర.

"ఏమిటే?"

'ఒక్కసారి M 2 కెళ్ళి ఏడోనెంబరు బెడ్ మీది పేషంటును చూసిరా.'

"ఏం?

'అతను బహుశ సుధీర్ అయ్యుండొచ్చు.'

'ఆ(... ! ?'

'అవును. కేన్సర్ బాగా ముదిరి పోయింది. అప్పుడో ఇప్పుడో అనేట్టున్నాడు. నేను నిన్ననేగా వార్డ్ ఛేంజైంది?...అప్పట్నుండీ గమనిస్తున్నాను.తరచూ 'రేఖా' అని మగతగా కలవరిస్తున్నాడు. చటుక్కున నువ్వు గుర్తొచ్చావు. పర్మిషన్ అడిగి ఇలా పరిగెత్తుకొచ్చేశాను. అతని పరిస్థితి చాల ప్రమాదకరంగా వుంది. కాసేపు నేనిక్కడుంటాను. త్వరగా వెళ్ళు. పరిగెత్తు...'

యామిని ఏమీ మాట్లాడలేదు. పిచ్చిదానిలా పరుగు తీసింది।

# 9

ఎదుట కన్పించిన దృశ్యాన్ని చూసి స్తంభించి పోయింది యామిని. ఏదో నెంబరు బెడ్‌పై నున్నది సుధీరే! ఆ సుధీరే!.... కాని అతనిలో ప్రాణంలేదు. తను అక్కడ చేరేలోగానే అంతా అయిపోయింది!

"సుధీర్"...అని అరుస్తూ శవంపై వాలి పోయింది యామిని. అక్కడున్న వారంతా స్తంభించి పోయారు !!

"సుధీర్ ! ఎందుకిలా అయ్యావ్ ? నీకీ భయంకరమైన వ్యాధెలా సంభవించింది ?....ఏమిటిది ? నా కంతా అయోమయంగా వుంది !ఇక్కడికెలా వచ్చావ్ ? ఒకసారి కళ్ళు తెరువ్ సుధీర్ !...నాతో మాట్లాడవూ ?"

ఆమెలో స్త్రీ సహజమైన బాధ మేల్కొంది.

'సిస్టర్....నువ్వు....' డాక్టర్ మధుసూధనరావు ఏదో

అంటున్నారు.

"అవును డాక్టర్ ! నేనే రేఖను.... నేనే యామినిని.. సుధీర్ ఎవరో కాదు. ఒకప్పటి నా దైవం .... కాని డాక్టర్ ... ప్లీజ్ ! చెప్పండి ... ఆఖరు క్షణాల్లో నా సుధీర్ ఏమన్నాడు ? దయచేసి చెప్పండి ... " ప్రాధేయ పడింది.

"సారీ సిస్టర్ ... చనిపోయే ముందతనేమీ చెప్ప లేదు. తలగడ తడుము తూండగానే ప్రాణం పోయింది తలగడ క్రింద చూస్తే ఈ ఉత్తరం కన్పించింది ... " ఓ పొడుగాటి కవరు చూపించారు డాక్టర్ మధుసూధన రావు.

ఆ కవరందుకుంది యామిని. 'రేఖకు' ... అని రాయ బడుంది.

'మెనీ థాంక్స్ ... డాక్టర్' అని అక్కడ ఉండలేక పోయింది ఉన్మాదినిలా పరుగు తీసిన యామినివైపే చూస్తూ స్తబ్ధులై నిలుచుండి పోయారు అక్కడున్న వారందరూ !

# 10

యామిని ముఖంచూడగానే అర్థంచేసుకుంది సుమిత్ర.

కాసేపు ఓదార్చి సాయంత్రం డ్యూటీ అయ్యాక కలుస్తానని చెప్పి, తన వార్డు కెళ్ళిపోయింది.

యాంత్రికంగా కవరు చించింది యామిని.

'ఉందో లేదో తెలియని రేఖకు ....

రేఖా ! ఈ దుర్మార్గుణ్ని క్షమించ గలవా ? .. నిన్ను క్షమించమని అడిగే అర్హత కూడ లేదు నాకు. నిన్ను

య్మించి ద్రోహం చేసిన నయ వంచకుణ్ని. నిన్నేకాదు.
గాంటి అమాయకురాళ్ళను ఎందర్నో నాశనం చేసిన
పాత్ముణ్ని. జీవితంలో మళ్ళీ నిన్ను చూస్తానో లేదో
మకున్నాను. కాని అనుకోకుండా నిన్న నిన్ను ఇక్కడ
స్పిటల్లో చూచి ఆశ్చర్య పోయాను....

ఆ రోజు నువ్వు రాసిన ఉత్తరం అందింది. కానీ
గాదు నేను సంతోషించాను. ఎందుకో తెల్సా? నీతో నా
సరం తీరిపోయాక నా గుట్టు తెలిసిందని !...తృప్తిగా
ర్చుకున్నాను. ఆ రోజు జరిగిన సంఘటన నువ్వూ
గ్నావ్‌గా !

పరంధామయ్య వచ్చాడు. తన కూతుర్ని చేసుకోమని
రించాను. అతను ఎంత మంచివాడో అంత క్రూరుడు
పరుడు

సరస్వతిని చేసుకుంటే ఆస్తి వస్తుందని భ్రమపడ్డాను.
ధామయ్య మాట ప్రకారం వారం లోపలే జరిగి
ఖంది మా పెళ్ళి. నేనూహించిన ప్రకారం ఆస్తి
కిరాలేదు. సరస్వతి పేరుతో రాశాడు పరంధా
ఓ. చస్తూ.

లో పగ రగిలింది. పెళ్ళికి పూర్వం పరంధా
నన్నెన్ని ఆటలాడించాడో గుర్తుకు వచ్చింది.
సరస్వతిపైకి మళ్ళింది. ప్రతి రోజూ ఆమెను
ంచ సాగాను. ఆమె పడుతోన్న బాధలు చూసి
ంచ సాగాను.

వుండగా అక్కడ రాణి నాపై పగ పెంచుకుంది.
య్యతో మా గురించి చెప్పింది. నేను రాణి
హాడ దోచుకున్నాను. ఆ విషయం కూడ

చెప్పింది వాళ్ళన్నయ్యతో. ఉగ్రుడై పోయాడతను. పది మంది రౌడీలను నాపై ఉసిగొల్పాడు.

ఓ నాడురాత్రి నేను సెకెండ్ షో చూసివస్తూండగా పదిమందీ చుట్టుముట్టి చావబాదారు. రాణీ వాళ్ళన్నయ్య వద్దకు తీసికెళ్ళారు. అతడు నన్ను బెదిరించాడు. రాణిని పెళ్ళిచేసుకోకపోతే ఆ పదిమందీ నిన్ను చంపేస్తారన్నాడు ప్రాణాలపై తీపితో ఒప్పుకోవల్సి వచ్చింది. ఫలితంగా రహస్యంగా జరిగిపోయింది ఆ రోజు మా పెళ్ళి. ఈ విషయం సరస్వతికి తెలీదు।

...రాణి నన్ను పూర్తిగా లొంగదీసుకుంది. నాకు తాగుడు నేర్పింది. డబ్బులు సరస్వతి నడిగితెమ్మనేది. ఆమెకు ఆమె నోటికి, వాళ్ళన్నయ్య చేతికి పూర్తిగా లొంగిపోయిన నేను డబ్బుకోసం సరస్వతిని వేధించాను. మరింత హింసించాను. మనసులో అగ్నిగుండాలుపుట్టినా వాటినిభరించి నన్ను క్షమించింది. అంతేకాదు. రాణిని కూడ మన యింటికే తీసుకురమ్మంందా దేవత।

రాణిని తీసుకొచ్చేసరికి నరకయాతన అనుభవించ వలసి వచ్చింది. రాణితోపాటు వాళ్ళన్నయ్య గోవింద రావూ వచ్చాడు.

ఆ తర్వాత మాయిల్లు మరీ ఘోరనరకమై పోయింది.

ఇంటి అధికార మంతా రాణి హస్తగతమైంది. నెమ్మదిగా ఇల్లు గుల్ల చెయ్యసాగింది. ఇంట్లోనే నాతో త్రాగించ నారంభించింది.

ఓ రోజు గోవిందరావు తాగి సరస్వతి చెయ్యి పట్టుకున్నాడు. అదే సమయంలో వచ్చానేన్నను। అటువంటి పరిస్థితిలో ఎంత పిరికివాడైనా చేతులు ముడుచు

ఓర్చుకోలేక పోయాను. ఉద్రేకంలో గోవింద రావును ఇష్టంవచ్చినట్లు వాదేశాను. ఇంట్లోంచి వెళ్ళి పొమ్మన్నాను.

'నీ అంతు తేలుస్తాను' అంటూ వెళ్ళిపోయాడు వాడు. రెండ్రోజుల తర్వాత మళ్ళి వచ్చాడు. తాగిన మైకంలో చేసిన తప్పుకి క్షమాపణ కోరుకున్నాడు. సరస్వతికాళ్ల పట్టుకోబోయాడు. వాణ్ణి క్షమించింది సరస్వతి.

"మరో పది రోజుల్లో సరస్వతికి నొప్పులొచ్చాయ్. ఆరోజు రాణి హృదయం కాస్త కరగింది. కాస్త దయ చూపించింది. నొప్పులు తగ్గటానికి కాస్త శొంఠి కాఫీ కాచి యిచ్చింది. గోవిందు, నేను డాక్టర్ని తీసుకురావ టానికెళ్ళాం. అరగంటలో వచ్చాము డాక్టర్ తో.

వచ్చే సరికి...

సరస్వతి మంచంపై అచేతనంగా పడివుంది. రాణి ప్రక్కనే కూర్చొని కంటికి, మంటికి ఏక ధారగా ఏడు స్తోంది. నాకేమీ అర్థం కాలేదు.

నొప్పుల బాధకు తాళలేక సరస్వతి ప్రాణం పోయిందని వెక్కుతూ చెప్పింది రాణి.

బావురుమన్నాన్నేను...

ఆ మరు రోజే డాక్టరు ఫోన్ చేశాడు నాకు. వీలైతే ఓసారి కలవమన్నాడు. వెంటనే వెళ్లాను.

'మిస్టర్ సుధీర్...మీరే మనుకోక పోతే ఓ మాట చెబుతాను' అన్నారు.

'ఏమిటి డాక్టర్?' అన్నాను.

'మీ ఆవిడ మరణించే ముందు ఆమెకేదైనా పాసీ! యం లాంటి దివ్వబడిందా?' అడిగారు.

'నాకు తెలీదు. ఎందుకు?' అన్నాను.

'ఆమెకు విషప్రయోగం జరిగింది' అన్నారు.

అవాక్కైపోయాను. సరస్వతి చనిపోయాక కూడా డాక్టరు ఎందుకు పరీక్షించాడో అప్పుడర్థమైంది.

'అవును మిస్టర్ సుధీర్! ఆమె ముఖం చూడగానే నాకెందుకో అలా అనిపించింది' అన్నారు.

నా మదిలో రాణి మెదిలింది వెంటనే.

యింటికి వెళ్ళాను. మాటల సందర్భంలో శాంతి కాఫీ విషయం రాబట్టాను. కోపంతో ఉగ్రుణ్ణయిపోయాను.

అది రాణి కాదు! రాక్షసి!!

అదీ, వాసు కలిసి ఓ అమాయకురాలి ప్రాణం నిలువునా తీశారు. సరస్వతి చెయ్యి పట్టుకున్న నేరానికి గోవిందు నాతో తన్నులు తిన్నాడుగా! ఆ పగ మనసులో ఉంచుకొని చెల్లెలిని ఉసిగొల్పి ఈ నీచ కార్యం చేయించాడా దుర్మార్గుడు! కాని ఏం చెయ్యగలను? పిరికి తనం నా పక్షానుంది. మనసులోనే సానుభూతి చూపించాను సరస్వతిపై.

ఆ తర్వాత రాణి చర్యలు మితిమీరాయి. ఇంట్లో సరిగా ఉండేది కాదు. క్లబ్బుకని, సినిమాలకని తరచూ వెడుతూండేది.

ఆ బాధతో నా ఆరోగ్యం దెబ్బతిన్నది. ఆ సమయంలో రాణి భార్యగా కాదు సరికదా, కనీసం స్నేహితురాలిగానైనా చూడలేదు నన్ను. జీవచ్ఛవంలా పడున్నాను రెండు మాసాలు. ఆ తర్వాత ఓ రోజు రాణి అదృశ్యమైంది. బహుశ వాళ్ళన్నయ్యతో పరారైందో లేక ఎవడితోనైనా...!

ఆ తర్వాత నన్ను పలకరించే దిక్కులే కపోయింది. కనీసం ఇరుగుపొరుగువారుకూడ వలకరించడంమానేశారు.

ఒక్కసారిగా నేను చేసిన పాపాలన్నీ గుర్తొచ్చాయ్. నా గుండెలపై సమ్మెట పోట్లను విరజిమ్మసాగాయ్. నేనెవరికి ద్రోహం చేశానో వారందరూ నాపై ప్ర గుడ్లు రిమి తదేకంగా చూస్తూన్నట్టు, నా గొంతు నులుమ బోయేట్టు ఫీలయ్యే వాణ్ని. నా కామదాహానికెరైన నీలాంటి వారితోగడిపిన పూర్వసంఘటనలు ఒక్కొక్కటీ ఒక్కొ ంల్లెపై నా గుండెలో బలంగా గుచ్చుకోసాగాయి.

నాపైనాకే కసి, పగ ఏర్పడసాగాయి. వుద్యోగానికి జైనిచ్చేశాను. ఈ బాధల్ని మర్చిపోవటానికి రాణినేర్పిన తాగుడు బాగా సహకరించింది. నా భాగానికి తలిదండ్రు చ్చిన అయిదెకరాల మాగాణి హారతికర్పూరమైంది.

ఆరోగ్యవంతుణ్ని కాలేక పోయాను సరికదా, భయం రమైన కేన్సర్ వ్యాధికి గురయ్యాను. అయినా బాధ లేదు. బ్రతకాలని లేదు.

యింకా నేనెవరి కోసం బ్రతకాలి?

అందుకే ఆరోగ్యాన్ని సంపాదించుకోవటానికి పని చ్చే డబ్బుని కూడ తాగుడుకే వాడేశాను. ఓరోజు రిసారిగా చిత్తుగాతాగి మత్తుగా రోడ్డుమీద నడుస్తూ క్టరుగారి కారుక్రింద పడ్డాను. ఆయనే నన్నిక్కడికి రు. ఎంతో శ్రమ తీసుకున్నారు. కానినేను చేసిన లు నన్ను క్రమంగా మింగేస్తోన్నాయని ఆయనకి మో! నిన్న నిన్ను ఇక్కడ చూశాక యీ రం వ్రాయకుండా వుండలేక పోతున్నాను.

నన్ను క్షమించమని కోరుతూ—

సుధీర్...."

....భయంకరంగా ఉరిమింది ఆకాశం. మెరుపుల సెర్చిలైట్లు మరింత భీకరంగా ప్రకృతిని చూస్తోన్నాయి. కుండపోతగా వర్షం కురుస్తోంది.

....యామిని నిర్జీవంగా కూర్చుండిపోయింది. అయిదు నిమిషాలపాటు తన ప్రాణంకూడ శరీరంనుండి వేరైనట్టు ఫీలైంది. తనకే తెలియని ఏదో సందిగ్ధావస్థలో కాసేపు నలిగిపోయింది.

ఒక్కసారి వార్డంతా కలియజూసింది. ప్రక్కవార్డులో ఎవరివో భయంకరమైన కేకలు, ఆర్తనాదాలు వినబడుతోన్నాయి. తన వార్డులో అందరూ నిద్రావస్థలో వున్నారు. మస్తాన్ మాత్రం అటూయిటూ కదుల్తోన్నాడు. నిద్రిస్తోన్న రాజారావు ముఖంలో ప్రశాంతత, సంతోషపు ఛాయలు తాండవిస్తోన్నాయి.

...చెమ్మగిల్లిన కళ్లని తుడుచుకొని ఓ దృఢ నిశ్చయంతో గబగబ అలమారుకేసి నడిచి అందులోంచి స్లీపింగ్ టాబ్లెట్సు వున్న బాటిల్ తీసుకుంది యామిని!!

(ఐపోయింది)

# అపరిచితుడి సలహా!

మోదుకూరి జతీంద్రశర్మ

హాంషారుగా యీల వేస్తూ డ్రెస్ చేసుకోబోతూంటే అమ్మ కంఠం విన్పించింది. 'నీ కోసం ఎవరో వచ్చేర్రా బాబీ

ఎవరై ఉంటారు?

ఎవరైనా యిప్పుడు కలిసే మూడ్‌లో లేను. మొదటి రోజు నా ఉద్యోగానికి వేళ. కొత్త ఉద్యోగం.

చిన్నగా విసుక్కుంటూ పైటికి వచ్చేను.

ఎవరో అతను నాకు తెలియదు. నీట్‌గా డ్రెస్ అయి ఉన్నాడు. నా ముఖంలో ఆశ్చర్యాన్ని పశి కట్టినట్లు 'క్షమించండి! నేను మీకింతకు ముందు తెలియదు.' అన్నాడు చిర్నవ్వుతో.

'లోపలికి రండి!' ఆహ్వానించాను.

'నా పేరు రత్నాకర్! మీ పేరు నీలకంఠరావ్ కదూ! అన్నాడతను.

అవునన్నట్లుగా తలూపాను.

'మిమ్మల్నింకా ఎక్కువ ఆశ్చర్య పరచను. మీరు ఎవరో నిన్నటి వరకూ నాకు తెలియదు. నిన్ననే తెలిసింది, కామారెడ్డి దగ్గర సెక్రటరీగా జేర బోతున్నట్లు. నిజమా !'

నిజమే. కామారెడ్డి ప్రభుత్వ వర్గాల్లో చాలా పలుకుబడి కల వ్యక్తి. ఈ మధ్యనే అతను కౌన్సిల్‌లో మెంబరుగా ఎలక్టు అయేడు. మంత్రి పదవి కూడా యివ్వొచ్చునేమో. అటువంటి వ్యక్తి దగ్గర సెక్రటరీగా చేరబోతున్నాను. యివేళ్నుండే డ్యూటీలో జాయినవాలి.

'అవును. యింతకీ ...' సందిగ్ధంగా అపాను.

'నేను చెప్పబోయేది మీకు రుచించకపోవచ్చు. కామారెడ్డి దగ్గర ఉద్యోగం అంత మంచిది కాదు. చేరకండి." అయాచితంగా సలహా యిచ్చాడతను.

ఛర్రున కోపమొచ్చింది నాకు. ఎవరో అపరిచితుడు నాకు సలహా యిస్తున్నాడు. అదీ నే కోరకుండా.

'ఏం ? ఎందుకని ?' కోపంగానే అడిగాను.

'కొన్ని విషయాలను బహిర్గతం చేయకూడదు. అపరిచితుడ్ని. నిన్నటి వరకూ మీరెవరో నేనెరుగను. యిప్పటి వరకూ మీకు నా పేరే తప్ప నాగతం తెలియదు. అయినా మిమ్మల్ని ఓ ఉద్యోగంలో చేరవద్దని సలహా యిచ్చేనంటే అది మీ మేలుకోసమేనని మీరు గ్రహించాలి." అన్నాడు రత్నాకర్.

"మీ స్వార్థం ఎందుక్కాకూడదు?" పళ్లబిగువున అడిగాను.

"నిజమే, అలా మీరనుమానించవచ్చు. కాని మిష్టర్ రావ్! ఒక్కమాట." క్షణం ఆగాడతను. మాటలు

పేర్చుకోవటానికి అన్నట్లుగా 'నేను మీ మంచికోరి చెప్తున్నాను. మీరు కామారెడ్డివగ్గర ఉద్యోగం చేయకండి. అదీ సెక్రటరీగా।'

నాకు మతిపోతోందో లేక ఎదుటివాడి మతి సరిగ్గా ఉందో లేదో అనుమానమొస్తోంది.

'ఎందుకా సలహా యిస్తున్నారో?'

'క్షమించండి. ఆ కారణం నేను చెప్పలేను. ఒక్కటి మాత్రం నిజం. భవిష్యత్‌లో మీరు నా సలహాని పాటించక పోతే విచారించే సంఘటనలు ఎదురవుతాయ్।' అన్నాడు రత్నాకర్.

'కామారెడ్డి మీకు శత్రువా? లేక కామారెడ్డి దగ్గర ఉద్యోగం కోసం మీ బంధువెవరైనా ప్రయత్నిస్తున్నాడా? నేను మీకు తెలియక ఏదైన అపకారం కానీ, ఉపకారం కానీ చేసేనా? ఎందుకిస్తున్నట్లు ఈ సలహా?' ప్రశ్నల వర్షం కురిపించాను.

చిన్నగా నవ్వాడతను.

'మీరు వేసిన ప్రశ్నలకన్నిటికి నా సమాధానం కాదనే వస్తుంది. మరొక్కసారి చెప్తున్నాను మిష్టర్ రావ్। దయచేసి కామారెడ్డి దగ్గర ఉద్యోగం చేయకండి। నా సలహా పాటించినా పాటించక పోయినా మీ యిష్టం.' అన్నాడు రత్నాకర్ లేస్తూ.

'దయచేసి కూర్చోండి.' చేత్తో కూర్చోమన్నట్లు సైగ చేస్తూ అడిగాను. "నిన్నటి వరకూ నేను మీకు తెలియదన్నారు. నిన్ననే తెలిసిందన్నారు. ఎలా? ఎలా తెల్సింది మీకు, నేను కామారెడ్డి వగ్గర ఉద్యోగం అంగీకరించేనని. నా ఎడ్రస్ ఎలా తెలిసింది। ఎందు....కీ'

మధ్యలోనే ఆపి అన్నాడు అతను. "మిష్టర్ రావ్! మీరు వేసిన ప్రశ్నలు మీ ఆలోచనా సరళిని చెప్తున్నాయ్. కానీ అదే విధంగా ఆలోచించండి. ఎందుకీ సలహా నేను చెప్తున్నదీ మీకు తోచకపోయినా, కనీసం మీ మేలు కోసం నేనీ విషయాన్ని చెప్తున్నట్లు తోస్తుంది.' లేచి గుమ్మంకేసి వెళ్తూ అన్నాడు రత్నాకర్ కొంచెం సీరియస్‌గా. 'హి ఈజ్ ఎ మానియాక్! అతనికి హత్యలు చేసే అలవాటుఉంది మిష్టర్ రావ్! హి ఈజ్ ఎ కిల్లర్! అని వెళ్లిపోయాడు.

నేను స్థాణువై నిలబడిపోయేను.

# 2

అతని మాటలు నన్ను నిశ్చేష్టుడిని చేసేయి. నన్ను ఆలోచనల్లోకి తోసి వెళ్ళిపోయాడతను.

ఎవరీ రత్నాకర్? అతనికి కామారెడ్డి కిల్లర్ అనీ, మేనియాక్ అని ఎలాతెలుసు? నేను ఉద్యోగంలో చేరుతున్నట్లు ఎలాతెలుసు? అతని సలహా పాటించాలా? అక్కర్లేదా?

ఎన్నో ప్రశ్నలు? సమాధానం దొరకని ప్రశ్నలు?

కానీనేనీ ఉద్యోగాన్ని మానేసే స్థితిలోలేను. నాలుగు సంవత్సరాల భయంకర నిరుద్యోగ జీవితం తరువాత ఈ ఉద్యోగం వచ్చింది నాకు.

రత్నాకర్‌కి, నేను ఈ ఉద్యోగంలో జాయిన్ అవ డానికి సంసిద్ధత తెలిపేముందు ఎంత ఆలోచించానో తెలియదు, ఎప్పటికీ.

కామారెడ్డి అన్నా, కామారెడ్డి లాటి ప్రజలను దోచి పెద్ద వాళ్ళయ్యే నాయకులన్నా నాకు గౌరవంలేదు. అసహ్యం మీదు మిక్కిలి. ఎన్నో వ్యాసాలు వ్రాసేను కామారెడ్డి అన్యాయాలను బయటపెడుతూ కామారెడ్డి. వంటవాడు ఏదైనా చేయగలడనే నమ్మకంతో నా పేరు బహిరంగ పర్చలేదు ఎప్పుడూ.

అయితే నాకు అన్నంపెట్టలేదు నా వ్యాసాలు. కనీసం రెమ్యూనరేషనైనా పంపలేదు, ఆ వ్యాసాలను ప్రచు రించిన పత్రికలు. నాకు ఉద్యోగం కావాలి అనినేను రోజులో ప్రతీక్షణం అనుకొనే సమయంలో వచ్చిందీ అవకాశం.

ఈ అవకాశాన్ని యిప్పుడు నేను జార విడుచుకొని వృద్ధురాలైన నా తల్లిని, చిన్నవాళ్ళైన నా తమ్ముళ్ళని పస్తు పడుకోబెట్టలేను.

అందుకే మానసికంగా యిష్టంలేక పోయినా సిద్ధ పడ్డాను. అంతేకాదు. ఈ అవకాశంతో కామారెడ్డి వాళ్ళు ఎటువంటి అక్రమాలు తలపెడతారో యింకా స్పష్టంగా తెలుస్తుంది. యింకా బాగా నేనతని అక్రమా లని బయటపెట్టవచ్చు. అలా నన్ను నేను రాజీపడ్డాక సిద్ధపడ్డాను.

కానీ ఎవరీ రత్నాకర్?

ఎందుకీ సలహా యిచ్చినట్లు?

అయాచితంగా సలహా లిచ్చేవాళ్ళంటే నా కేమాత్రం సదభిప్రాయం లేదు. అటువంటి సలహాలను గౌర వించను కూడా.

ఆలోచనల లోంచి తెప్పరిల్లి దేవుడి గదిలోకి వెళ్ళాను. దేవుడికి నమస్కరించి బైటికి వస్తుంటే అమ్మ అంది. 'బాబీ నాకు చాలా ఆనందంగా ఉందిరా! నువు త్వరలోనే వృద్ధిలోకి వస్తావ్!'

అమ్మ చాదస్తానికి నవ్వొచ్చింది. నేను పరీక్షలకి వెళ్లే ప్రతీసారి యిదేమాట అంటుంది అమ్మ.

అమ్మ కాళ్లకి నమస్కరించి బయటపడ్డాను. తమ్ముళ్లిద్దరూ ఆనందంతో గుడ్ లక్ చెప్పారు.

నేను ఉద్యోగంలో చేరుతున్నాను అన్న సంగతి తెలిసిన నాటినుండి తమ్ముళ్ళిద్దరూ, అమ్మా చాలా ఆనంద పడిపోతున్నారు.

ఆ ఆనందం చూస్తుంటే నాకు కళ్ళు చెమర్చాయి.

ఎవరో అపరిచితుడి సలహా పాటించి, ఆ ఆనందాన్ని వాళ్ళనుంచి దూరం చేయనా?

నో!

కామారెడ్డి ఆఫీస్ మా యింటి నుంచి పదిహేను నిమిషాలు నడక. చిక్కడపల్లిలో ఉంది కామారెడ్డి ఆఫీస్. కామారెడ్డి యిల్లు బేగంపేట దగ్గర ఎక్కడో ఉంది. ఈ ఆఫీస్‌లోనే నన్ను యింటర్వ్యూ చేసాడు కామారెడ్డి.

కామారెడ్డిని నేను చూడటం నాకు అది ప్రథమం కాదు. పెద్దగా అజానుబాహువులా ఉంటాడు కామారెడ్డి. రిమ్‌లెస్ కళ్ళద్దాలు. ఆ కళ్ళద్దాలలోంచి ఎదుటి వారిని పరిశోధిస్తున్నట్లు ఉంటాయి కళ్లు. అవి కొద్దిగా విషం కురిపిస్తున్నట్లే ఉంటుంది నాకు.

డబ్బున్న ప్రతి వాడి వెనక ఏదో అన్యాయమూ, అక్రమమైన చరిత్ర వుంటుందీ అని నానమ్మకం. దోపిడి

చేస్తే తప్ప ఎవడూ ధనవంతుడు కాలేదన్నది నాసిద్ధాంతం.

కామారెడ్డి అమాయక ప్రజలను ఎలా మోసం చేసేదీ నాకు తెలుసు। వాళ్ళ అమాయకత్వం ఆసరాగా వాళ్ళని ఎలా దోపిడీ చేసేదీ నాకు తెలుసు.

అయినా యివేళ కామారెడ్డి దగ్గర ఉద్యోగం చేయ టానికి సిద్ధపడ్డాను.

యిదీ ఒకందుకు మంచిదే। నేను నిర్ణయించుకున్న ప్రకారం కామారెడ్డి మోసాలు యిక ముందు ప్రపంచానికి యింకా బాగా తెలుస్తాయ్. నేనే ఆ వ్యాసాలు వ్రాసేది అని కామారెడ్డికి తెలిసే అవకాశం యివ్వకూడదు నేను.

# 3

ఆఫీసుకు చేరకోగానే కామారెడ్డి పిలుస్తున్నాడంటూ కబురు వచ్చింది.

వినయం చూపించ వలసివస్తున్నందుకు మళ్ళీ విచా రించబోయినా అంతలోనే నన్ను నేను తిట్టుకున్నాను. యిది తప్పదని తెలిసి వచ్చినా యింకెందుకూ విచారం ?

'ఎస్ బాస్ ।' వినయంగా చేతులు కట్టుకొని అన్నాను.

'వెరీగుడ్ । చాలా కరక్టుగా సమయానికి వచ్చావు. యిలా పంక్చువాలిటీ చూపించే వాళ్ళంటే నా కిష్టం. నీ పనంతా ఏం చెయ్యాలో పరమేశాన్ని అడిగి తెలుసుకో. పనిలో ఖచ్చితంగా ఉండాలి సుమా !' హెచ్చరిస్తున్న ట్లుగా అన్నాడు కామారెడ్డి.

అలాగే అన్నట్లు తలూపాను.

'పరమేశాన్ని పిలుస్ !' అని ప్రక్కనున్న నౌక రుతో చెప్పి అడిగాడు. 'బి. కామ్. కదూ నువు పాస యింది. ఎకౌంట్స్ చూడగలవ్ కదూ !'

'చూడగలను.' ముక్తసరిగా సమాధానం యిచ్చాను.

కామారెడ్డి కళ్ళు ఒక్కసారి కిందనించి మీదవరకూ నన్ను పరికించాయి.

'నువ్వు యివేళ్టినుంచి నా సెక్రటరీవి. ఎక్కడ ఏది అవసరమొచ్చినా అన్నీ చెక్ చేసి నాకు సంతకాలకోసం యివ్వాలి. నేను కౌన్సిల్లో మాట్లాడే ప్రతిమాటా ప్రెస్‌కి యివ్వాలి. ఎక్కడన్నా పబ్లిక్‌మీటింగ్స్‌లో నేపాల్గొంటే ఆ ఫోటోలు కూడా యివ్వాలి. చాలా చురుగ్గా పని చేయాలి. తెలిసిందా ?'

మళ్ళీ వినయంగా తలూపాను.

యింతలో ఓవ్యక్తి వచ్చేదక్కడికి. యాభై వెళ్ళుండ వచ్చు. పంచెకట్టు. నుదుట పిభూతి. దైవం అంటే భక్తి చాలా ఎక్కువఉన్నట్లుంది. అతనే పరమేశం అనిఅర్థం చేసుకున్నాను.

'చూడు పరమేశం యితను ..... సందిగ్ధంగా ఆగాడు.

"నీలకంఠరావ్" పేరందించాను.

"నీలకంఠరావా నీ పేరు. ఆ, సరే, యితను యివ్వాళ్టి నుంచి నా కొత్త సెక్రటరీ. ఏం చేయాలో ఏదేది ఎక్కడున్నాయో చెప్పు. అన్నీ జాగర్తగా నేర్పు.' చేత్తో వెళ్ళ మన్నట్లుగా సైగచేశాడు.

మౌనంగా బయటికి వచ్చాను.

'యిలారండి!' అంటూ కామారెడ్డి ఉన్నగదికి ఎదురుగా ఉన్న గదికి తీసుకు వెళ్ళారు.

చాలా చక్కగా అన్ని సౌకర్యాలు అమర్చి ఉన్నాయ్ ఆ గదిలో. రెమింగ్‌టన్ పోర్టబుల్ టైప్‌రైటర్, చక్కటి రోజ్‌వుడ్ టేబిల్ మీద ఉంది. ఆ టేబిల్‌కి యిటూ అటూ చెయిజాపితే అందేలా రాక్స్, ఆ రాక్స్‌లో అ స్తవ్యస్తంగా పేర్చబడి ఫైళ్లు ఉన్నాయి. పక్కన ఓ టెలిఫోన్, చిన్న స్టేండ్ మీద అమర్చబడి ఉంది.

ప్రక్కగా గ్లాస్‌డోర్ అవతల నాలుగు అయిదు టేబిల్స్ ఉన్నాయ్, అవి మిగిలిన ఉద్యోగులవి-ఎకౌంటెంట్ మిగిలిన గుమాస్తాలు ఉంటారు ఆ గదిలో.

'యిది మీ గది అది మా గది. బెల్ నొక్కితే వచ్చి మీకు కావలసిన వివరాలు అందజేస్తాను.' అని వెళ్లి పోయాడు పరమేశం.

నా సీట్లో ఓసారి కూచున్నాను. యివేళనుంచి యీసీట్ నాకోసం ప్రత్యేకం అనుకోగానే అదోరకమైన అనుభూతి మనసంతా నిండిపోయింది.

ఫైల్స్ తీసి చదువుతూ అబ్జర్వ్ చేయసాగాను.

# 4

రోజులు చకచక గడచిపోసాగాయి.

ఉదయాన్నే ఆఫీస్‌కి వెళ్ళి ముందురోజు కామారెడ్డి కౌన్సిల్‌లో అడిగిన ప్రశ్నలకు సమాధానాలు, కామారెడ్డి వ్యాఖ్యలూ అన్నీ ప్రెస్‌నోట్ తయారుచేసి యిచ్చేవాడిని పేపరులో ఎక్కడో ఏ మూలో ప్రచురింపబడేవి అవి. అవి కట్‌చేసి ఫైల్‌లో అంటించాలి,

కామారెడ్డికి సంబంధం కలిగిన కంపెనీలు చాలా ఉన్నా

య్. ఆ చాలా కంపెనీల్లో కొన్నే కామారెడ్డి తన పేరుతో షేర్సు కొనేది. మిగిలినవన్నీ దొంగ పేర్లతో కొన్నవే. చాలా లాభాలకి అతను టాక్సులు కట్టడు. మహబూబ్ నగర్‌లో అతని ముప్పై ఎకరాల తోట, దాదాపు నూరు ఎకరాల పొలం ఉంది. రికార్డుల ప్రకారము ఎప్పుడూ ఆ పొలం పండదు. ఆ తోటలు ఫలసాయాన్ని యివ్వవు.

ఎందరో కామారెడ్డి దగ్గరకి 'పనులు' చేయించు కొనేందుకు వస్తారు. అన్నిటికి రేట్స్ పెట్టాడు కామారెడ్డి, అదేదో సినిమాలో కంట్రాక్టర్‌లా. 'పని' జరిగినా జరగకపోయినా అతను అడిగే డబ్బుని ముందే యిచ్చెయ్యాలి.

ఆవేళ జరిగిన సంఘటన నా మనసులో కామారెడ్డి మీద అసహ్యాన్ని ఎక్కువ జేసింది.

కామారెడ్డి దగ్గిరికి ఓ ముసలాయనా ఓ కుర్రాడూ వచ్చేరు. ఆ కుర్రాడికి ఉద్యోగం కావాలి బి. ఏ. పాస యాడా కుర్రాడు. మామూలుగా ఉద్యోగానికి కామారెడ్డి డబ్బు వసూలు చేసేడు. వారం రోజుల తరువాత రమ్మనీ ఆ కుర్రాడికి ఉద్యోగం వస్తుందనీ చెప్పాడు కామారెడ్డి.

అ తరువాత నుంచి ఆ కుర్రాడు ప్రతిరోజూ తిరిగాడు ఆఫీస్ చుట్టూ. ఏం జరిగిందో తెలీదు కానీ ఆ కుర్రాడికి ఉద్యోగం రావటం అసంభవం అని తెలిసింది

ఆ కుర్రాడికి ఎంత నిరాశ కలిగిందో అవేళ అతని మొఖం చెప్పింది ఉద్యోగం యివ్వలేదు కనక తన తండ్రి కట్టిన డబ్బు యిచ్చేయమన్నాడా కుర్రాడు.

సమాధానం మామూలే! డబ్బు రాదు. ఉద్యోగంరాదు.

ఆవేశంతో కామారెడ్డిని తిట్టేడా కుర్రాడు.

కామారెడ్డి ఆవేశపడలేదు. నిదానంగా అతిట్లన్నీ విన్నాడు. వెళ్ళి పొమ్మని సైగ జేసి తన కారెక్కాడు.

ఆవేళ సాయంత్రం చిక్కడపల్లి బస్ స్టాప్‌లో నుంచున్నాను సికిందరాబాద్ కెళ్ళే పని వుంది.

అటువైపు పేవ్‌మెంట్ మీద నడుస్తున్న అతనునన్ను చూసి నావైపు రాబోయేడు.

యింతలో ఎక్కడ్నించో ఓ టాక్సీ వచ్చి అతన్ని గుద్దేసింది. ఆగకుండా వెళ్ళి పోయింది ఆ టాక్సీ. ఆ కుర్రాడక్కడే చనిపోయాడు.

నాకు వెంటనే అర్థమయి పోయింది. ఆ టాక్సీ ఆ కుర్రాడిని ఎందుకు గుద్దిచంపిందో, ఆ పనిఎవరు చేసారో? హిట్ అండ్ రన్!

మనసు భగ్గన మండిపోయింది.

ఓ వ్యాసం రాసేను కామారెడ్డి ఆ దుశ్చర్యం వర్ణిస్తూ. హైదరాబాదు నుంచి ఓ పత్రిక వెలువడుతుంటూంది. మినిష్టర్స్, పముఖరాజకీయనాయకులు చేసే మోసాలను బయటపెడుతూ ఉండటమే ఆ పత్రికధ్యేయం. ఆ పత్రికకే పంపాను నావ్యాసం.

నాకు తెలుసు ఆవ్యాసం అచ్చవుతుందని. ఆ పత్రిక కామారెడ్డికి కూడా వస్తుంది.

కామారెడ్డి ఎలారియాక్ట్ అవుతాడో చూడాలి.

## 5

బాస్ నిన్ను పిలుస్తున్నారు. పరమేశం వచ్చి

చెప్పాడు, ఆఫీసులోకి రాగానే.

నేనూహించినట్లు కామారెడ్డి ఆ వ్యాసం చదివి ఎగిరి గంతెయ్యలేదు. చిందులు తొక్కలేదు. ఏం జరగనట్లే ఉండిపోయేడు.

కౌన్సిల్లో ఆ వ్యాసం చదివిన మరో సభ్యుడడిగిన ప్రశ్నకు తనకేమీ తెలీదని, తన మీద నేరారోపణ చెయ్యటమే ఆ పత్రిక ఉద్దేశం అనీ వర్ణించాడు.

నాకు కొద్దిగా ఆశాభంగం కలిగింది.

'చూడు రావ్! రేపు ఢిల్లీలో పార్టీ మీటింగ్ ఉంది. వెళ్ళాలి. తయారుగా ఉండు. ఈ రాత్రికి ఫ్లైట్‌లో వెళ్తున్నాం. జిల్లాలో పార్టీ కార్యకలాపాలు అంటూ ఓ వ్యాసం తయారు చేయ్. అద్భుతంగా ఉండాలి.' అన్నాడు నన్ను పరీక్షగా చూస్తూ.

వ్యాసం అనగానే నాకు కొద్దిగా భయం వేసింది.

"కానీ సర్..." ఏదో అనబోయేను.

'ఫరవాలేదు రావ్! తయారు చేయ్. ఏవైనా లోపాలుంటే మధ్యాహ్నం దిద్దుతాను' అన్నాడు వెళ్ళిపొమ్మని చేత్తో సైగ జేస్తూ.

మధ్యాహ్నం మూడు గంటలయింది ఆ వ్యాసం రాసే సరికి. అభూతకల్పనలు ఆ వ్యాసం నిండా. ఆ వ్యాసంలో రాసిందే నిజమయితే మహబూబ్‌నగర్ జిల్లాలో అందరూ కామారెడ్డి పార్టీ వ్యక్తులే అయుండాలి. అయితే చందాలు మటుకూ వాళ్ళు కట్టరన్న మాట.

బాస్ కామారెడ్డి చాలా మెచ్చుకున్నాడు ఆ వ్యాసం చూసి. 'మన జిల్లాలో యింత సేవ జరిగినట్లు నాకే

తెలిదే!' అన్నాడు నవ్వుతూ.

వినయంగా నవ్వేను.

'యింతకు ముందు ఢిల్లీ వెళ్ళావా?' అడిగాడు.

" లేదుసర్. యిదే మొట్టమొదటిసారి!" అన్నాను.

'ఓ. అయ్‌సీ. ఢిల్లి చూడవగ్గ ప్రదేశం. జాఫర్ వస్తాడుగా మనతో. అతడు చూపెడ్తాడు ఢిల్లిలో అన్నీ.'

జాఫర్!

వీడెవడు, యింతవరకు వీడిపేరు వినలేదు. వీడ్ని చూడలేదు.

"చలా థాంక్స్ సర్! కానీ...."

" జాఫర్ తెలీదంటావ్. యివాళ రమ్మని చెప్పాను, వస్తాడు." వెళ్ళమన్నట్లు చెయ్యూపాడు.

ఆ చెయ్యి ఊపడం చూస్తే నాకు వళ్ళుమంట,

ఆ చెయ్యి విరిచేయాలనిపిస్తుంటుంది ప్రతీసారి. కానీ నా మెడలు విరిగిపోతాయ్ ఆ తరువాత. నాకు నా మెడ అంటే అమితమైన యిష్టం. అందుకని ఆ చేయి విరిచే యత్నం చేయలేదు.

గదిలోకి వచ్చేసరికి ఎవరో కొత్తవ్యక్తి కూర్చు న్నాడు విజిటర్స్ ఛైర్‌లో.

టైప్‌రైటర్ టక్ టక్ మంటోంది వాఘగా, ఒక్కొ క్క అక్షరాన్ని గట్టిగా కొడుతున్నాడావ్యక్తి.

'అలాచేస్తే టైప్‌రైటర్ కాణీకి పనికిరాదు, 'అన్నాను కోపంగా.'

వెనక్కి తిరిగైనా చూడకుండా 'సో వాట్' అన్నాడు

నాకు వళ్ళుమండింది.

"హూ ఆర్ యూ?" అరిచాను కోపంగా.

"అంత కోపం కూడదు మిష్టర్...." అంటూ వెనక్కి తిరిగాడు.

ఆ ముఖం చూస్తునే తుళ్ళిపడ్డాను.

అంత భయంకరమైన మొఖాన్ని యింతకు ముందు నేనెప్పుడూ చూడలేదు. చింపిరి జుట్టూ, పెద్దగా పెరిగిన మీసాలు, గబుక్కున వెదకినా దొరకనట్లు మొఖం, దాన్ని కవర్ చేస్తూ గడ్డం హఠాత్తుగా రాత్రివేళ కనపడితే జడుసుకుంటారు పెద్ద వాళ్ళైనా!

'ఏమిటలా ఉండి పోయేవ్ సెక్రట్రీ' నవ్వాడు అతను.

నాలో చలనం వచ్చింది. వీడిరూపం చూసి జడిసి నందుకు నన్నునేనే నిందించుకున్నాను.

'హూ ఆర్ యూ?' మళ్ళీ గట్టిగా అరచేను.

అరవకు. గొంతునెప్పెడుతుంది. అని టైప్‌రైటర్‌లో యిన్‌సర్టు చేసిన కాయితం తీసి యిచ్చేడు.

జె. ఎ. ఎఫ్. ఎ్ ఎ. ఆర్. దూరదూరంగా కేపిటల్ లేటర్స్‌లో కొట్టి ఉన్నాయ్.

"జాఫర్' పైకి చదివేను.

'యస్. మై నేమ్ ఈజ్ జాఫర్.' అన్నాడు గర్వంగా

మరొక్కసారి పరీక్షగా చూసాను.

వీడా నాకు ఢిల్లీ చూపేది. వీడితోనా ఢిల్లీలో నేను గడపాలి. నా మనసు బరువుగా మూలిగింది.

నిస్సత్తువుగా సీట్‌లో కూలబడ్డాను.

'యిదుగో సెక్రట్రీ టిక్కట్స్.' అంటూ టికట్స్ నాముందు పడేసాడు.

నన్ను వాడు 'సెక్రటీ' అనిసంబోధించినందుకు కోపం వచ్చింది.

'చూడు జాఫర్. నా పేరు రావ్. నీలకంఠరావ్. నేన్నీకు సెక్రటరీను కాను. బాస్‌కి సెక్రటరీని. అర్ధమయిందా? మరోమారు సెక్రటరీ అని పిలిచేవా? నీముందు పళ్లూడి నీ మొఖం మరింత వికృత మవుతుంది. నాక్కీ-నాక్కీ వక్కొక్క మాటే పలికేను.

పగలబడి నవ్వేడు.

ఆ నవ్వుకి తుళ్ళి పడ్డాను. రూం బోయ్ ఓసారి రూం లోకి ఆందోళనగా తొంగి చూసి, జాఫర్ని పలకరించి వెళ్ళిపోయేడు.

'అలాగే, అలాగే,' నవ్వుతూనే అన్నాడు.

'అయిందా నీపని. యిక వెళ్లు. నా బాస్ మాదిరిగానే చెయ్యి ఊపబోయేను.

చటుక్కున ఆ చెయ్యి పట్టుకున్నాడు.

చెయ్యి విదిలించేను.

'కొంత డబ్బు కావాలి నీలా!' అన్నాడు.

వాడు 'నీలా' అని సంబోధించగానే వళ్ళు మళ్ళీ మండింది.

'నన్నడుగు తావేం? పరమేశాన్ని అడుగు. కేక పెట్టాను.

మళ్ళీ నవ్వేడు జాఫర్. 'అలాగే నీలా ?'

లేచి వెళ్ళబోతూంటే అరచాను. 'నన్ను నీలా అని పిలవక. రావ్ అను.'

సమాధానం చెప్పలేదు.

జాఫర్ వెళ్ళిపోయినా వాడి రూపం చూసిన తరువాత

కలిగిన ఆలవరింపు నన్ను వదల్లేదు.

యింతలో కామారెడ్డి గదిలోంచి కేకలు వినిపించాయి. ఆతృతగా వెళ్ళాను.

కామారెడ్డి చెప్పిన విషయం విని నా గుండె ఆనందంతో కొట్టుకో సాగింది. నా క్కావలిసినదీ అదే.

కామారెడ్డి మీద సి. బి. ఐ. ఎంక్వైరీ వేసారు.

# 6

ఢిల్లీ వచ్చి రోజున్నర అయింది.

కామారెడ్డి తనపై వేసిన ఎంక్వైరీ తప్పించుకోవడానికి చాలా బిజీగా తిరగ సాగేడు.

వద్దన్నా జాఫర్ నా వెంట రాసాగాడు, ఢిల్లీలో నే తిరిగిన ప్రదేశాలన్నిటికీ.

కుతుబ్‌మీనార్ ఎక్కినప్పుడు నా గుండె భయంతో కొట్టుకొంది ఈ లోఫర్ నన్నక్కడ్నించి తోసేస్తాడేమో నన్న భయంతో.

నా భయాన్ని అబద్ధం చేసేడు. అసలు జాఫర్ నావైపు చూడలేదు.ఎవరో అమ్మాయిలు ఎక్కితే వాళ్ళని ఆకలిగా చూడటంలో మునిగిపోయేడు.

ఆ రాత్రి అశోక హోటల్లో భోజనం చేసిన తరువాత బాస్ అన్నాడు. 'రావ్ నువ్విక్కడే ఉండు. జాఫర్ వచ్చిన తరువాత పార్టీ ఆఫీసుకు ఫోన్ చెయ్యి.'

అలాగేనని తలూపాక బాస్ వెళ్ళిపోయాడు,

పదవుతుండగా టాక్సీలో జాఫర్ వచ్చాడు. అతనితో పాటు ఓ అమ్మాయి ఉంది టాక్సీలో.

నన్ను చూసి వెకిలిగా నవ్వాడు జాఫర్.

'బాస్ ఏమైనా చెప్పారా ?' అడిగాడు.

'క్రూరంగా అతని వైపు చూసి రిసెప్షనిస్ట్ దగ్గరకి వెళ్ళాను.

'రావ్ ! జాఫర్ అమ్మాయిని తీసుకొచ్చాడా !' అడిగాడు ఫోన్‌లో.

"ఎస్ సర్!"

"బావుందా?" అన్నాడు నవ్వుతూ.

మనసులో తిట్టుకున్నాను. నీకు నీతీజాతీ లేక పోతే నాకున్నాయ్. అనుకున్నాను.

"ఏం మాట్లాడవ్? బావుందా?"

"ఎస్ సర్!"

"రావ్! అమ్మాయిని తీసుకొని మన క్వార్టర్స్‌కి రా! జాఫర్ డబ్బేమైనా అడిగితే యిచ్చేసి వాణ్ని పొమ్మను అన్నాడు.

"ఎస్ సర్!"

"నాన్సెన్స్ రావ్! నువు ఆ ఎస్‌సర్ అనేమాట వదిలేయ్" అరిచాడు కోపంగా.

'ఎస్‌సర్' అనబోయి తమాయించుకున్నాను.

బాస్ కామారెడ్డి బాగా తాగినట్లుంది. ఫోన్ లోంచి వాసన వేయకపోయినా, అతని ముద్దమాటలు చెప్పాయి.

బాస్‌కీ నాకూ జరిగిన సంభాషణ జాఫర్‌తో చెప్పాను.

"ఓ రెండు వందలియ్యి నీలా!" అన్నాడు జాఫర్ నవ్వుతూ.

"లోఫర్! నన్ను నీలా అనద్దనలే!" కసిరాను.

రిసిప్షనిస్ట్ అయోమయంగా చూశాడు నావైపు.

"సర్లే," అన్నాడు జాఫర్.

డబ్బులు తీసుకొని వెళ్లిపోయాడు.

టాక్సీలో కూలబడ్డాను విసురుగా. టాక్సీ డ్రైవర్‌కి అడ్రస్‌చెప్పి పొమ్మన్నాను.

నేను వెళ్ళే సరికి కామారెడ్డి వెయిట్ చేస్తున్నాడు. క్వార్టర్స్‌లో. హైదరాబాద్ ఎం. పి. క్వార్టర్స్ అవి. అతను ఢిల్లీలో ఉంటాడు ఎప్పుడూ. ఖాళీగా ఉంటుంది. కామారెడ్డి లాటివాళ్ళకి ఫ్రీ క్వార్టర్స్ అవి.

బాగా తాగి ఉన్నాడు కామారెడ్డి.

ఆ అమ్మాయి, కామారెడ్డి గదిలోకి వెళ్ళి తలుపేసు కున్నారు.

కామారెడ్డి దగ్గర ఉద్యోగంలో చేరి ఆఖరికి ఆ గది ముందు వెయిట్ చేయవలసి వచ్చినందుకు విచారించేను.

ముందు హాల్లో ఓ కుర్చీలో కూలబడి ఆ వేళ్టి పేపరు ముందేసుకున్నాను.

# 7

గంట అగడిచింది.

కంటి మీదకి కునుకు వస్తోంది.

ధడాలున తెరుచుకున్నాయి బాస్ మూసిన గది తలు పులు.

"రావ్!" బాస్ అరిచేడో పిలిచాడో చెప్పడం కష్టం.

ఆందోళనగా లోపలికి వెళ్ళాను.

మసక చీకటిగా ఉంది ఆ గది. వబ్డ్యూడ్ లైట్ల వెలుతురు కొంచెంగా వస్తోంది.

కాలికేదో తగిలి బొక్క బోర్ల పడ్డాను.

'కెవ్' మని అప్రయత్నంగా కేక వేశాను.

నా చేతికి ఏదో అంటుకుంది, చిక్కగా, జిడ్డుగా....

రక్తం!

వెచ్చగా వుందా రక్తం!!

కళ్లు మిరుమిట్లు గొలుపుతూ లైట్స్ వెలిగేయి.

'చర్' మని శబ్దం చేస్తూ ఏదో వె లు గు వె లి గి ఆరింది.

నా మెదడు పని చేయటం ఆగిపోయుండాలి. నా కళ్ళు చూడటం లేక పోయుండాలి.

నా కళ్ళే కనక తిన్నగా పని చేస్తూ ఉంది ఉంటే నా ఎదుటగా ఉన్నది, శవం!

నాతో టాక్సీలో తీసుకొచ్చిన అమ్మాయి శరీరం తునా తునకలై పోయి ఉంది. మొఖం గుర్తుపట్టగలం అంతే,

మెదడు మెల్లగా పని చేయడం ప్రారంభించింది.

నా బట్టల నిండా, చేతినిండా, మొఖం నిండా రక్తం.

అ హత్య నేనే చేసినట్లు, ఆ అమ్మాయి శవం రక్తం నా మీదే చిందినట్లు, నా వంటి మీద రక్తం.

"రావ్!" బాస్ కంఠం పలికింది. యాంత్రికంగా కామారెడ్డి వైపు తిరిగేను.

"రావ్! కూర్చో కుర్చీ చూపిస్తూ అన్నాడు.

యాంత్రికంగా కూర్చున్నాను. అపుడు చూసేను బాస్ చేతిలో రివాల్వర్.

నా వైపు గురి పెట్టబడి ఉంది.

"రావ్! ఈ కాగితాలు చూడు."

నా ముందు కొన్ని కాగితాలు పడేసేడు.

మరొకసారి నాగుండెలు ఆగినంత పనైంది.

నా వ్యాసం తాలూకూ వ్రాత పతి.

కామారెడ్డిని విమర్శిస్తూ నేను వ్రాసిన వ్రాతపతి వ్యాసం.

ఎలా వచ్చేయ్?

'రావ్ ! నీ తెలివి తేటలు మెచ్చుకోవలిసిందే తప్పదు అయితే రావ్, నీకన్నా యిరవై ఏళ్ళు ముందల పుట్టాను నేను. నన్ను విమర్శించిన వాడెవడూ, నన్ను తిట్టిన వాడెవడూ బ్రతకలేదు రావ్. నా దగ్గరకి వచ్చిన కుర్రవాడి గురించి ఆ కుర్రవాడి తండ్రి ఎంత ఎమౌంట్ నాకిచ్చినదీ, నీకు తప్పించి యింకెవరికి తెలుస్తాయ్ రావ్ ! అపుడే నీ మీద నా కనుమాన మొచ్చింది.

రావ్! నన్ను విమర్శించిన వాళ్ళు కాదు, నన్ను అవహేళన చేసిన వాళ్ళు బ్రతికి బట్ట కట్టలేదు. నా మగతనాన్ని సవాలుచేస్తుందా ఈ బిచ్. అందుకే చచ్చింది.

'రావ్ ! నువ్వు నన్ను తిట్టినా నువు ఒక మేలు చేసేవు. నువు జిల్లా కార్యక్రమాల గురించి రాసిన వ్యాసం చదివి పార్టీ హైకమాండ్ నన్ను రాష్ట్రి కోశాధికారిగా చేసింది. అందుకే నీ కో అవకాశం యిస్తున్నాను.

నీకో గంట సమయం యిస్తాను. ఎలా పారిపోతావో పారిపో! ఒకగంట మాత్రమే. ఆతరువాత నేను పోలీసులకు ఫోను చేస్తాను. నువు నా క్వార్టర్స్‌లో హత్య చేసేవని నేను పోలీసులను నమ్మిస్తాను. అందుకు సాక్ష్యం .... 'చిన్నగా చిటికి వేశాడు. 'అటు వైపు చూడు,'

అటువైపు చూశాను.

జాఫర్‌!

"నిర్భయంగా నవ్వుతూ నిలబడ్డాడు. మెడలో ఫ్లాష్‌ కెమెరా!

"నీ బట్టలనిండా రక్తంతో ఉన్న ఫొటో తీసేడు జాఫర్‌. యీ ఫొటో పోలీసులకు యిస్తా రావ్‌! నీకు ఉరిశిక్ష తప్పదు. ఒకే ఒక్క గంట నీకు అవకాశం యిచ్చేను. కారు తీసుకెళతావో టాక్సీ తీసుకువెళతావో నీ యిష్టం. గంటలోపల పారిపో!

నా మెదడు ఆలోచించ సాగింది. నిజమే! నేనేమీ చేయలేను. ఏంచెప్పలేను. పారిపోతే....

"రావ్‌! పారిపో! సరిగ్గా గంటే సమయం ఉంది." అన్నాడు జాఫర్‌.

చటుక్కున బయటికి నడచాను.

# 8

ఆరేళ్ళు గడిచాయ్‌. ఢిల్లీలో ఆ సంఘటన జరిగి నేను అజ్ఞాతవాసంలోకి పారిపోయి వచ్చి ఆరేళ్లు గడిచాయ్‌. ఆ రాత్రి బయటికి వచ్చి నా కోటు అందుకున్నాను. రక్తం కనబడకుండా కోటు అడ్డం పెట్టుకొని ఢిల్లీ సెంట్రల్‌ స్టేషన్‌కి వచ్చి బయల్దేరుతున్న ట్రైన్‌ ఎక్కేను.

పూరీ నిజాముద్దీన్‌ లింక్‌ ఎక్స్‌ప్రెస్‌.

భువనేశ్వర్‌లో దిగిపోయి కోణార్క్‌ వచ్చేశాను. యీ మారు మూల కోణార్క్‌ సూర్య దేవాలయం చూడటానికి వచ్చే టూరిస్టులకు గైడ్‌గా పని చేస్తూ నా బతుకు కోసం పాట్లు పడసాగేను.

ఆ తరువాత ఏం జరిగిందో నాకు తెలియదు. పోలీసులు నా గురించి గాలిస్తున్నారో, లేదో తెలియదు.

నాకు ఒరియా రాదు. ఒరియా పేపర్ యిక్కడికి వచ్చేది. కాబట్టి ఆ కేస్ వివరాలు ఏమైందీ నాకు తెలియదు మొదట్లో.

యిప్పుడు ఒరియా వచ్చినా ఆ కేస్ వివరాలు ప్రచు రింపబడట్లేదు ఎందులోనూ.

మొదటి రెండేళ్ళూ అనుక్షణం భయంతో బ్రతికాను. నా తల్లినీ తమ్ముళ్ళని చూడాలని ఎంతగానో అనిపించేది. కాని బ్రతుకు తీపి అంత సాహసం చేయినిచ్చింది కాదు.

యిక్కడికొచ్చేక తరచు గుర్తుకు వచ్చేవారిలో ముఖ్యులు కామారెడ్డి, జాఫర్, రత్నాకర్ ।

'నా సలహా పాటించకపోతే మీరు విచారించే సంఘ టనలు ఎదురవుతయ్.'

రత్నాకర్ ఆనాడు నాతో అన్నమాటలు నా చెవుల్లో గింగుర్లెత్తసాగాయి.

అపరిచితుడే అయినా అతనిచ్చిన సలహాలు పాటించ నందుకు నిజంగా నే యీ వేళ విచారించసాగేను.

ఎలా తెలుసు రత్నాకర్ కి? అనే విషయం యిప్పటికీ నాకు సందేహంగానే ఉంది.

రత్నాకర్ హెచ్చరికను పెడచెవిన పెట్టకపోయిఉంటే

నా కింకో ఉద్యోగం దొరికి ఉండును. హాయిగా తమ్ముళ్ళతో, అమ్మతో ఉండే వాడిని. ఓ చక్కని అమ్మాయిని పెళ్ళి చేసుకొని కాపురం చేసుకుంటూ ఉండే వాడిని?.

బేడ్ లక్। జరిగిన దానికి విచారించి ప్రయోజనంలేదు.

కానీ నా ఆ గతం రోజూ నన్ను వేధించడం మాన లేదు.

ఆలోచనల్లో పడి నా ఎదురుగా ఓ కారు ఆగడం గమనించ లేదు.

మనసు గతంతో కొట్టు మిట్టాడు తున్నా కళ్ళు యాంత్రికంగా పని చేస్తున్నాయ్.

ఆ కారు డ్రైవర్ నాదగ్గరకి వచ్చాడు.

'అయ్యగారు పిలుస్తున్నారు '

ఈ లోకంలో పడి అ వైపు చూసాను. కారులో ఏదో భారీ ఆకారం కనపడింది.

'ఎవరు?' అడిగాను.

'అయ్యగారు పిలుస్తున్నారు. నిన్ను.'

బహుశా టూరిస్ట్ అయుండాలి. గైడ్ కోసం పిలుస్తూ ఉంటాడను కొని అతని వైపు వెళ్ళాను.

'వన్ మి నిట్.' అని నాతో అని డ్రైవర్ వైపు తిరిగాడు. 'రెడ్ విల్స్ సిగరెట్ పాకెట్ తీసుకురా!' వందరూపాయల నోటిచ్చాడు.

డ్రైవర్ వెళ్ళి పోయాడు. వందరూపాయల చిల్లర సంపాదించి అతను సిగరెట్స్ కొనాలంటే చాల సమ యం వృధా అవుతుంది.

'లోపలికి వచ్చి కూర్చో!' గంభీరంగా ఉంది అతని కంఠం.

కార్ ఫ్రంట్ డోర్ తీసి కూర్చున్నాను.

'ఇన్నాది వరకూ ఎక్కడో చూశాను!' అన్నాడు నా వైపు పరీక్షగా చూస్తూ.

నాగుండె మళ్ళీ ఒక్క హర్ట్ బీట్ తప్పింది.

'ఏమో! యింతకు మునుపు యిక్కడికి వస్తే చూసి ఉండవచ్చు.' అన్నాను తడబాటుగా.

లేదు. హైదరాబాద్‌లో ఎవరో ఎం. ఎల్. సి దగ్గర చూశాను.

# 9

నా కళ్ళలో భయం చోటు చేసుకుంది.

భయంగా అతని వైపు చూస్తూ ఉండిపోయేను.

ఎవరితను ?

నేను కామారెడ్డి దగ్గర పనిచేసేనని తెలుసా? కామారెడ్డి చేసిన హత్యానేరం నా మీదికి తోయబడి యిలా అజ్ఞాతవాసంలో ఉండిపోయేనని తెలుసా? నా కోసం పోలీసులు వెతుకుతున్నారని తెలుసా ?

అతనూ చాలాసేపు ఆలోచిస్తూ ఉండిపోయినట్లున్నది. చాలా సేపటి తరువాత అన్నాడు గుర్తుకు వచ్చినట్లు, 'ఎస్, కామారెడ్డి దగ్గర చూశాను నిన్ను."

ఒక్కసారి ఆ కారు దిగి పారిపోవాలనిపించేంతటి పిచ్చి ఊహ కలిగింది, కాని నా కాళ్ళు నాతో సహకరించలేదు.

" కామారెడ్డి దగ్గర పనిమానేశావా ? " అడిగాడు.

గుండెల మీంచి బరువు తగ్గిపోయినట్లు రిలీఫ్‌గా శ్వాసవదిలేను. అయితే యితనికి నేను పలాయనంలో ఉన్న సంగతి తెలియదన్నమాట.

అవునన్నట్లుగా తలూపేను.

'ఎందుకని?' ఆరాగా అడిగాడు.

'కామారెడ్డి తీసేశాడు.' ముక్తసరిగా అన్నాను.

"యిక్కడ ఎలా ఉంది నీ జీవితం?" కొద్దిసేపు ఆలోచించి అడిగాడు.

ఆలోచనలో పడ్డాను, ఏం చెప్పాలో!

'బాగులేదు కదూ!' అన్నాడతనే మళ్ళీ.

"మీరు...." సందిగ్ధంగా ఆగాను.

ఫకాలుమని నవ్వాడు.

'నిజమే! యింత వరకూ చెప్పలేదు కదూ. నా పేరు రంగనాధరావు. చిలకా లేక్ దగ్గర మా బంగళా ఉంది. అక్కడ ఫిషింగ్ వ్యాపారం చేస్తున్నాను.' అన్నాడు తనని పరిచయం చేసుకుంటూ.

మౌనంగా ఉండిపోయాను.

'కామారెడ్డి దగ్గర ఏంపనిచేసే వాడివి?'

'సెక్రటరీ' నోటిచివరవరకు వచ్చింది మాట, తమాయించుకొని అబద్ధం ఆడేను "గుమస్తా"

"ఏం చదివావ్?"

"బి. కాం.'

సాలోచనగా తలూపాడు. 'నీ పేరు?'

"రామారావ్!' అబద్దం.

"ఓ పని చేస్తావా?" అన్నాడు హఠాత్తుగా. "నాకు ఓ సెక్రటరీ కావాలి. ఫిష్ ఎక్స్‌పోర్ట్‌కీ, యితర వ్యాపకాలకీ పనులవీ చేసేవాళ్ళు. కామారెడ్డి నమ్మకమైన వాళ్ళని కానీ తీసుకోడు. మరి నిన్నెందుకు తీసేశాడో అర్థం కావటం లేదు. నిన్ను చూడగానే ఎందుకో నాకు కావలసిన వ్యక్తివి నువ్వే అనిపించావ్. అందుకు అడుగు

తున్నాను. ఆలోచించుకో."

"నాకు వ్యవధి కావాలి.' అన్నాను మెల్లగా.

"తీసుకో. బాగా ఆలోచించు. సాయంత్రం వస్తాను. పిప్పిలిలో చిన్న పనుంది.' అన్నాడు.

డ్రైవర్ వచ్చాడు. కారు దిగాను. నా కింకా అయోమయం గానే ఉంది. అతను వెళ్ళిపోయిన అరగంట వరకూ అదే స్థితిలో ఉన్నాను.

భువనేశ్వర్ నుంచి బస్ వచ్చింది. టూరిస్టుల కోసం వెళ్ళాను ఎవరో ఫారినర్స్ యిద్దరు దొరికేరు. వాళ్ళకి కోణార్క్ దేవాలయం గురించి వర్ణిస్తూ కొద్దిసేపు ఈ గొడవల నుంచి దూరంగా వెళ్ళిపోయాను.

# 10

ఆ వేళ సాయంత్రం రంగనాధరావుతో బయల్దేరి 'చిలికా' వచ్చేసేను.

ఒరిస్సాలో చెరువుల కంతటికీ పెద్దది చిలక సరస్సు. దేశంలో పెద్దది అంటారు దాన్ని. చెరువు అనే కంటే సముద్రం అంటే బాగుంటుంది. బలుగాం దగ్గర్నుంచి ప్రారంభమయిన ఆ చిలకసరస్సు దాదాపు ఓ సముద్రం అంత ఉంటుంది. బలుగాం పెద్దస్టేషన్. ఈస్ట్‌కోస్ట్ ఎక్స్‌ప్రెస్ ఆగుతుంది బలుగాంలో. బలుగాం నుంచి చిలికాకి అరగంట ప్రయాణం,

వెన్నెల్లో చిలకసరస్సు అందం చూడాలి తప్పకుండా. వెండిపూత పూసుకున్నట్లు మెరిసిపోతుంటుంది.

చిలకసరస్సుకు దగ్గరగా ఉంది రంగనాధరావుబంగళా.

చాలా పెద్దబంగళా అది. ఆ బంగళాలో ఉండేది యిద్దరే. రంగనాథరావ్, రంగనాథరావ్ అన్నభార్య సుమతి.

సుమతి రోగగ్రస్తురాలు. పెరాలిసిస్‌తో మంచం మీద పడిపోయింది. నోటిమాట కూడా పడిపోయింది. ఆమెకు ఆమెని సంరక్షించేందుకు ఓ నర్సు, ఆ బంగళా లోనే యింకో గదిలో ఉంటుంది.

సుమతి భర్త చిలక సరస్సులో మునిగి చనిపోయేడుట. ఈతరాని అతను బోటుమీద చేపలుపట్టేందుకు వెళ్తూంటే ఆ బోట్ తిరగబడి చనిపోయాడు.

సుమతి కూతురు వాసవి హైదరాబాద్ ఉమన్స్ కాలేజీలో. బి. ఎ. చదువుతూంది. సెలవులకు యిక్కడికి వస్తుందట.

సుమతిని పరీక్షించడానికి వారానికోసారి డాక్టర్ వస్తాడు బరంపూర్ నుంచి.

అతిత్వరలోనే ఆవాతావరణానికి ఎడ్జస్ట్ అయిపోయాను

రెండు కారణాలను దృష్టిలో వుంచుకొని రంగనాథరావ్‌తో వచ్చేసాను.

ఒకటి కోణార్క్‌లో నాకు అంతగా జరగటంలేదు. ఎపుడో కాని టూరిస్టులు నన్ను గైడ్‌గా తీసుకోరు. నాకు డబ్బుచాలక చాలా కష్టం అవుతోంది అక్కడ.

రెండవది రంగనాథరావ్ రాకవల్ల హఠాత్తుగా నాకు స్ఫురించిన విషయం—నేనక్కడె ఉంటే రంగనాథరావ్ లానే ఎవరైనా నన్నుగుర్తించే అవకాశం ఉంది. నిత్యం దేశం నలుమూలల నుండీ కోణార్క్ ఎవరో ఒకరు వస్తూనే వుంటారు. ఏవరైనా గుర్తించి పోలీసులకు

నా ఉనికి తెలిపితే నా జీవితం అంతమైనట్లే. చిలికాకి ఎవరైనా వచ్చే అవకాశం తక్కువ. అదీకాక రంగ నాధరావ్ నాకు రక్షణ ఇవ్వచ్చు.

"నా ఉనికి, నేను యిక్కడ ఉన్నట్లు కామారెడ్డికి తెలియనివ్వకూడదు." షరతు పెట్టాను, ఆ సాయంత్రం అతను రాగానే.

చిన్నగా నవ్వేడు. "అలాగే. కానీ ఎందుకో...."

"ఎందుకంటే...." తడబడ్డాను. "కొన్నిటికి ప్రత్యేక మైన కారణాలు చెప్పలేం.'

"సరె! సరె! నీకభ్యంతరం అయితే నేను చెప్పను." అన్నాడు. 'నీ సామానేది?'

చేతిలో ఉన్న ఏర్ బాగ్ చూపెట్టాను.

ఆశ్చర్యంతో కనుబొమలెత్తాడు. చిన్నగా నవ్వాను.

ఆ రాత్రి 'చిలికా' వచ్చేసాం.

రంగనాధరావ్ ఫిషింగ్ వ్యాపారం పెద్దదేనని వెంటనే తెలిసి పోయింది. బిజీ అయిపోయేను త్వర లోనే. నా పని రంగనాధరావ్‌కి నచ్చింది. ఆ విషయం అతని మాటల్లోనే తెలిసింది.

నాకు సంతృప్తిగా రోజులు గడిచిపోసాగేయి. ఉద యాన్నే జాలరులు వస్తారు. వాళ్ళకి బోట్లు, వలలు యిచ్చి పంపడం. మళ్ళీ సాయంత్రం వాళ్లు రాగానే లెక్క ప్రకారం తీసుకొని డబ్బులు యిచ్చి పంపేయడం. ఆ తరువాత రంగనాధరావ్‌కి ఉన్న రెండు పరిశ్రమల తాలూకు ఎకౌంట్ చూడటం.

సాయంత్రం విసుగుపడితే అలా బోట్ వేసుకొని చిలకసరస్‌లో విహారం చేయడం.

యిక్కడికి వచ్చిన తరువాత తీరికఎక్కువ అయింది. ఈ ప్రశాంత వాతావరణంలో యింకో అందమైన ఊహ నాకు వస్తోంది ఈ మధ్య తరచుగా. బహుశా జీవితం స్థిరమై పోయిందనే నమ్మకం కలిగించని కాబోలు.

యింత అందమైన చోటులో నా జీవితాన్ని పంచు కొని, యిక్కడ నాకు తోడుగా మరొకరు ఉంటే ఎంత అందంగా గడపొచ్చు జీవితం.

ఈ ఊహ జీవితానికి కొత్త ఉల్లాసాన్ని యిచ్చింది.

# 11

నర్స్ పరుగెత్తుకుంటూ వచ్చి చెప్పింది 'అమ్మాయి గారు వస్తున్నారు!'

నాకు ముందు అర్థంకాలేదు, 'ఎవరు?' అడిగాను.

'అమ్మాయిగారు! వాసవమ్మగారు. కాలేజీకి సెలవు లిచ్చారట రెండ్రోజుల్లో వస్తానని ఉత్తరం రాసేరట అయ్యగారికి' ఆనందంగా చెప్పింది.

అలాగా అన్నట్లు తలపంకించేను,

"యింక యీ బంగళా యింత నిశ్శబ్దంగా ఉండదు. కలకలలూ కిలకిలలూతో నిండిపోతుంది. నీకు తెలీదు కాని రావ్, వాసవమ్మ ఎంత కలివిడి మనిషో" ఏదో వల్లించుకుంటూ వెళ్ళిపోయింది.

సుమతిని చూస్తే ఎవరైనా అనుకుంటారు. యీమెకి పుట్టిన బిడ్డ ఎంత అందంగా ఉంటుందో అని.

మరి కొద్ది సేపటికే రంగనాథరావు పిలిచేడు నన్ను.

'అమ్మాయి వాసవి వస్తోంది రావు! నువు రిసీవ్ చేసు

కోవాలి. బలుగాం వెళ్ళు. యీస్టకోస్టలో దిగుతుంది. యీస్టకోస్ట అక్కడికి నాలుగ్గంటలకివస్తుంది. అమ్మాయిని రిసీవ్ చేసుకొని బస్‌లో వచ్చేయ్యండి. కారు యిద్దును కానీ కటక్‌లో రేస్ ఉంది. నేను వెళ్ళాలి'

మౌనంగా తలూపాను.

'రావు! నీకు యిపుడు కొంచెం చెప్పాలి.' మళ్ళి ఎందుకో సందేహంగా ఆగాడు. "తరువాత చెప్తానులే రావు. బుధవారం వస్తోంది వాసవి. రేపు రాత్రి యీస్ట కోస్టకి అన్నమాట. వెళ్తావు కదా!" అన్నాడు.

అతను చెప్పబోయి మానేసినదేమిటో నాకు అర్థం కాలేదు.

ఆతరువాత యిద్దరం వ్యాపారపుగొడవల్లోపడిపోయేం.

# 12

మంగళవారంనాడు రాత్రి తొమ్మిది గంటలకి భోజనం చేసి బయల్దేరాను. బరంపూర్ నుంచి ఖుర్దారోడ్ వెళ్ళే ఆఖరి బస్‌లో

బలుగాంలో దిగి అక్కడ ఉన్న టూరింగ్ టాకీస్‌లో ఓ థర్డ్‌గ్రేడ్ ఒరియా సినిమా చూసి స్టేషన్‌కి వెళ్ళాను.

ప్లాట్‌ఫాం మీద పడుకొని మళ్ళి ఆలోచనలలో పడ్డాను.

నా గతంలో, యిప్పుడు యిలా ఓ ప్లాట్‌ఫాం మీద పడుకొని ఓ అమ్మాయి కోసం నిరీక్షిస్తానని కలలో కూడా ఊహించలేదు.

మళ్ళి గుర్తుకు వచ్చాడు రత్నాకర్.

"నా సలహాని పాటించకపోతే విచారించే సంఘటనలు

ఎదురవుతాయ్."

చిన్నగా నవ్వుకున్నాను. ఒకటీ రెండు సంఘటనలు ఎదురయినా వాటిని అధిగమించేను. యిక్కడ యిలా ప్రశాంతంగా నా జీవితం గడిచిపోతే చాలు. అదే పది వేలు అనుకున్నాను.

నాలుగు గంటలకు రావలసిన ఈస్ట్‌కోస్టు గంట లేట్‌గా వచ్చింది.

ఫస్టుక్లాసులోంచి దిగిన వాసవిని సుళువుగానే గుర్తు పట్టాను.

"మీ పేరేనా వాసవి!"

వింతగా చూసింది వాసవి నావైపు. 'నిజమే! కానీ....' సందేహంగా ఆగిపోయింది.

'నా పేరు రామారావ్! మీ బాబాయి దగ్గర సెక్రటరీగా చేశాను' అన్నాను.

'మై గుడ్ నెస్! మీరేనా! బాబాయ్ వ్రాసేడు కొంచెం జ్ఞాపకశక్తి తక్కువ' నవ్వేసింది.

నేనూ నవ్వాను.

ఆమె అందంగా ఉంటుందని ఊహించడమే కానీ యింత పరకూ ఆమెని చూడలేదు.

ఆమె అందం అసాధారణం.

ఆమె లగేజ్ అంతా బయటికి తీసుకు వెళ్ళాను.

ఏవేవో కబుర్లు అలా చెప్తానే ఉంది. నేను యింత చిన్నవాడ్నిగా ఉంటానని ఆమె అనుకోలేదట. నారిక ఆశ్చర్యపరచిందిక. ఆమెబాబాయ్ గురించి, నర్సు గురించి ఆమె తల్లి గురించి సవాలక్ష ప్రశ్నలు వేసింది.

చనువుగా ఏమేమో అంది.

బస్ కోసం వెయిట్ చేస్తూ నిలబడ్డాం

హఠాత్తుగా అంది 'ఏడు మైళ్ళేగా రిక్షాలో వెళ్ళి పోదాం. ఎవరైనా చూశండి'

'కానీ బస్ యింకో అరగంటలో వచ్చేస్తుంది కదా!' అన్నాను.

'నిజమే; కానీ యింత దూరం ప్రయాణం చేసింది. ఒక ఎత్తు. యిక్కడ్నించి అమ్మని చూడబోతున్నాననే ఆతృతతో వెయిట్ చేయటం ఒక ఎత్తు. యింత దగ్గరకూ వచ్చేక దూరం అంటే విసుగువేస్తుంది. 'ఆమె కంఠం హఠాత్తుగా భారంగా పలికింది.' అమ్మని చూడాలని నే నెంతగా తపన పడుతున్నానో మీ కెలా తెలుస్తుంది.'

తుళ్ళి పడ్డాను.

అమ్మని చూడ్డానికి ఆమె కెంత తపన ఉందో కానీ నే నెంత చిత్రవధని అనుభవిస్తున్నానో ఆమె కెలా తెలుస్తుంది. హఠాత్తుగా మనసంతా భారంగా అయిపోయింది.

ఎక్కడ ఉన్నారో అమ్మా తమ్ముళ్ళు? అసలు ఉన్నారో, లేరో!

యాంత్రికంగా రిక్షాలు తెచ్చాను. ఒక రిక్షాలో ఆమె రెండవ రిక్షాలో సామానులు నేనూ.

ఒక్కసారి వాతావరణం గంభీరంగా మారిపోయింది.

యిన్నాళ్ళూ నా జీవితం గురించి నేను తలచానే కానీ అమ్మా తమ్ముళ్లు ఎంత కష్టాలు పడుతున్నారో ఊహించేయత్నం చెయ్యలేదు.

రెండు గంటల తరువాత యిల్లు చేరేం.

వాసవి ఆనందంగా సుమతిని పలకరించేందుకు వెళ్ళి పోయింది.

# 13

మర్నాడు డాక్టర్ వచ్చాడు.

వాసవి ఆయన్ని ఆనందగా పలకరించిది 'హలో అంకుల్'

'అరే వాసవి! ఆయన వాసవిని చూసి ఆర్చర్య పోయాడు. 'నాకు తెలియలేదే నువు వస్తున్నట్లు.'

'అదేం! బాబాయ్ చెప్పలేదా!'

'ఏమి జరిగింది మిస్టర్ రావ్?' నన్నడిగారు.

'వాసవిగారు రాసిన లెటర్ సోమవారం వచ్చింది సార్! మంగళవారం రాత్రి ఈస్టుకోస్టులో యీావిడ వచ్చేరు. మీకు తెలియచేసే అవకాశం లేకపోయిందను కుంటా!'

'సరె! సరె! వాసవి వైపు తిరిగి అన్నాడతను. 'గుడ్ థింగ్ యూ హేవ్ కమ్. పద అమ్మని చూద్దాం.

యిద్దరూ సుమతి గదిలోకి వెళ్ళారు.

గంటసేపు ఫైళ్ళలో మునిగి పోయిన నన్ను డాక్టర్ పలకరించాడు.

"మిస్టర్ రావ్! యిలా వస్తారా!"

ఆశ్చర్యపోతూ వెళ్ళాను. నన్నిదివరకు చూసినా ఆ డాక్టరు నాతో మాట్లాడలేదు యింతవరకూ. ఎప్పుడో మందులు అవసరమైనప్పుడు మాట్లాడేవాడు.

"చూడు మిస్టర్ రావ్! ఒక విషయం చెప్పాలి మీకు. యిన్నాళ్ళు మిమ్మల్ని అనుమానించేను నేను." ఆగాడు.

"నన్నా? ఎందుకు?" నా గుండె వేగంగా కొట్టుకో

సాగింది.

నా మొఖంలో భయంచూసి చిన్నగా నవ్వి నాభుజం తట్టేడు అనునయంగా.

"డోంట్ వర్రీ, అలా నడుస్తూ మాట్లాడుకుందాం,"

యిద్దర నడవసాగాం. నాకు అతను ఏవిషయంమీద మాట్లాడ దలచుకున్నాడో అర్థంకాలేదు. అంతుపట్టలేదు.

"రావ్। రంగనాధరావ్ అన్నయ్య గురించి నీకేం తెలుసు?" హఠాత్తుగా అడిగాడు.

"ఏంతెలియదు. ఆయన చిలకసరసులో మునిగిపోయి చని పోయినాడని తప్పించి."

విషాదంగా నవ్వేడు డాక్టర్.

నిజానికి రావ్। రామ్మూర్తి అదే రంగనాధ రావ్ అన్న అకస్మాత్తుగా ప్రమాదవశాత్తు మరణించలేదు. హి వాజ్ కిల్డ్.

ఆశ్చర్య పోయాను.

హత్య చేయబడ్డాడా?

నా ఆశ్చర్యాన్ని గమనించలేదు అతను. "అవును రావ్। రామూర్తి నేను క్లాస్ మేట్స్ యింటర్ వరకూ. నేను మెడిసిన్ కి వెళ్ళిపోయాను. రామూర్తి యిక్కడ ఫిషింగ్ వ్యాపారం ప్రారంభించేడు, అచిరకాలంలోనే రామం బాగా ధనవంతుడై పోయాడు. నన్ను మర్చి పోలేదు ఎంత డబ్బుగలవాడైనా,

నేను మెడిసిన్ కోర్స్ పూర్తిచేసి బరంపూర్ లో ప్రాక్టీస్ పెట్టిన మొదట్లో సుమతికి కరెంట్ షాక్ కొట్టి పెరాలిసిస్ ఎటాక్ అయింది. అప్పట్నుంచి నేనే ఆమెకి వైద్యం చేయసాగేను. ఆమెకి కరెంట్ షాక్

ప్రమాదవశాత్తూ తగల్లేదు అనేవాడు రామం. ప్రమాదం అయితే ఆమె కూర్చున్న కుర్చీకి తగిలేటట్లే వైర్స్ ఎందుకు ఏరేంజ్ చేసి ఉన్నాయ్ అనేవాడు. కానీ తన అనుమానం బయట పెట్టలేదు ఎప్పుడూ. అప్పటికి వాసవి ఆరేళ్ళపిల్ల.

రామానికి ఫిషింగ్ అంటే సరదా। అయితే అతనికి పెద్దగా యీతరాదు. బోట్ మీద యిద్దరు యీత వచ్చిన జాలరులు లేందే చిలకా మీదికి వెళ్ళేవాడుకాదు. రంగ నాథరావు ఆవేళ ఊర్లో లేడు. రామం యిద్దరు జాలరులు ఫిషింగ్‌కి వెళ్ళారు. చిలకామీదికి. నాకు నీళ్ళంటే భయం. ఆవేళ నేను యిక్కడే ఉన్నాను.

రెండు గంటల తరువాత రామం శవంతో ఏడుస్తూ వచ్చేరు ఆ జాలరులు. ప్రమాదవశాత్తు పడిపోయేడని ఎంత వెదికినా దొరకలేదని దొరికే సమయానికి చని పోయాడని.

సుమతికి ఆ షాక్‌తో మాటపడిపోయింది. అసలు బ్రతుకుతుందనుకోలేదు. బ్రతికింది. అయితే ఆమె గుండె యిప్పుడు అతి బలహీనం. మరో షాక్ తగిలితే తట్టుకోలేదు.

"కానీ రావు। నా అనుమానం ఆ జాలరులు ఎవరి ప్రేరణతోటో రామాన్ని హత్య చేశారు. రామం చొక్కా చిరిగిపోయింది. ప్రమాదవశాత్తు పడిపోతే చొక్కా చిరగవలసిన అవసరం ఏమిటి? అసలు పడిన వెంటనే దొరకపోవడానికి యిది చెరువుకానీ నదికాదుగా. ప్రవాహం ఉండదు చెరువులో. అందుకే చెరువులో పడ్డవాళ్ళని రక్షించడం తేలిక. ఎన్నో అనుమానాలు రావ్. పోలీ

సులకు చెప్పాను. ఏం జరిగిందో నాకు తెలియదు. కానీ ఆ కేసు మూతబడిపోయింది. చావు ఏక్సిడెంటల్ అని,

కళ్ళజోడు తుడుచుకుంటూ ఆగేడు, అతను. ఎదురుగా చిలక సరస్సు. అతను చెప్పింది నిజమే అన్నట్లు గంభీరంగా ఉంది.

నాకు మతిపోసాగింది.

ఎందుకీ వివరాలన్నీ నాకు యిపుడు చెప్తున్నట్టు?

"రావు! వాసవికి యింక రెండు నెలల్లో మైనారిటీ తీరిపోతుంది.

ఈ ఆస్తి కంతకూ ఆమె హక్కుదారవుతుంది. అందుకే రావు! నీకీ కథంతా చెప్పింది. యివాల్టి నుంచి వాసవిని నువో కంట జాగ్రత్తగా కనిపెట్టాలి. వాసవి మీద హత్యా ప్రయత్నం జరగవచ్చు. యిదినా అనుమానం కావచ్చు. కానీ మనం మన జాగ్రత్తలో ఉండాలి. యిన్నాళ్ళూ నీ ప్రవర్తన గమనించిన నర్సు నీమీద మంచి అభిప్రాయం వెలిబుచ్చింది. వాసవి నువు మంచి వాడివని చెప్పింది. అందుకు యిన్నాళ్ళు ఆగి చెప్పాను" అన్నాడు డాక్టర్.

మౌనంగా తలూపాను.

'నాకు చాలా ఆనందంగా ఉంది రావు! యిక నేను నిశ్చింతగా ఉండవచ్చు.' ఆనందంతో అన్నాడు డాక్టర్.

ఆ పూట అక్కడే భోంచేసి వెళ్ళాడు డాక్టర్.

# 14

రంగనాధరావు వచ్చాడు ఊరి నుంచి.

రెండు రోజులు అనుకున్న రంగనాధరావు వారం

రోజుల తరువాత వచ్చాడు.

వాసవి ఆనందంగా పలకరించింది ఆనందరావుని.

డాక్టర్ మాటల ప్రకారం రంగనాధరావు వాసవి ఆత్మీయంగా ఉండరని నేనూహించాను. కానీ నా అంచనా తప్పు. వాళ్ళిద్దరిని ఆ క్షణంలో చూస్తే ఏ పినతండ్రీ తన అన్న కూతురితో అంత ఆత్మీయంగా ఉండదని పించింది.

వాసవిని మరీ మరీ తన కాలేజీ కబుర్లు అడిగి విన్నాడు రంగనాధరావు. వాసవి ఆరోగ్యం గురించి ఆత్రుతగా వాకబు చేశాడు. సుమతికి ఏం ఫరవాలేదని బాగు అయిపోతుందనీ ధైర్యం చెప్పాడు.

వాసవిని పంపి తన గదిలోకి నన్ను పిలిచేడు.

'కూర్చో రావు! ఎలా ఉంది బిజినెస్!!' అడిగాడు.

కాస్సేపు యిద్దరంబిజినెస్‌విషయాలుచర్చించుకున్నాం.

'ఈ ఫైలు చూడు రావు!' అంటూ ఓ ఫైల్ పడే శాడు నా ముందు.

యథాలాపంగా విప్పిచూసి తుళ్ళిపడ్డాను.

నా ఫొటో!

ఢిల్లీ లో కామారెడ్డి హత్యచేసిన తరువాత ఆ అమ్మాయి శవం మీద నేను పడినపుడు, నా వంటి నిండా రక్తం అంటుకొంది. ఆ రక్తంతో జాఫర్ నన్ను తీసిన ఫొటో

నా మొఖంలో రక్తం అంత కిందికి దిగిపోతున్నట్లు ఫీలయాను. నన్ను హాఠాత్తుగా ఉరి తీసేస్తారని ఎవరైనా చెప్తే ఎలా ఉంటుందో అలా ఫీలయాను.

'నీకు వివరంగా చెప్పాలి రావ్, విను, జాగ్రత్తగా విను. చాలాకాలం క్రితం నుండి నాకు కామారెడ్డి తెలుసు.

ఓసారి భువనేశ్వర్ రాజ్ మహల్ హోటల్లో మర్డర్ చేసిన కామారెడ్డిని అతి కష్టం మీద కేసు నుంచి తప్పించేను. అప్పట్నించి కామారెడ్డి నాకు ఆప్తుడయిపోయాడు.

'కామారెడ్డి బలహీనత నాకు తెలుసు. కామారెడ్డి ఇంటర్‌కోర్స్‌కి పనికి రాడు. అయినా అతనికి అమ్మాయిలంటే బలహీనత. అతన్ని ఎవరైనా హేళన చేస్తే, అందులోనూ అతని చేతకాని తనాన్ని వెక్కిరిస్తే సహించ లేడు. చంపేస్తాడు. అయితే తెలివైన వాడు కనక ప్రతీసారి ఎవరి మీదో ఆ నేరం నెడతాడు.

'ఢిల్లీలో ఆ కేస్ జరిగినపుడు ఆ పార్టీ మీటింగ్‌కి నేనూ హాజరయ్యాను. అంతకు ముందు హైదరాబాద్‌లో కామారెడ్డిని కలిసినపుడు నిన్ను చూశాను. ఢిల్లీ నుంచి నువు పారిపోయాక పోలీస్ రిపోర్టిచ్చాడు కామారెడ్డి. నీ కోసం వేట సాగుతున్నపుడు నేను యథాలాపంగా అడిగాను. ఒకసారి నిన్నెలా ఇరికించాడో చెప్పమని, నీ కథ అంతా చెప్పాడు. ఫోటో కావాలని తీసుకున్నాను.

'నువు కలుస్తావని నేను అనుకోలేదు. ఓసారి కోణార్క్ వచ్చినప్పుడు చూశాను. నువు కాదేమోననే అనుమానం వచ్చింది. విచారించేను నీ గురించి. నువే అని నిశ్చయించుకున్నాక నిన్ను తీసుకువచ్చాను. నువు రాను అని మొండికేస్తే అపుడే ఈ ఫొటో చూపించి నిన్ను బెదిరించ వచ్చనుకున్నాను. కానీ నీ కారణాలు నీకున్నాయ్. నువు వచ్చేశావ్.' చుట్ట వెలిగించు కుందికి ఆగాడు రంగనాథరావ్.

నాకేం తోచడం లేదు. అంతా అయోమయంగా ఉంది.

'చూడురావ్! వాసవి రెండు నెలల్లో మేజర్ అయి

పోతుంది. వాసవి నామీద చూపుతున్న అప్యాయంతంతా ఒట్టి నటనేనని నాకు తెలుసు. మేజర్ అవగానే ఆస్తి కోసం కోర్టుకైనా వెళుతుంది వాసవి. యీ ఆస్తిని యింత పెంచింది నేను. యీ నా కష్టార్జితం యిపుడు వాసవికి వెళ్ళిపోవడం నా కిష్టంలేదు. అందుకని...." నావైపు చూస్తూ తాపీగా అన్నాడు. "వాసవిని నువు చంపేయాలి."

నాగుండె మళ్ళీ ఒక్క హర్ట్ బీట్‌ని తప్పేసింది. ఆక్షణంలో నాగుండె కొట్టుకోవడం ఆగిపోతే బాగుండు ననిపించింది.

'రావ్। ఏమిటో ఆలోచిస్తున్నావ్' అడిగాడు.

అప్రయత్నంగా ఏమీ లేదన్నట్లు తలూపాను.

'యూ మస్టు కిల్ వాసవి. లేకపోతే యీ ఫోటో నీ చరిత్ర నీ ఉనికీ అంతా పోలీసులకు చెప్తాను. చట్టం తననుంచి నేరస్థులను ఎక్కువ కాలం పారిపోతే సహించదు. నీకు పెద్దశిక్ష పడుతుంది అదిఖాయం. లేదా వాసవిని చంపేస్తే ఆ షాక్‌తో సుమతి గుండే ఆగిపోతుంది. ఆమెకి మరో షాక్ తగిలితే మరి బ్రతకదు. అది నాకు తెలుసు.

'వాసవని చంపేస్తే నీకు లక్షరూపాయలు ప్రతిఫలం యిస్తాను. ఫేక్ పాస్‌పోర్ట్ యిస్తాను. పాండీవ్ నుంచి నువు సింగపూర్ వెళ్లిపోయే ఏర్పాటు చేస్తాను. సింగపూర్‌లో నువు ఉంటే నిన్నెవరూ అరెస్ట్‌చెయ్యలేరు, రావ్। అంతేకాదు సింగపూర్‌లో ఓ పిషింగ్ కార్పొరేషనులో ఉద్యోగం కూడా యిప్పించగలను. ఆలోచించు. రెండేమార్గాలు, ఒకటి పోలీసులకి దొరికిపోయి శిక్ష అనుభవించడం. రెండవది హాయిగా సింగపూర్‌లో

స్వేచ్ఛని అనుభవించడం.' ఆ పాడు రంగనాధరావ్.
" ఏమంటావ్? "

"ఆలోచించాలి!" నూతిలోనుంచి వచ్చినట్లుగా మెల్లగా వచ్చాయి నా మాటలు. నా గొంతు నాకే విచిత్రంగా ధ్వనించింది.

'ఆలోచించు రావ్! నీ నిర్ణయం చెపితే నేను నీకు ప్లాన్ చెపుతాను.' అన్నాడు ఫైలు తీసుకుంటూ.

యాంత్రికంగా బయటకి నడిచాను.

# 15

రెండున్నర గంటల నుంచి ఆలోచిస్తున్నాను. నా ఆలోచనలు తెగటంలేదు.

అతి విచిత్రమైన విషయం ఏమిటంటే నా ఈ జీవితం యిలా మలుపు తిరగడానికి యిద్దరు అపరిచితులు కారణం.

ఒకటి రత్నాకర్.

ఆవేళ రత్నాకర్ చెప్పిన సలహా విని నేను ఉద్యోగంలో చేరకపోయుంటే నాకీ అవస్థలు ఉండేవికావు.

'నా సలహా పాటించనందుకు విచారించే సంఘటనలు ఎదురవుతాయ్.'

రత్నాకర్ మాటలు మళ్ళీ యివేళ పదేపదే గుర్తుకురాసాగాయి.

రెండవ అపరిచితుడు రంగనాధరావ్.

కోణార్క్‌లో అతను నన్ను కలిసినపుడు అతనెవరో నాకు తెలీదు. యితనిరో వస్తే జీవితం మరింతకుదుట

పడుతుందను కున్నాను. కానీ ఊబిలోకి దిగిపోయాను.

ఏం చెయ్యడం?

వాసవిని హత్యచేయాలంటే మనసు వప్పుకోవటం లేదు. చెయ్యని హత్యా నేరాన్ని నెత్తిమీద వేసుకొని పలాయనంలో ఉన్నాను. యిప్పుడు నిజంగా హత్య చేయాలా?

ఏంచేయాలి?

వాసవిని జాగ్రత్తగా కనిపెట్టమని డాక్టర్ నాకు బాధ్యత అత్యంత విశ్వాసంతో అప్పజెప్పేడు. ఆవిశ్వాసాన్ని నేనే వమ్ముచేయాలా? సింగపూర్ వెళ్ళి? సింగపూర్ వెళ్ళి యిదే దొంగబ్రతుకు బ్రతకాలా?

"రావు" ప్రక్కనించి పిలుపు వినిపించింది.

రంగనాధరావు!

"రావు ఏమిటి నిశ్చయించుకున్నావు!" అడిగాడు.

"హత్య!" నీరసంగా పలికాను.

"వెరీ గుడ్ రావు! తెలివంటే నీది" ఆనందంగా అన్నాడు రంగనాథరావు. "యిప్పుడు చెప్తాను విను రావు. రేపు డాక్టర్ వస్తాడు. సుమతిని చెక్ చేసి వెళ్ళిపోతాడు. డాక్టర్ వెళ్ళిపోయాక నర్స్‌కు టెలిగ్రాం వస్తుంది నర్స్ తమ్ముడు భువనేశ్వర్‌లో ఉన్నాడులే. అతనికి ఏక్సిడెంట్ అయినట్లు, నర్స్ వెళ్ళిపోతుంది. నేను చిలికా ఊర్లోకి వెళ్ళిపోతాను.

వాసవిని నువు ఎలా తుదముట్టిస్తావో నీ యిష్టం రావు! మళ్ళీ ఎనిమిదికి నేను వస్తాను. అప్పటికి మన పని సవ్యంగా సాగిపోతే నిన్ను వెంటనే పంపుతాను.

మర్నాడు మధ్యాహ్నం వరకూ పోలీస్ రిపోర్టివ్వను రావు! ఆ పాటికి నువ్వు చాలా దూరం వెళ్ళిపోవచ్చు. చిలికాలో ఏదో పనుండి నేను వెళ్ళిపోయేనని చెప్తాను పోలీసులకు. రావు! రేపు రాత్రి నీకు పాస్‌పోర్ట్ డబ్బు అందజేస్తాను."

"అలాగే" అని తలూపాను.

"విష్ యూ గుడ్ లక్ రావు!" అనేసి హడావుడిగా వెళ్ళిపోయాడు.

చాలా పటిష్ఠమైన పథకం : నన్ను ఈ కత్తుల బోను లోకి యిరికించేందుకు.

నో!

ఎలా తప్పుకోవాలి ఈ విషవలయం నుంచి.

తాపీగా నా మనసులో ఓ పథకం రూపొందసాగింది.

యీ వేళ రాత్రి రంగనాధరావు గదిలోకి వెళ్ళి నా ఫొటోని దొంగలించేసి పారిపోవాలి. వాసవికి వివరంగా ఓ వుత్తరం రాస్తాను. ఆమె నన్నర్థంచేసుకుంటుంది. వాసవిని నాచేతులతో నేను చంపేకంటే పారిపోవటమే మంచిది.

ఈ రాత్రే రంగనాధరావ్ గదినుండి ఫోటో కొట్టే యాలి. ఆ తరువాత పారిపోవాలి. మళ్ళీ యికెవరినో పట్టుకొని రంగనాధరావు ఈ దారుణకృత్యం చేయకుండా డాక్టర్‌కి ఈ విషయం వివరంగా తెలపాలి.

చేయని హత్య నా మీద మోపబడి హంతకుడ్ని అయాను. హత్యచేసి నిజంగా హంతకుడ్ని కాలేను....

రాత్రి పదకొండు గంటలవుతుండగా లేచాను. తాపీగా ఒక్కొక్క గదినే దాటుకుంటూ రంగనాధరావు గదివైపు

వెళ్ళసాగాను..

సుమతి గదిలోంచి లైట్ వెలుగుతూ కనపడింది. నర్స్ యింకా సుమతి గదిలో ఏంచేస్తోంది? అనుమానం మొలకెత్తింది.

తాపీగా సుమతి గదివైపు వెళ్ళాను.

లోపల్నుంచి మగగొంతు విన్పించసాగింది.

రంగనాధరావు గొంతు అది. ముద్దగా వస్తున్నాయ్ మాటలు.

కిటికీ పక్కచేరి మాటలు వినసాగేను. సుమతితో అంటున్నట్లుంది.

"నీకీవిషయం ముందుగా తెలుపకూడదనుకున్నాను. కానీ తప్పదు. నీమీద జాలివేసి చెప్తున్నాను. నీ ముద్దుల కూతురు వాసవి హత్య చేయబడుతూంది. రేపురాత్రి ఈ పాటికి నీ ముద్దుల కూతురు శవం నీముందు కూర్చుంటుంది. ఆ షాక్‌తో నువు గుండె ఆగి చస్తావ్!

"నీకు అనుమానం రావచ్చు హత్య చేసి నేను తప్పించుకోగలనా అని? నేనా హత్యచేయను. రావు చేస్తాడు. రావు యింతకుముందే హంతకుడు. ఒకవేళ రావు ఈ హత్య చేయకుండా పారిపోదామని చూసినా అతని ఫోటోలు నేనే రేపు పోలీస్‌కి యిస్తాను. రావు తప్పించుకోలేడు. ఈ హత్య చేసి తీరుతాడు. ఈ ఆస్తి నేనే అనుభవిస్తాను" నవ్వాడు.

కొంచెం కిటికీలోకి వంగి చూశాను. సుమతి కళ్ళు పెద్దవి చేసుకొని రంగనాధరావ్ వైపు చూడసాగింది. భయంతో.

రంగనాధరావ్ ఆమెకి గుడ్ బై చెప్పి బయటికి

రావడం గమనించి, విశ్శబ్దంగా ప్రక్కకి తప్పుకున్నాను.
రంగనాధరావ్ నన్ను గమనించలేదు. వెళ్ళిపోయాడు.
నా ప్లాన్ అప్‌సెట్ అయింది.

# 16

సాయంత్రం సమీపిస్తున్న కొద్దీ నాగుండెలు వేగంగా కొట్టుకో సాగాయి.

ఉదయం డాక్టర్ వచ్చి సుమతిని చూసి పరీక్ష చేసి హడావుడిగా వెళ్ళిపోయాడు మళ్ళీ బరంపూర్.

డాక్టర్ వెళ్ళి పోయిన తరువాత నాకు హఠాత్తుగా స్ఫురించిందా ఆలోచన.

రంగనాధరావునే చంపేస్తే....

అవును ! రంగనాధరావును హత్యచేస్తే ఈ గొడవేదీ ఉండదు. నే నిక్కడ ఉన్నట్లు రంగనాధరావుకే తెలుసు. రంగనాథరావు హత్య చేయబడితే నా ఉనికి పోలీసులకు తెలియదు. వాసవి ఆస్తిని దోచేందుకు యింకే రాహువూ ఉండదు.

అయితే ఎలా చంపాలి ?

రంగనాధరావు రేపు చిలికా నుంచి ఎనిమిది గంటలకి వస్తానన్నాడు. రేపు ప్రక్కనుంచే రావాలి. ఏ తెడ్డుతో నెత్తిమీద కొట్టినా ఆరిగిపోతుంది. నాఆధారాలు లేకుండా చూసుకోవాలి. వాసవీ నేనూ ఎక్కడికో వెళ్ళినట్లు ఎలిబి సృష్టించుకుంటే చాలు.

ఆ సమయంలో ఎవరూ ఉండరు రేపు దగ్గర. హత్య చేసేసి ఆ శవాన్ని చెరువులో పడేస్తే....?

చాలాసార్లు తరచి తరచి ఆలోచించేను ఈ ఆలోచన మీద.

ఎక్కడా పొరపాట్లు నాకు తట్టలేదు. ఆ పైన దైవం అనుకూలించాలి.

సాయంత్రం నర్స్‌కి రంగనాథరావ్ సృష్టించిన ఫేక్ టెలిగ్రాం అందింది. నర్స్ గాబరా పడింది ఆ టెలిగ్రాం చూసి. రంగనాధరావ్ నర్స్‌ని అనునయించి డబ్బిచ్చి వెంటనే భువనేశ్వర్ పంపాడు.

రంగానికి అన్నీ సిద్ధంచేసేసి ఆరు గంటలకి నాతో చెప్పి వెళ్ళాడు చిలికాకి. "రావ్! వెళ్తాను. పనంతా జాగ్రత్తగా చూసుకో!"

తలూపాను.

నామనసులో టెన్షన్ పెరిగిపోతోంది. రక్తంలో ప్రసరణవేగం హెచ్చింది.

నా నిర్ణయం గట్టిపడి పోయింది.

వాసవికి చెప్పకుండా చెరువువైపు దాచేశాను.

ఎనిమిది గంటలు కావస్తూంది.

ఒక పడవ వారన వెయిట్ చేస్తూ కూర్చున్నాను.

రంగనాధరావు ఒక్కడే వస్తేనే నా పని పూర్తయ్యేది. యింకెవరైనా కూడావస్తే....

ఏమో?

అదంతా నా అదృష్టం మీద ఆధారపడిఉంది.

నర్స్ భువనేశ్వర్ వెళ్ళిపోవడంచేత వాసవి తల్లి గదిలో పడుకొంది.

ఎనిమిదవుతుండగా రంగనాథరావు ఒక్కడే వస్తూ కనపడ్డాడు.

ఆనందంతో నా మనసు ఉరకలు వేసింది.

సిద్ధంగా ఉంచిన తెడ్డుచేతిలోకి తీసుకున్నాను.

విపరీతమైన టెన్షన్ భరించలేక నా చేతులు వణక సాగేయి. నా చేతులకిపట్టిన చెమటవల్ల ఆ తెడ్డు జారి పోసాగింది.

దగ్గరగా రానిచ్చి ఒక్కటేదెబ్బ వేశాను, నెత్తిమీద.

''అమ్మా'' అంటూ కేకవేసి పడిపోయేడు.

దెబ్బ గట్టిగా తగిలి, బుర్రచిట్లి రక్తం నా మీద తుళ్ళింది.

దగ్గరకివెళ్ళి చూశాను. రంగనాధరావులో కదలికలేదు.

అతన్ని యీడ్వటానికి వంగాను.

"ఎవరది? రావు!?" పిలుపు విన్పించింది.

డాక్టర్!

'యిపుడిక్కడికి ఎందుకు వచ్చినట్లు?'

నిటారుగా అయాను ఏదో భయంతో.

"రావ్! నువ్వేనా?" దగ్గర కొస్తూ అడిగాడు డాక్టర్.

'అవును.' అంటూ గబుక్కున ముందుకు వెళ్ళాను.

'అమ్మయ్య! యిక్కడున్నావా?' రిలీఫ్‌గా నిట్టూర్చి నట్లుంది. "రంగనాధరావ్ ప్లాన్ తెలిసింది రావ్! యిలా పరిగెట్టుకొచ్చాను.

మళ్ళ నిశ్చేష్టుడనై పోయాను.

"ఎలా తెలిసింది?" హీనస్వరంతో అడిగాను.

'సుమతి గదిలో టేప్ రికార్డర్ ఉంచాను రావ్! నాకు తెలుసు రంగనాధరావ్ ఎప్పుడో యిటువంటి ప్రయత్నం చేస్తాడని. నే చెప్పలేదూ రావ్! రంగనాధరావే తన

అన్నయ్యనూ చంపి ఉంటాడని. ఆ విషయం కూడా చెప్పాడు సుమతికి. రోజూ రాత్రి నర్స్ టేప్ రికార్డర్‌ని ఆన్‌చేస్తుంది తను పడుకోబోయే ముందు ఆ సంగతి రంగనాధరావ్‌కి తెలియదు.' ఆగాడు డాక్టర్.

'రావ్। మరో విశేషం। నీకు ఆవేళ అన్ని విషయాలు చెప్తున్నపుడు ఓ ముఖ్యమైన విషయం చెప్పడం మర్చిపోయాను.'

'ఏమిటది?' నా బుర్రపని చేయడం మానేసింది డాక్టర్ రావ్‌తో.

'నువు కామారెడ్డి దగ్గర పని చేసావనీ, కామారెడ్డి చేసిన హత్యా నేరం నీమీద మోపబడిందనీ నాకు తెలుసు రావ్? రంగనాధరావ్ నిన్ను పరిచయం చేసిన తరువాత నీగురించి అంతా యింక్వైరీ చేసాను. గుడ్ న్యూస్ రావ్। ఈ మధ్య కామారెడ్డి అటువంటి మరో నేరం చేసి దొరికి పోయాడు. అపుడు నీ విషయం చెప్పాడు. నువు నిర్దోషిగా ప్రూవ్ అయావ్।'

'మరి అప్పుడెందుకు చెప్పలేదు?' కోపం ముంచుకు వస్తోంది నాకు. ఆవేళే డాక్టరీ విషయం చెప్పివుంటే....?

'కొంచెం మతి మరుపు ఎక్కువ నాకు। అయినా యీ సారి చెప్దామనుకున్నాను. ఈ హడావుడిలో...'

నాకు డాక్టర్ చేప్పేదేదీ తలకెక్కడం లేదు.

భగవాన్। మళ్ళీ హంతకుడ్ని అయాను. యింకొకరి పొరపాటు వల్ల.

అపుడు చూశాడు డాక్టర్, రంగనాధరావ్ శవాన్ని. 'మైగాడ్ ఏమిటిది? నువు హత్య చేశావా?' ఆందోళనగా అడిగాడు.

నేనేం సమాధానం చెప్పలేదు.

నా బుర్రలో మళ్ళీ హంతకుడి ముద్రపడి ఎంత భయంకరమైన కాలం గడిపేదో వూహించుకోగానే కళ్ళు గిర్రున తిరగసాగేయ్. వేగంగా పరుగెత్తాను అక్కడ్నించి, మళ్ళీ అజ్ఞాతంలోకి.

(ఒక ఆంగ్ల నవల ఆధారంగా.)

(అయిపోయింది)

సీరియల్

# అడుగు ముందుకు వేస్తే భస్మం



వసుంధర

(గత సంచిక తరువాయి)

డాక్టర్ వచ్చేవరకూ రామంకి ఏవో ఊరడింపు మాటలు చెబుతూనే ఉన్నాడు గురువులు. రామం అవి వింటూ బాధ నటిస్తూ సమయం గడుపుతున్నాడు. డాక్టర్ వచ్చి రామాన్ని పరీక్షించి-'ఏమిటో తెలియడం లేదు. అంతా బాగానే ఉన్నట్లుంది. బహుశ అజీర్తివల్ల వచ్చి ఉండాలి. పొట్టచూస్తే అలా అనిపించడంలేదు-' అన్నాడు.

'అబ్బా!' అంటూ రామం మంచంమీంచి ఎగిరిపడ్డాడు.

'డాక్టర్ గారూ-అంతగా అంతుపట్టని రోగంగా మీరు భావిస్తే ఇతన్ని మీఇంటికి పంపిస్తాను. సరంజామా అంతా అక్కడే ఉందిగదా-' అన్నాడు ప్రెసిడెంటు.

'అదే మంచిదనిపిస్తోంది నాకూను....' అన్నాడు డాక్టర్.

గురువులుకు అందులో అనుమానించాల్సిన దుందని పించింది. 'కడుపునొప్పికి ఏదో మిక్స్చర్ ఇస్తే సరి పోయేదానికింత హడావుడి దేనికి? పేషెంటుని డాక్టర్ ఇంటికి తీసుకెళ్ళడమెందుకు?'

'మీఇష్టం. నాసలహానేనిచ్చాను....' అన్నాడు డాక్టర్.

'నన్ను వెళ్ళనీ గురువులూ. ఈబాధ భరించలేను-' అన్నాడు రామం.

'రామం-నీకుతెలియదు. నువ్వుప్రమాదంలోఇరుక్కుం టావు. వీళ్ళు నిన్ను నానుంచి వేరు చేయాలని చూస్తు న్నారు....' అన్నాడు గురువులు.

'ముందీ కడుపునొప్పి నానుంచి వేరుకానివ్వు గురు వులూ'! అన్నాడు రామం. అతనుపొట్ట పట్టుకుని మంచం మీద అంతెత్తు ఎగిరాడు.

'ఇది మిక్స్చర్‌కు లొంగే నొప్పికాదు. నిద్రమాత్ర వేసి ఇతన్ని రాత్రంతా పరీక్షించాలి. సరంజామా అంతా ఇంటివద్ద ఉంది. ఇప్పుడిలా ఇక్కడ వదలిపెడితే కోతి పుండు బ్రహ్మరాక్షసి కావచ్చు.....' అన్నాడు డాక్టర్.

'మనిషి ప్రాణాలకంటె ముఖ్యమైన దేముంది? ఈ గురువుల్తో మనకు పనిలేదు. ఇతడు పచ్చిరక్తం కళ్ళ జూసే హంతకుడు. ప్రాణాల విలువ తెలియదు ఈ మనిషి అనుమతితో మనకు నిమిత్తంలేదు. రామాన్ని

మీఇంటికి చేర్చే బాధ్యతనాది!' అన్నాడు ప్రెసిడెంటు.

'నాకు ప్రాణాలవిలువ తెలియనిమాట నిజమే: నేను పచ్చిరక్తం కళ్ళజూసే మాటకూడా నిజమే! రామానికి కించిత్ప్రమాదం వాటిల్లినా ఈరెండు నిజాలు మీరు తెలుసుకుంటారు గుర్తుంచుకోండి-' అన్నాడు గురువులు.

రామానికి కడుపునొప్పి రావడం గురువులుకు నచ్చ లేదు. అదొక అపశకునంగా అతను భావించాడు. తన పథకానికిదో పెద్దదెబ్బ. ఈకారణంగాజరిగే అలస్యంమాట టుంచి తనువాళ్ళ చేతుల్లోకి వెళ్ళిపోతున్నాడు. రామం గురించి రామేశానికి తనుహామీ ఇచ్చాడు. ఇప్పుడు రామం ప్రాణాలు డాక్టర్ చేతిలో ఉన్నాయి.

ప్రెసిడెంటు పాలేరు రామాన్ని భుజాలమీద వేసు కున్నాడు. రామం ఉండుండి ఎగిరిపడుతూనే ఉన్నాడు. కానీపాలేరు బలాఢ్యుడు. అతను రామాన్ని అవలీలగా ఎత్తుకుని, డాక్టరు ముందునడుస్తూంటే తను వెనుకగా నడుస్తున్నాడు.

అక్కణ్ణించి వెళ్ళిపోతూ... 'గురువులూ, గుర్తుం చుకో-గడువు రేపు రాత్రి వరకే ఉంది—' అన్నాడు ప్రెసిడెంటు.

గురువులు కోపాన్నీ, ఆవేశాన్ని నిగ్రహించు కున్నాడు. ముందు ఏంచేయాలాఅని తీవ్రంగా ఆలోచిస్తు న్నాడతను.

* *

'ఎవరది?' అంటూ తలుపులు తీసిన డాక్టర్ గురువుల్ని చూచి ఆశ్చర్యపోయి— 'నువ్వా' అన్నాడు.

"అవును. నేనే। రామానికెలాగుంది?' అన్నాడు గు రు వు లు.

'నువ్వెళ్ళి చూడు—" అన్నాడు డాక్టర్.

గురువులు రామం ఉన్న గదిలోకి వెళ్ళాడు. రామం మంచం మీద ప్రశాంతంగా ఉన్నాడు. అతను మెలకువ గానే ఉన్నాడు.

,,ఎలాఉంది?" అనడిగారు గురువులు.

,ప్రస్తుతానికి బాగానే ఉంది. కానీ ఏ మందుకూ లొంగలేదు. హఠాత్తుగా దానంతటదే తగ్గింది. మళ్ళిమళ్ళి రావచ్చునంటున్నాడు డాక్టర్. బహుశా రెండు రోజులు చూసి పట్నం పంపాల్సింటుందేమోనని కూడా అన్నాడు...' అన్నాడు రామం.

,అన్నీ అబద్దాలు... మందులకే తగ్గుంటుంది.' అన్నాడు గురువులు.

,అలాగే అనుకోవాలని నాకూ ఉంది. కానీ అది భయంకరమైన బాధ. మళ్ళి వస్తుందని తలచుకుంటేనే నాకు భయంగా ఉంది. పగవాడికి కూడ రావద్దు ఆ బాధ..., అన్నాడు రామం.

,,పగవాడికూ్కడా వద్దనుకునే అనుభవాలు చాలా ఉన్నాయీ ప్రపంచంలో. అలాంటి అనుభవాన్నొకటి ఇప్పుడు ఇక్కడ ప్రదర్శించబోతున్నాను. ఓపిక ఉంటే చూడు...." అన్నాడు గురువులు.

రామం ఆశ్చర్యంగా— 'ఏమిటి?' అన్నాడు.

,ఏమిటా— చేసిన పాపం ఏనాటికైనా పండుతుందం టారు. అదేమిటో ఇప్పుడే వీళ్ళలో చూడవచ్చు—' అన్నాడు గురువులు.

రామానికి భయంవేసింది. అతనికి కంగారుకూడా వచ్చింది. గురువులు కానీ తనపథకాన్ని గ్రహించలేదుగదా!

'నీ మాటలు వింటూంటే నాకేదో భయంగా ఉంది-' అన్నాడు రామం.

'నీ తెలివి తేటల్నీ నటననూ నేనభినందిస్తున్నాను రామం. నాతో రా, జరగబోయేది చూద్దువు గాని....' అన్నాడు గురువులు.

తన విషయం గురువులికి తెలిసిపోయిందని రామం గ్రహించాడు. కంగారుపడి చేసేదేముంది? జరగనున్న దెలాగూ జరగక మానదని గురువుల ననుసరించాడు రామం.

డాక్టర్ హాల్లో కూర్చుని ఉన్నాడు. రామం, గురువులు అక్కడకు రావడం చూసి - గురువుల్నుద్దేశించి - "పేషెంటుని కదపడం అస్సలు మంచిది కాదు...." అన్నాడు డాక్టర్.

" అ సంగతి నాకూ తెలుసు. కానీ నిన్న ఓ హెచ్చరిక పారేశాను గుర్తుందా? ఆ పని మీదే ఇక్కడకు వచ్చాను. నా క్రియా శూరత్వం ఎలా ఉంటుందో నా స్నేహితుడు తెలుసుకోవాలని ఇక్కడకు తీసుకు వచ్చాను...." అన్నాడు గురువులు.

'ఏమిటి నువ్వనేది?' అన్నాడు డాక్టర్. అతడి ముఖంలో కాస్త కంగారు కనబడింది.

'రామం-నువ్వు వెళ్ళి డాక్టర్ పక్క కూర్చో!' అన్నాడు గురువులు.

రామం వెళ్ళి డాక్టర్ పక్క కూర్చున్నాడు. డాక్టర్ కూర్చున్న చోట్నించి కదలకుండా గురువులు వంక

చూస్తున్నాడు. అతడి కళ్ళలో భయం లేదు. నిర్లక్ష్యం ఉంది.

"ఒకసారి నీ పెళ్ళాన్ని పిలు-" అన్నాడు గురువులు.

"ఎందుకు ?" అన్నాడు డాక్టర్.

'చెబుతాను. పిలవడానికి భయంగా ఉందా ?' అన్నాడు గురువులు.

'నా ఇంట్లో నాకు భయమేమిటి ?' అన్నాడు డాక్టర్-అంటూనే అతడు గట్టిగా - 'రమా !' అని పిలిచాడు.

"వస్తున్నా !" అన్న కంఠం వినిపించింది. గురువులు అటుగా చూస్తున్నాడు. ఒక అందమైన స్త్రీ వయ్యారంగా నడుచుకుంటూ వచ్చి గురువుల్ని చూసి ఠక్కున ఆగి పోయింది.

'ఫర్వాలేదు రమా ! ఇలారా-ఆయన మన అతిథి....' అన్నాడు డాక్టరు. అతడి కళ్ళలో నిర్లక్ష్యం స్పష్టంగా కనబడుతోంది. అతడి ధైర్యానికి కారణమేమిటా అని ఆలోచిస్తున్నాడు గురువులు.

"నేను నీ అతిథిని కాను...." అన్నాడు గురువులు.

"నా ఇంటికి వచ్చిన ప్రతి ఒక్కర్నీ అతిథిగా భావించి గౌరవించడం నా సంస్కారం. అది నీకర్థం కాకపోతే నీ కర్మ..." అన్నాడు డాక్టర్.

'అంత మర్యాదస్తుడివా-అయితే కాసేపు నీ పెళ్ళాన్ని నా కిస్తావా?' అన్నాడు గురువులు. ఆ కంఠంలో హేళన లేదు.

'గురువులూ ! మర్యాద నతిక్రమిస్తున్నావు .......' అన్నాడు డాక్టర్.

'మర్యాద నతిక్రమించడం లేదు. నీ పెళ్ళాన్ని పిలవ మని అడిగినదందుకే ....' అన్నాడు గురువులు. అతని కంఠం చాలా తీవ్రంగా ధ్వనించింది.

'పిడుగూ!' అన్నాడు డాక్టర్. అతడలా అన్న రెండు క్షణాల్లో ఆ హాలు అదిరినట్లు తోచింది. ఒక మహాకాయుడు హాల్లో అడుగు పెట్టాడు.

ఆ మనిషిని చూసి రామం అదిరిపడ్డాడు. రాక్షసుల గురించి పురాణాల్లో చదవడమే కానీ ప్రత్యక్షంగా చూసే అవకాశం అతడికి గలగలేదు. కోరలూ, కొమ్ములూ పెడితే ఆ రాక్షసుల కంటే భయంకరంగా ఉంటాడా మనిషి.

'మిష్టర్ గురువులూ! నేనేమీ తెలివి తక్కువ వాణ్ని కాను. అన్నింటికీ సిద్ధపడే నిన్ను లోనికి రానిచ్చాను. ఈ పిడుగుకు ఎదురునిల్చి పోరాడగల మొనగాడీ ప్రపంచంలో లేడు వీడికి రాని విద్యలేదు. తలచుకుంటే మనుషుల్ని నల్లుల్ని నలిపినట్లు నలిపేస్తాడు వీడు. కానీ నేను చెప్పినపుడే దేనికైనా తలచుకుంటాడు. నువ్వు ఏమైనా చేయాలనుకుంటే ఒక్క క్షణం ఆలోచించుకో. నీ నిర్ణయం నాకునచ్చితే మర్యాదగా ఇక్కణ్నించీ, ఆ తర్వాత ఈ ఊర్నించీ పోవచ్చు. లేదా మనిషిని మనిషిలా ఉంచి లోపలి ఎముకలన్నీ నుగ్గు నుగ్గు చేసేస్తాడీ పిడుగు. ఆలోచించుకో... ' అన్నాడు డాక్టర్.

గురువులు ఒక పర్యాయం పిడుగువంక చూశాడు. ఒక పర్వతంలా కనబడుతున్నాడు వీడు. పొరపాటున వాడు తనపై పడ్డాడా–నిజంగానే నుగ్గునుగ్గయి పోతాడు.

'పోవడానికి నాకు అభ్యంతరం లేదు డాక్టర్. కానీ

ఒక్కసారి నీ పెళ్ళాన్ననుభవించనిస్తే మళ్ళీ ఈ ఊరి జోలికి రాను...' అన్నాడు గురువులు.

డాక్టర్ ముఖం బాగా ఎర్రబడింది — "పిడుగును చూసే అంటున్నావా ఈ మాటలు...' అన్నాడు.

'పిడుగు సంగతి నీకు తెలుసు. కానీ నా సంగతి నా కొక్కడికే తెలుసు....' అన్నాడు గురువులు.

రామం ఆశ్చర్యంగా గురువుల్నీ, పిడుగునూ మార్చి మార్చి చూస్తున్నాడు. వాళ్ళిద్దర్నీ చూస్తుంటే అతనికి గుండెలదురుతున్నాయి. పిడుగులాంటి రాక్షసుణ్ణి చూసి భయపడని గురువులు మూర్ఖుడనుకోవాలో, ధైర్యవంతుడనుకోవాలో అతనికి అర్థంకాలేదు. గురువులకు అంత్యకాలం సమీపించిందనే అతను భావించాడు.

"అయితే పిడుగు నెదిరిస్తావా?" అన్నాడు డాక్టర్.

"ఎదిరిస్తాను. నేను పిడుగును మట్టికరిపిస్తే నీ పెళ్ళాన్ని నాకప్పగిస్తావా?" అనడిగాడు గురువులు. అతడిమాటలకు పిడుగు కూడా ఆవేశపడ్డాడు.

"ఇంక లాభంలేదు. నా సహనానికి హద్దు నశించింది. పిడుగూ! నీకుతోచిన విధంగా వీడి పట్టుపట్టు. ప్రాణాలు మాత్రం తీయకు...." అన్నాడు డాక్టర్.

పిడుగు తానున్న స్థలంనుంచి కదిలాడు. అతడు కదుల్తూంటే హాలు అదురుతోంది. గురువులు తనవైపు వస్తున్న పిడుగునే శ్రద్ధగా గమనిస్తున్నాడు.

డాక్టర్, రామం, రమ-ముగ్గురూ కుతూహలంగా ఏంజరుగుతుందోనని చూస్తున్నారు. తన చెలికాని పని అయిపోయిందని రామం అనుకుంటున్నాడు. గురువులు పీడ ఈనాటితో సరి అని డాక్టర్ అనుకుంటున్నాడు.

కర్మం కాలి గురువులు నెగ్గితే తనపని ఏమవుతుందని రమ కంగారు పడుతోంది. యుద్ధానికీ, ఆమె అభిమానికీ సంబంధముందిమరి!

పిడుగు చేతులు చాపి గురువుల్ని సమీపించాడు. గురువులు అతడికి అందకుండా కొద్దిగా వంగాడు. గురువులినందుకోవడానికి పిడుగుకూడా వంగాడు. గురువులు మెరుపులా అక్కడ్డించి పక్కకు తప్పుకుని గాలిలోకి ఎగిరి పిడుగు వీపుమీద బలంగా తన్నాడు కాళ్ళతో.

ఊహించని ఈ దెబ్బకు పిడుగు బోరగిల పడిపోయాడు. అతడి ముందు పళ్ళు రెండు విరిగాయి. అంతటి మహాకాయం ఒక్కసారి నేలకూలేసరికి ఓ పట్టాన లేవలేకపోయాడు.

ఈలోగా గురువులు పిడిగు వీపుమీద ఓచిన్న తాండవ నృత్యం చేశాడు. ఆ నృత్యం కారణంగా పిడుగుకు కదలడానికి మరింత కష్టమైంది. గురువులు తన నృత్యన్ని ఒక్కనిముషం సాగించి హఠాత్తుగా ఆగి పిడుగు భుజాలమీద మెరుపు వేగంలో రెండు దెబ్బలు వేసి క్రిందకు దిగాడు.

''డాక్టర్-పిడుగులేవడానికింకో అరగంట పడుతుంది. ఆ సంగతి తర్వాత చూసుకుందాం. నీ పెళ్ళాన్ని నాకు అప్పగించు....'' అన్నాడు గురువులు.

గురువుల ప్రతాపానికి రామం ఆశ్చర్య పోయాడు. డాక్టర్ వణికి పోయాడు.

డాక్టర్ భార్య రమ హడిలిపోతూ-అప్రయత్నంగా గురువుల ముందుకు వచ్చి-చేతులు జోడించి దణ్ణంపెట్టి-"అన్నలాంటి వాడివి-నన్ను రక్షించు.... అంది.

'నీ మొగుడు పిడుగును నా మీద ఉసిగొల్పినప్పుడు నేను నీకు అన్నలాంటి వాడినని గుర్తుండి ఉండదు. పిడుగు నన్ను హింసిస్తూంటే చూసి ఆనందించాలనుకున్నావు. వాడు మట్టి కరవగానే నన్ను అన్నలాంటి వాడినంటూ వచ్చావు. చాలా గొప్ప సంస్కారం నీది-' అంటూ ఆమె చేయి పట్టుకున్నాడు గురువులు.

డాక్టర్ ఉద్రేకంగా లేవబోయాడు. గురువులు చటుక్కున ఆమెను వదలి డాక్టర్ వద్దకు వెళ్ళి అతని ముక్కుకు ఏదో వాసన చూపించాడు. డాక్టర్ ఉన్న పళంగా కుర్చీలో కూలబడి పోయాడు.

'రామం-నువ్విక్కడే కూర్చొని ఉండు....' అన్నాడు గురువులు- 'డాక్టర్! ఇప్పుడు నువ్వు వాసన చూసిన మందు నువ్వు తయారు చేసినదే. ఇది వాసన చూపించి మనుషులను నిర్వీర్యుల్ని చేసి డయ్యాల పేరుతో బెదిరించే వాడు ప్రెసిడెంటు. ఒకప్పుడు నువ్వు ఒక శ్రామికుడి భార్యనిదేవిధంగా అవమానించావు. నీకూ ఆ అవమానం తప్పదు. నేనా గదిలోకి వెళ్ళి తలుపు వేసుకుంటాను. నువ్వలా చూస్తూ ఉండు...." అన్నాడు గురువులు.

డాక్టర్ కదలాలనుకున్నాడు. కదల లేక పోయాడు. ఏదో అనాలనుకున్నాడు. అనలేక పోయాడు. రామం వంక చూశాడు. రామం అతనికి సహాయపడేలా లేదు.

గురువులు, డాక్టర్ భార్యను బలవంతంగా ఓ గదిలోకి లాక్కుని వెళ్ళి తలుపులు వేసుకున్నాడు.

* * *

'మనం మళ్ళీ ఇలా సమావేశమవుతున్నందుకు నాకు చాలా సంతోషంగా ఉంది....' అన్నాడు గురువులు.

'మా హెచ్చరిక సంగతి ఏం చేశావు?' అన్నాడు ప్రెసిడెంటు.

'నేను రంగంలోకి దిగాను. ఏం జరిగిందో చెప్పమంటె చెబుతాను...' అన్నాడు గురువులు.

'చెప్పు....' అన్నాడు ప్రెసిడెంటు.

'ఒక స్త్రీ చెరచబడింది...'

ఉలిక్కి పడ్డారు చాలా మంది పెద్దలు - 'ఎవరామె?' అన్నాడు ప్రెసిడెంటు.

''మీ పది మందిలో ఒకరి భార్య!'' అన్నాడు గురువులు.

డాక్టర్ మౌనంగా తలవంచు కున్నాడు.

గురువులు మళ్లీ అన్నాడు—'నా కార్యరంగంలో ఇది మొదటి మెట్టు. తరువాతి చర్యలింకా చాలా ఘోరంగా ఉంటాయి....'

'నీ మాటలు నమ్మి బెదిరి పోతామనుకోకు....' అన్నాడు ప్రెసిడెంటు.

నా మాటలు నమ్మాల్సిన అవసరమున్నదో లేదో, ఆ తల వంచుకుని కూర్చున్న డాక్టర్ గారిని అడగండి...' అన్నాడు గురువులు.

'ఏం జరిగింది? ఎలా జరిగింది?' అన్నాడు ప్రెసిడెంటు కంగారుగా. డాక్టర్ ముఖం చూడగానే ఆయనకు అనుమానం కలిగింది - ఏదో జరిగే ఉంటుందని

'చెప్పు డాకర్! లేకుంటే సాక్ష్యాలతో సహా ఊరంతా ప్రచారం చేసేస్తాను ఇప్పుడు చెబితే ఈ పెద్ద మనుషుల మధ్య నీ రహస్యం భద్రంగా ఉంటుంది -' అన్నాడు గురువులు.

'ఇందులో రహస్యానికింకా తావెక్కడుంది? నా బ్రతుకెలాగూ హీనమై పోయింది....' అన్నాడు డాక్టర్.

"పాపం - అందరికీ తెలిసేకకూడా ఆ సూరయ్యకూడా తన బ్రతుకు వెళ్ళబుచ్చడం లేదూ - వాడూ మనిషే, నువ్వూ మనిషే! దానికేం ఫరవాలేదు కానీ జరిగింది చెప్పు....'

డాక్టర్ నెమ్మదిగా జరిగినది చెబుతూంటే అందరూ భయభ్రాంతులై విన్నారు. పిడుగును ఒక్క క్షణంలో మట్టి కరిపించేదంటే గురువులు సామాన్యుడై ఉండడని వారందరకూ అనిపించింది. ఇదంత సామాన్య వ్యవహారం కాదని ప్రెసిడెంటుకూడా అనిపించింది.

పదిమందీ కాసేపు చర్చలు జరిపారు. కాస్సేపయ్యాక 'మాకు మరో రోజు గడువు కావాలి...' అన్నాడు ప్రెసిడెంటు.

నేను గడువిస్తే అక్కర్లేదన్నారు, పైగా నాకే గడువిచ్చారు. ఇప్పటికి నన్ను గడువు అడిగేస్థితికి వచ్చారు. ఫరవాలేదు. రేపైనా ఆటవికులవద్దకు దారి చెప్ప గలరని ఆశిస్తాను...." అన్నాడు గురువులు.

అందరూ విడిపోయారు. గురువులు తన గదిలోనికి వెళ్ళిపోయాడు. రామం అతడిననుసరించాడు. అతడికిప్పుడు గురువులు అంటే చాలా భయంగా ఉంది.

"రామం! నిన్ను తోడుగా తీసుకొని వచ్చినప్పుడు నీ తాత నాకు సరియైన సమాచారం ఇవ్వడం కోసం మాత్రమే ఉపయోగిస్తావనుకున్నాను. నీ కారణంగా నేను త్వరగా పనులు పూర్తిచేసుకోలేనేమోననుకున్నాను. కానీ నువ్వు నాకింత బాగా ఉపయోగపడ

గలవని నేననుకోలేదు.నీ బుర్రలో ఇంతటి అమోఘమైన తెలివితేటలున్నాయని అనుకోలేదు-' అన్నాడుగురువులు.

రామం ఆశ్చర్యంగా ముఖం పెట్టి-"ఏమిటి నువ్వు గ్రహించిన ఆ తెలివి తేటలు?' అన్నాడు.

"అలా ఆశ్చర్యాన్ని ప్రకటించకు. నాకు తెలుసు నువ్వు మంచి నటుడివని. నీ నటనా సామర్థ్యాన్ని నిన్న రాత్రి లేని కడుపునొప్పి అభినయించే టప్పుడే చూశాను నిన్న వాళ్ళందర్నీ బెదిరించి నప్పుడు డాక్టర్ దురాగతాన్నభివర్ణిస్తూ ఒక కథ చెప్పాను. ఆ కథచెప్పడం లోని నా సూచననెలా అర్థం చేసుకున్నావో నువ్వు కడుపు నొప్పినటించి డాక్టర్ ఇంటప్రవేశించావు. నువ్వక్కడ లేకపోతే ఆ ఇంటికివెళ్ళడానికి నాకు సరైన వంకలేకపోయేది. నువ్వున్నావు కాబట్టే నేను డాక్టర్ ఇంటికి వెడుతూంటే పెద్దలెవ్వరికి అనుమానం కలగ లేదు. ఆఖరికి డాక్టర్ కి గూడా.నాప్లాను విజయవంతం అయింది. నీకు చాలాచాలా థాంక్సఅన్నాడు గురువులు.

రామానికి ఏం జవాబు చెప్పాలో తోచలేదు. గురువులకింకా నా మీద దురభిప్రాయం కలగకపోవడం-నాఅదృష్టం- అనుకున్నాడు రామం.

* * *

మర్నాడుదయం గురువులూళ్ళోకి వెళ్ళిపోగానే ప్రెసిడెంటు రామాన్ని నిష్ఠూరాలాడాడు- "నాకు తెలుసు." నువ్వు మా మనిషిగా నటిస్తూ అతనికి సాయపడుతున్నావు-" అన్నాడాయన.

ఆ అవసరం గురువులుకు లేదు. అతడు నేను లేకపోయినా తన పనులు సాధించుకో గలడు. కానీ ఒక చిన్న సందేహం? మీరతనికా నిధిరహస్యం ఎందుకు

చెప్పరూ? అన్నాడు రామం.

'నిధీ లేదు పాడూ లేదు. ఉంటే ఎందుకుచెప్పం ?"
అన్నాడు ప్రెసిడెంటు.

"ఉందని అతనంటాడు. లేదని మీరంటారు. మధ్య
నేను చస్తున్నాను."

అన్నాడు రామం.

" నయానా భయానా నాదగ్గర్నుంచి ఆ రహస్యం
లాగాలని చూస్తున్నారు మీరు. అది చెప్పడం జరగదు! '
అన్నాడు ప్రెసిడెంటు.

రామం ఆశ్చర్యంగా— "అయితే ఆ అపూర్వనిధి
ఉందా!" అన్నాడు.

'ఉందో లేదో చెబుతాను. నీకూ కూడాదానిగురించి
తెలుసుకోవాలని ఉంది కదూ— ఆ గురువులితో కలిసి
దాని గురించి బయల్దేరాలనుకుంటున్నావు కదూ— నిజం
చెప్పు.... 'అన్నాడు ప్రెసిడెంటు.

'లేదు.... అన్నాడు రామం...' నాకానిధిపై నమ్మ
కం లేదు. గురువుల్ని వదుల్చుకుందామనే నా ఉద్దేశ్యం.
మా ఊరు ఎంతత్వరగా చేరితే అంతసంతోషిస్తాను....''

'సరే అయితే నిజంచెబుతున్నాను. నిధి విషయం
చెప్పలేనుగానీ ఇక్కడికి సమీపంలో ఉన్న ఆటవికుల
ప్రాంతానికి దారి తెలుసునాకు. ఆ ప్రకారంవెడితే తప్ప
సురక్షితంగా ఆ ప్రాంతం చేరుకోడం అసాధ్యం. ఈ
ఊరి మునసబుగారింటిలోంచి కొండల్లోకి ఒక సొరంగ
మార్గముంది. —అదిచూపిస్తాను నువ్వు వాళ్ళింటిలో
కొచ్చావంటే!' అన్నాడు ప్రెసిడెంటు.

రామం కళ్ళు విప్పారాయి. మొత్తంమీద ఒక పెద్ద
రహస్యం ఇన్నాళ్ళకు బయటపడుతోంది. ఈ రహస్యం

తనకెంతవరకూ ఉపయోగపడుతుందన్నది ముఖ్యంకాదు. గురువుల పిరోచిత చర్యలు చూశాక అతడితోపాటు వెళ్ళాలన్న కోరిక నానాటికీ అధికమవుతోంది.

అయితే ఎప్పుడు చూపిస్తారు.? అన్నాను ఆత్రుతగా.

నువ్వుకోరుకుంటే— ఇప్పుడే। అన్నాడు ప్రెసిడెంటు।

"అయితే నేను రెడీ !" అన్నాడురామంఅతనికి చాలా ఆత్రుతగా ఉంది.

ప్రెసిడెంటు అతణ్ని రహస్య మార్గం చూపించ డానికి మునసబు ఇంటికి తీసుకుని బయల్దేరాడు.

రామం ఆలోచనలవిందా ఆ రహస్య మార్గమే ఉంది. గురువుల్ని వదిలి ప్రెసిడెంటు ఆ రహస్యమార్గాన్ని తన కెందుకు చూపాలనుకొంటున్నాడో ఆలోచించలేదు.

ప్రెసిడెంటు చనువుగా మునసబు ఇంట్లో ప్రవేశిం చాడు. రామం ఆయన్ననుస రించాడు. మునసబు ఇంట్లో లేడని ఆయన భార్య చెప్పింది. దొడ్లో తనకు పని ఉందన్నాడు ప్రెసిడెంటు.

రామం, ప్రెసిడెంటు కలిసి మునసబు ఇంటి దొడ్లోకి వెళ్ళారు. అక్కడ ఓ చిన్న అరుగుమీద ఓ మనిషి కూర్చుని ఉన్నాడు. రామం ఆ మనిషిని చూడలేదు.

'ఇదిగో రామం - ఆ మనిషిని చూడు-, అన్నాడు ప్రెసిడెంటు.

రామం ఉలిక్కిపడి ఆ మనిషిని చూశాడు. చూసేక మరింత ఉలిక్కిపడ్డాడు.

ఆ మనిషి పువ్వుల లుంగీకట్టుకుని ఉన్నాడు. ఎత్తు ఆరడుగులకు పైగా ఉంటుంది. నల్లటి శరీరం-నూనె

రాసినట్లుగా మెరుస్తోంది. ' కండలు మెలికలు తిరిగి ఉన్నాయి, ఇంగ్లీష్ సినిమాల్లో శాంసన్‌లా ఉన్నాడు. రామాన్ని చూస్తూనే ఆ మనిషి లేచి నిలబడ్డాడు. అతని మొలకు ఒక పటకా బెల్టుఉంది. అతనా బెల్టు విప్పిఎడమ చేతిలోకి తీసుకున్నాడు.

'వాడిది ఎడమ చేతి వాటంలే' అన్నాడు ప్రెసిడెంటు.

రామం పై ప్రాణాలు పైనే పోయాయి. హఠాత్తుగా అతడి మెదడు వేగంగా ఆలోచించసాగింది. తను ప్రెసిడెంటు వలలోపడి పోయనని గ్రహించాడు. అంతకు మునుపే గురువులు చేసిన హెచ్చరిక కూడా గుర్తుకు వచ్చింది.

'ప్రెసిడెంటును నమ్మకు. ఆయన నిన్ను చంపాలనుకుంటున్నాడు. ఆయన విషయంలో చాలా జాగత్తగా ఉండాలి. ఆయనతో గానీ ఊరి పెద్దలతో గానీ ఒంటరిగా తిరక్కు-- అన్నాడు.

'ఎందుకని?

'నన్నేమీ చేయలేదనేది వాళ్ళు గ్రహించారు. నిన్ను సాధిద్దామనుకుంటున్నారు. మనిద్దర్నీ విడదీసి ముందు నిన్ను, ఆ తర్వాత నన్ను చంపాలని వాళ్ళ పథకం-,

"దానికి నువ్వేం చేద్దామనుకుంటున్నావ్ ?"

"నిన్నూ నన్ను కాపాడుకురావడం కష్టం. నా సంగతి నేను చూసుకుంటాను. నువ్వు కూడా నీ జాగ్రత్తలో నువ్వుండు-" అన్నాడు గురువులు.

నిజంగానే దురదృష్టం తన్నువెంటాడింది.

"ఏమిటిదంతా?" అన్నాడు రామం కంగారుగా.

"ఏమీలేదు. నువ్వు అలాచూస్తుండు. జరగాల్సింది

జరుగుతుంది....." అంటూ ప్రెసిడెంటు ఆ మనిషి వంకచూసి- "సిద్ధంగా ఉన్నావా" అనడిగాడు.

"చిత్తం!"

"అయితే ఇతన్ని ఆ రేకులషెడ్లోకి తీసుకువెళ్ళు. నా అంతటి వాడితో ఆటలాడాలని చూసిన ఘటికుడితను. కాబట్టి నీకు తోచినంతసేపు ఇతనితో ఆడుకో. ప్రాణాలెంత ఆలస్యంగాపోతే అంత బాగుంటుంది అట-నీ సరదా తీర్చుకో-" అన్నాడు ప్రెసిడెంటు.

ఆ మనిషి ముందుకువచ్చి కుడిచేత్తో రామం చేయి పట్టుకున్నాడు. రామం ఆపాదమస్తకం వణికిపోతూ- "ప్రెసిడెంటుగారూ, ఇదివాలా అన్యాయం. మీకు నేను సాయపడాలని ఎంతగానో ప్రయత్నించాను. అదృష్టం కలిసిరాలేదు. నాకింత ఘోరశిక్ష విధించడం న్యాయం కాదు...." అన్నాడు.

"నువ్వింకేమీ మాట్లాడకు. ఆదేవుడుకూడా నిన్ను క్షమించడు, రక్షించడు...." అన్నాడు ప్రెసిడెంటు.

ఆ మనిషి రామాన్ని బరబరా ఈడ్చుకుంటూ రేకుల షెడ్లోకి వెళ్ళాడు. రేకుల షెడ్డుకు ఓ సన్నని ప్రవేశ ద్వారం ఉంది. చుట్టూ రేకులు. పైన టాపు లేదు. మునసబుగారు దాన్ని బందుల దొడ్డిగా ఉపయోగిస్తూంటాడు

రామం ఆర్తనాదాలు వినడడంకోసం ప్రెసిడెంటు సిద్ధంగా ఉన్నాడు. ఆయన మనసు కసితో అవేశపడిపోతోంది. ప్రెసిడెంటు వింటూండగా కెవ్వుమన్న కేక వినిపించింది. అయితే అది ఒకటే కాదు. రెండు

కంతాలు. ప్రెసిడెంటు ఆశ్చర్యంగా రేకుల షెడ్డు వైపు తిరిగాడు.

ఆయనింకా రెండడుగులు వేయకుండానే షెడ్లోంచి రామం, ఆ అరడుగుల మనిషి బయటకు వచ్చారు. ఇద్దరు వణికిపోతున్నారు.

'ఏం జరిగిందిరా—అలా వణికిపోతున్నావ్?' అన్నాడు ప్రెసిడెంటు.

'తమరొక్కసారి లోపలకు రండి .... ' అన్నాడు వాడింకా వొణికి పోతూనే.

ప్రెసిడెంటు రేకులషెడ్లో అడుగు పెట్టాడు. అక్కడ ఆయన చూపిన దృశ్యం ఎంతటి ధైర్య వంతుణ్నయినా నిశ్చేష్టితుణ్ని చేస్తుంది.

అక్కడ మునసబు నేల మీద పడి ఉన్నాడు. వంటి మీద చిన్న పంచె మినహాయించి ఏమీ ఆచ్ఛాదన లేదు. ఒడలంతా దెబ్బలతో కమిలిపోయి ఉంది. అక్కడక్కడ చర్మం చిట్లి రక్తం ధారలుగా కట్టింది. కళ్ళు రెండూ తెరచి ఉన్నాయి. చూపులు భయంకరంగా ఉన్నాయి. చేతులు రెండూ వెనక్కి విరచి కట్టబడ్డాయి. నోట్లో కూడా గుడ్డలు కుక్కబడి ఉన్నాయి.

అంటే ఎవరో మునసబు నోట్లో గుడ్డలు కుక్కి చేతులు కట్టేసి నిస్సహాయుణ్ని చేసి గొడ్డును బాదినట్లు చావ బాదారన్న మాట!

ఇప్పుడు మునసబు శరీరంలో ప్రాణం లేదు.

మునసబు శవాన్ని చూసి, అప్రయత్నంగా తనూ 'కెవ్వుమ' ని అరిచాడు ప్రెసిడెంటు.

*　　　*　　　*

'నాలో కరుణ లేదు. నాకు హృదయం లేదు. నా లక్ష్య సాధన కోసం ఏమైనా చేస్తాను. పది మందల్లా తొమ్మండుగురయ్యారు. ఈ రోజు నుంచి లెక్కపెట్టుకోండి. రోజు కొకరు తగ్గిపోతారు .... ' అన్నాడు గురువులు.

పెద్దలు తొమ్మండుగురూ కంగారుగా ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు.

గురువులు వాళ్ళ కళ్ళలో రాక్షసుడిలా కనపడసాగాడు.

'మీరేం సామాన్యులు కారు. నన్ను పట్టుకోడానికి రకరకాలుగా యత్నిస్తున్నారు. పోలీసుల్ని పిలిపించారు. పిడుగు చేత చంపించాలనుకున్నారు. నా రామాన్ని అమానుషంగా చిత్రహింస చేయాలనుకున్నారు. కానీ ఒక్కదాంట్లోనూ దేవుడు మీకు సాయపడలేదు. అంటే అర్థం న్యాయం మీ పక్షాన లేదన్న మాట? ఈ ఊళ్ళో రోజుల తరబడి నా సమయం వృధా అయిపోతోంది. ఇంక చివరి అస్త్రాన్ని ప్రయోగించక తప్ప లేదు—'అన్నాడు గురువులు.

'ఇలాంటి వాడికి దొంగ కూడదు. వీణ్ని ప్రజల ముందు నిలబెట్టాలి—' అన్నాడు ప్రెసిడెంటు.

'ఎవరు నీ ప్రజలు? ఎక్కడున్నారా ప్రజలు? నీకు తెలుసో తెలియదో-నీ ఇనప్పెట్టె లోంచి లక్షరూపాయలు తీసి ఈ ఊరి పేద ప్రజలకు పంచిపెట్టాను. వాళ్ళందరితో మాట్లాడేను. నీ ఘోరాలను వాళ్ళు సహించే రోజులు పోతున్నాయి. నాలాంటి మనిషి ఒక్కడు సాయముంటే నీ బ్రతుకును నేలమట్టం చేస్తామని వాళ్ళంటు

న్నారు. మునసబు చచ్చేడని తెలిస్తే ఊరంతా పండుగ చేసుకుందామనుకుంటోంది. నేనొక్క ఈల వేస్తే వంద మంది ఈ ఇంటి చుట్టు పక్కలలో నిలబడతారు. కావా లంటే ఈలవేస్తాను....” అంటూ గురువులు శక్తి కొద్దీ ఈలవేశాడు. తర్వాత- “ఇప్పుడు వెళ్ళి ఈ ఇంటి చుట్టు ఎందరున్నారో లెక్కపెట్టుకుని రండి- అన్నాడు.

పెద్దలందరూ ఇంటి బయటకు వెళ్ళారు.

వాళ్ళలా వెళ్ళగానే -‘అన్నీ తెలుసన్న మాటనీకు. నా ప్రాణాలు కాపాడావు నువ్వు. నీకు కృతజ్ఞతలెలా చెప్పుకోవాలో తెలియడం లేదు-’ అంటూ గురువులు చేయిపట్టు కున్నాడు రామం.

‘రామం-నువ్వు తెలివైన వాడివే కానీ - లోకజ్ఞానం చాలదు. అనుకున్నది చేయడానికి ఎత్తులు బాగా వేస్తావు కానీ ఎదుటి వాళ్ళు నీ మీద ఎప్పుడు దెబ్బ తీయాలను కుంటున్నారో ఊహించ లేవు. నిన్ను ఓ మనిషి చేత బెల్లుతో చావగొట్టించడానికి మునసబు ఏర్పాటు చేస్తు న్నట్లు నిన్ననే నాకు తెలిసింది.

ఏమనిషైతే నిన్ను కొట్టాలను కుంటున్నాడో ఆ మనిషి ఇంటి నుంచి వాడి పటకా బెల్టు ఎత్తుకొచ్చి మునసబు ఇంటికి వెళ్ళాను. దొడ్లో ఆయన ఒంటరిగా తటస్థ పడ్డాడు. నోరునొక్కి షెడ్లోకిలాక్కుని వెళ్ళాను. చేతులు విరిచి కట్టేసాను. నోట్లో గుడ్డలు కుక్కాను. చావబాదేశాను. చచ్చాడు. అక్కణ్నించి ఆ బెల్టు తీసు కుని వెళ్ళి మళ్ళీ ఆ మనిషి ఇంట్లో పెట్టి నీ దగ్గరకు వచ్చాను,

ప్రెసిడెంటు నిన్ను తీసుకెళ్ళాడు. చాటుగా అంతా

గమనిస్తూనే ఉన్నాను. నీ వంటి మీద ఈగ వాలినా ఆ మనిషి అంతు చూడాలనుకున్నాను. అయితే అలా జరగలేదు. ప్రెసిడెంటు షాక్ తిన్నాడు. ఆ షాక్‌లో అస్నీ మర్చిపోయాడు. అందుకే అప్పుడు నేను మీ మధ్యకు రాలేదు. ఇంక రహస్యం బయటపడే క్షణం దగ్గరవుతోంది-, అన్నాడు గురువులు.

రామం ఆశ్చర్యంగా గురువులు వంక చూస్తూన్నాడు. ఒక దారుణ హత్యను చేసిన మనిషిగా అతను రామం కంటికి కనబడ్డం లేదు. తన ప్రాణాలు కాపాడిన దేవతగా ఒక మహాత్ముడిలా కనబడతున్నాడు. పాప పుణ్యాలనూ, మంచి చెడ్డలనూ నిర్ణయించేది స్వార్థమే గదా ఈ ప్రపంచంలో!

పెద్దలు వీధిలోంచి బయటకు వచ్చారు. అందరి ముఖాల్లోనూ కంగారు కనబడుతోంది.

"చూశారా?" అన్నాడు గురువులు.

ఒక భూస్వామి గురువులు వంక చూసి-"ఇంతమంది జనాన్ని ఈ ఊరి పెద్దలకు వ్యతిరేకంగా ఎలా కూడగట్టావోయ్ గురువులూ!" అన్నారు.

గురువులు నవ్వి - 'పదవులు అహంకారాన్నిస్తే దాంతో కళ్లు మూసుకుపోతే మనమేం చేసినా ప్రజలు వహిస్తారని భ్రమపడితే ఆ నాయకుల్ని పడగొట్టడానికి నాలాంటివాడు ఒక్కడు చాలు. అందుకు రాజకీయపుటను భవం అక్కర్లేదు. మంచి అక్కర్లేదు. విసిగిపోయిన ప్రజలు పాత నాయకుల్ని పడగొట్టడానికి ఏమైనా చేస్తారు. ఇందిరాగాంధీ ప్రభుత్వం విషయంలో జరిగినదే నీ విషయంలో జరిగింది....' అన్నాడు.

పెద్దలందరూ తగ్గుస్వరంలో సమాలోచనలు జరిపారు. వారిలో నలుగురైదుగురు బాగా భయపడ్డారు. గురువులు అన్నంత పనీ చేస్తాడనీ, చేయగలడనీ అందరికీ నమ్మకం కలిగింది.

'ఆటవికులలో శత్రుత్వం ఏర్పడితే చాలా ప్రమాదం' అన్నాడు ప్రెసిడెంటు.

'అలా ఎందుకు? వీళ్ళని మన మనుషులుగా నిధిలో పని చేయడానికి మనం ఎన్నుకున్నామని పంపిస్తే సరిపోతుంది –' అన్నాడు గ్రామ పురోహితుడు.

'వీళ్ళను నిధి దాకా చేరనిస్తే చాలా ప్రమాదం. వాడసలే గుండెలు తీసిన బంటు. అప్పుడు మన ఊరికే ప్రమాదం –' అన్నారు ప్రెసిడెంటు.

'వీళ్ళిక్కడుండడం కూడా ఊరికి ప్రమాదకరంగానే ఉంది. అలగా జనాన్ని మన మీదకు రెచ్చగొడుతున్నాడు. ఊళ్ళో మనకు విలువ లేకుండా చేస్తున్నాడు' అన్నాడు కరణం.

'ఈ విషయంలో మన మిత్రులిక్కడికి సాయుధంగా ఎందుకు రాకూడదు? వీళ్ళ ఆట క్షణాల మీద కట్టవుతుంది' అన్నాడు ఓ డాక్టరు.

'అలా కుదరదు. మన మిత్రులేపరిస్థితుల్లోనూ సాయుధులై ఈ ప్రాంతాలకు రారు. ప్రమాదకరమైన పరిస్థితులుగానీ ఎదురైతే ఆ విషయం చూసుకోవడానికి ఆటవికులున్నారు. ఎవరైనా తెగించి నిధి ప్రాంతాలకు వెడితే ఆ విషయం మనం కాస్త ముందుగా తెలియపరిస్తే చాలు. నిజం చెప్పాలంటే వీళ్ళ విషయం ఇంతవరకూ మన మిత్రులకు తెలియబర్చలేదు. ఇద్దరు మనుషుల్ని

మనవేమీ చేయలేకపోయామంటే వాళ్ళ దృష్టిలో మనం బాగా లోకువై పోతాం-' అన్నాడు ప్రెసిడెంటు.

"అయితే ఏం చేద్దామంటారు ?" అన్నాడు ఓ షావు కారు.

'మీరంతా చెప్పిందే- వీళ్ళను ఆటవికుల ప్రాంతానికి చేర్చడం. మన మామూలు పద్ధతి ప్రకారం అయితే స్పృహ తప్పించి అక్కడికి పంపేవాళ్ళం. ఇప్పుడలా చేయడానికి వీలు కాదు, గురువులు ఒప్పుకోడు. ఆ దారి వీళ్ళకు తెలియక తప్పదు....' అన్నాడు ప్రెసిడెంటు.

'ఆలస్యం-అమృతం-విషం- ఆ పని చేయండి. కానీ అక్కడికి వెళ్ళేరో ఆటవికులు వీళ్ళ పని పూర్తి చేసే ఏర్పాటు చేయాలి...' అన్నాడు గ్రామ పురోహితుడు.

'అవును-ఆ దారి తెలిసిన పరాయి వాళ్ళెవ్వరూ బ్రతికి ఉండరాదు-' అన్నాడు ఓ షావుకారు.

"ఆ ఆటవికులను చేరిన వాళ్ళెవ్వరూ ఇంతవరకూ ప్రాణాలతో బయటపడలేదు-" అన్నాడు ప్రెసిడెంటు నర్మ గర్భంగా నవ్వి.

"మన ఎరికలో అని అనండి-" అంటూ సవరించాడు కరణం.

ప్రెసిడెంటు చురుగ్గా కరణంవంక చూసి- "నాకాఆట వికుల గురించి బాగా తెలుసు. ఇంతవరకూ ఎవ్వరూ అక్కణ్ణించి బయట పడలేదు. ఇప్పుడూ అదే జరుగుతుంది-" పెద్దలు గురువుల్ని పిలిచి: "ఆటవికుల ప్రాంతానికి చేర డానికి నీకు దారిచెప్పడానికి నిర్ణయించాం. అయితే వాళ్ళు చాలా ప్రమాదకరమైన వ్యక్తులు. ఆ తర్వాత జరిగే కష్ట నష్టాలకు పూర్తిగా మీరే బాధ్యులు...." అన్నారు.

"అవన్నీ నేను చూసుకుంటాను. కానీ ఆటవిక ప్రాంతాన్ని చేరుకునే వరకూ మాకు తోడుగావచ్చే మని షితోపాటు కరణంగారి మనవడూ, ప్రెసిడెంటు గారి మనవడూ కూడారావాలి-" అన్నాడు గురువులు.

ప్రెసిడెంటు, కరణాల ముఖాలు మాడిపోయాయి.

"ఆ పసిపిల్లలెందుకు? నీకుమేము తప్పుదారి చెబుతామా?" అన్నాడు ప్రెసిడెంటు.

"మనం పరస్పరం శత్రువులం. అందువల్ల ఒకరి నొకరు నమ్మేప్రసక్తి లేదు. మీ పిల్లలు మాదగ్గరు న్నంత సేపూ దారిగురించి నాకేబెంగా అవసరముండదు.. అదీసంగతీ-" అన్నాడు గురువులు.

"ఆ తర్వాత మాపిల్లలుమాకు సురక్షితంగా చేరు తారని నమ్మకమేమిటి?" అన్నాడు కరణం.

"నువ్వు చెప్పేదారి సరైనదయితే ఎలాగూ సురక్షి తంగా చేరతారు. నీ మిత్రులైన ఆటవికుల దగ్గరికి గదా నేను వెడుతున్నాను. మీ పిల్లలకేమైనా చేస్తేవాళ్ళ నన్ను బ్రతుక నిస్తారా?" అన్నాడు గురువులు.

"సరే- అలాగే చేద్దాం-" అన్నాడు ప్రెసిడెంటు.

"మరొక్క షరతు...." అన్నాడు గురువులు. "మీ ఊరి పెద్దలందరూ సంతకాలుచేసి ఆటవిక నాయ కుడికో కాగితం రాయాలి. అందులో నేను, రామం అక్కడికి వస్తున్నట్లు, మేము మీ మిత్రులమైనట్లూ మమ్మల్ని సకల మర్యాదలతో అపూర్వనిధి ప్రాంతానికి పంపించ వలసిందని రాయాలి-"

ప్రెసిడెంటు తీవ్రాలోచనలో పడ్డాడు. అలా కాగితం రాసివ్వడం ఆయనకిష్టంలేదని ముఖం చూసి తెలుసుకో

వచ్చు. అయితే కొద్దిసేపట్లోనే ఆయన కళ్ళు ప్రకాశవంతమయ్యాయి.

"సరే గురువులు! అలాగే చేస్తాం. ఎటొచ్చీ అందుకు మీ ఫోటోలు కావాలి. ఈ ఫోటోలో మనుషుల్ని- అని స్పష్టంగా రాస్తేతప్ప వాళ్ళకు ఏ విషయమూ తెలియదు....' అన్నాడు ప్రెసిడెంటు.

ఫొటోల అయిడియా గురువులకు నచ్చింది. అతను అంగీకరించగానే డాక్టర్ తన ఇంటికివెళ్ళి కెమేరా తీసుకొని వచ్చాడు. గురువులుకు, రామానికీ అతను ఫొటోలు తీశాడు.

"సిద్ధంగా ఉండండి-రేపే మీ ప్రయాణం!" అన్నాడు.

*　　　*　　　*

కొండ ప్రాంతానికి ఎంవరో రాలేదు. ప్రెసిడెంటు, కరణం, ఓ ఆటవికుడు మాత్రం వచ్చారు. గురువులు కరణంగారి మనువణ్నెత్తుకున్నాడు. రామం ప్రెసిడెంటు గారి మనువణ్నెత్తుకున్నాడు. తన మనవణ్ని గురువులు చేతిలో చూస్తూ కరణం వణికిపోతున్నాడు.

అంతా కలిసి రాళ్ళలో తుప్పల్లో కొంత దూరం నడిచి ఒకచోట ఆగారు.

"ఈ పక్కనుంచి కొంతదూరం వెడితే ఒక గుహ వస్తుంది. ఆ గుహలోంచి కొంతదూరం నడిస్తే ఒక అరణ్యంలోకి దారి తీస్తుంది. అలా గుహలూ, అరణ్యాలూ దాటుకుంటూ రాత్రిదాకా ప్రయాణం చేస్తే ఆటవీకుల ప్రాంతం వస్తుంది. ఈ ఆటవికుడొక్కడికే అన్ని దారులూ బాగా తెలుసు. ఇతడు చాలామందిని తీసుకునివెళ్ళాడీదారిలో. కానీ తిరిగివచ్చింది మాత్రం

ఇతనొక్కడే!'' అన్నాడు ప్రెసిడెంటు.

"ఈ హెచ్చరిక ఇచ్చేముందు మీ పిల్లలు మా దగ్గరున్నారని గుర్తుంచుకోండి-" అన్నాడు గురువులు.

ప్రెసిడెంటుకానీ కరణంగానీ ఏమీ మాట్లాడలేదు. జాలిగా తమ పిల్లలవంక చూశారు.

వాళ్ళిద్దరికీ పది సంవత్సరాల వరకూ ఉండవచ్చు కుర్రాళ్ళ ముఖాల్లో ఎక్కడా భయం కనబడ్డంలేదు. చాలా చాలాకీగా ఉన్నారు. ఒక కొత్త ప్రాంతం చూడబోతున్నామనీ, అక్కడ సినిమాల్లో చూసేలాంటి ఆటవిక జాతి ఒకటి నివశిస్తున్నదనీ తెలిసివారికి చాలా ఉత్సాహంగా ఉంది.

"నీ పేరేమిటి?" అని గురువులు ఆటవికుడ్నడిగాడు.

"లక్ష్మణుడండి-" అన్నాడు ఆటవికుడు.

కరణంగారి మనవడు గోపీ, ప్రెసిడెంటుగారి మనవడు శంకర్-ఇద్దరూ తాతలకు ఉత్సాహంగా టా టా చెప్పారు. వాళ్ళ ఉత్సాహాన్ని చూస్తూ కళ్ళొత్తుకున్నాడు కరణం-"తండ్రీ వెంకటస్వామీ ఈ పిల్లలిద్దరూ ఏ ప్రమాదం లేకుండా వెనక్కి వచ్చేలా చూడు' - అంటూ దేవుడికి మొక్కుకున్నాడు.

లక్ష్మణుడు ముందు దారితీయగా గురువులు, రామం అతడి వెనుక నడిచారు. ఇప్పుడు గోపీ, శంకరం కూడా వాళ్ళతో పాటు నడుస్తున్నారు.

అలా కొంతదూరం నడిచేసరికి ఓ గుహ వచ్చింది. అంతా గుహలోకి ప్రవేశించారు. అది మనుషులు తయారు చేసిన గుహకాదు. కొండలమధ్య దానంతటది ఏర్పడింది. గుహ మరీ చీకటిగా లేదు.

'పాములూ, అవీ ఉంటాయా ?' అన్నాడు రామం.

'ఉండవు. వీటిలో మనుషులు చాలా తరచుగా సంచరిస్తూ ఉంటారు. మనుషులంటే వాటికీ చాలా భయం_' అన్నాడు లక్ష్మణుడు.

చిన్నపిల్లలకు వచ్చే సందేహాల్లాంటివి గోపి, శంకరం చాలా అడుగుతున్నారు. అన్నింటికీ లక్ష్మణుడు ఓపిగ్గా సమాధానాలు చెపుతున్నాడు.

అందరూ గహలోంచి బయటకు వచ్చారు. ఎదురుగా పచ్చనిచెట్లు!

లక్ష్మణుడు ముందుకు దారితీస్తుంటే_ "నువ్వు చాలా తరచుగా ప్రయాణం చేస్తుంటావా?" అనడిగాడు గురువులు. తాము నడుస్తున్న దారిని గుర్తుపెట్టుకోవడానికి ప్రయత్నిస్తున్నాడతను.

"అవునండి! ఈ దారంటే నాకు కొట్టినపిండి!" లక్ష్మణుడు గర్వంగా అన్నాడు.

మళ్ళీ కొండ గుహ. అంతా అందులో ప్రవేశించారు. ఇది కాస్త చీకటిగా ఉంది. గురువులు బ్యాటరీ లైటు వెలిగించాడు. ఈ గుహ ఇందాకటి దానిమీద ఇరుగ్గా ఉంది.

'ఈ దారి చాలా తమాషాగా ఉంది. ఎలా తయారు చేశారు!' అన్నాడు గురువులు.

'మేం తయారు చేయలేదు. వెతికి పట్టుకున్నాం. గంగాపురానికి దగ్గరదారి ప్రమాదాలు లేని దారి.... అన్నాడు లక్ష్మణుడు

'ఒక్క విషయం అడుగుతాను. మీ అటవికులు నాగరికతకు దూరంగా ఉండాలని ఎందు కనుకుంటున్నారు

మీరు మా అందరితోపాటు కలిసి ఉండొచ్చు గదా!

"మా ఆచారాలు వేరు నాగరకుల ఆచారాలు వేరు. మమ్మల్ని మూర్ఖులుగా తలుస్తారుమీరు. మీ ఆచారాలు కూడా చాలావరకు మూర్ఖంగానే ఉంటాయి. కానీ మీ దగ్గర బలం ఉంది కొత్తకొత్త ఆయుధాలున్నాయి. ఆకర్షణలున్నాయి. వాటి సాయంతో మమ్మలి. జయించి మా ఆచారాలను మంటగలిపేస్తారని మా భయమ్ని మా జీవితం మాకు బాగానే ఉంది. మా అలవాట్లనూ., ఆచారాలనూ నిలుపుకోవాలని మా తాపత్రయం. అందుకే మేము నాగరికతకు పైనంత దూరంగా ఉంటున్నాం-" అన్నాడు లక్ష్మణుడు.

రామం ఆశ్చర్యంగా అతడి మాటలు విన్నాడు. అందులో నిజముందనిపించింది. మంచియినా చెడ్డయినా ప్రతిజాతికి కొన్ని నమ్మకాలుంటాయి. ఆ నమ్మకాలను దెబ్బతీసేవారికి దూరంగా ఉండడానికి ప్రయత్నిస్తుంది ప్రతిజాతీకూడా.

'నాగరికుల్లో లేనివీ మీ జాతిలో ఉన్నవీ మంచి లక్షణాలేమిటి?" అన్నాడు రామం.

'చాలా ఉన్నాయి మాలో ఎక్కువతక్కువలు లేవు. అంతా సమానమే! మాకోనాయకుడుంటాడు. శక్తిని బట్టి నాయకుడవుతాడు. అందరికంటే శక్తి వంతుడు నాయకుడవుతాడు. మాలో మోసాలుండవు. అన్యాయా లుండవు. ఆడదాన్ని వంటింట్లో పెట్టి బంధించం. అందరికి స్వేచ్ఛ ఉంది. ఆడది పరాయి మగవాడి తో ఉంటే చెడిపోయిందనుకోము. ఆమె ఇష్టానికి విలువ ఇస్తాము. అందరికీ ఒకటే న్యాయం! మా జాతిలో

ఎవ్వరూ తిండి లేక మాడరు. కష్ట సుఖాలు సమిష్టిగా భరిస్తాం !' అన్నాడు లక్ష్మణుడు.

ఇవన్నీ చెబుతూంటే లక్ష్మణుడి కళ్లు మెరిశాయి. తన సంస్కృతి ఎంతో గొప్పదనీ, ఆ విషయాన్ని నలుగురు గుర్తించడం లేదనీ, వాడు భావిస్తున్నాడు.

గుహలోంచి మళ్ళీ పచ్చటి అరణ్యంలోకి వచ్చారు. వారి ప్రయాణం అలాగున సాగిపోతూనే ఉంది. చెప్పుకో దగ్గ సంఘటనలు లేవు. మధ్యలో ఆటవికుడు వారి కోసం మంచి మంచి ఫలాలు తెచ్చి ఇచ్చాడు. అక్కడక్కడ వారు తాగిన వాగుల్లోని నీరు అమృతంలా అనిపించింది.

'ఫలాలకు గానీ, నీటికి గానీ ఇటువంటి రుచి నాగరిక ప్రాంతంలో ఉండదు.' అన్నాడు లక్ష్మణుడు. అతడి మాటలు నిజమేనని అందరికీ అనిపించాయి. పట్నాలకు మించి పల్లెలు, పల్లెలకు మించి అడవులు-నివాసయోగ్యమైనవి. కానీ నాగరికత పట్నాలవైపే పరుగు తీస్తుంది. అందులో ఆశ్చర్యం లేదు. మనిషి జంతువులా మసల లేడు. అతడికి మేధ ఉంది. జంతువులరణ్యాల కోసం తపిస్తాయి. మనిషి పట్నాల కోసం తపిస్తాడు. అరణ్యంలో జీవించే మనుషుల విధానాల్లో జంతు విధానాలు గోచరిస్తాయి. పట్నంలో నివసించే మనుషుల జీవిత విధానాల్లో జంతు విధానా లుండవచ్చు కానీ అవి బహిరంగంగా అనిపించవు.

అంతా ఉత్సాహంగా ప్రయాణం చేయడంవల్ల. సాయంత్రానికే వారు ఆటవిక ప్రాంతాన్ని చేరుకున్నారు

( సశేషం )



# క్రైమ్‌లో తమాషాలు

ఈ శీర్షికలో ప్రచురించబడే ప్రతి రచనకు, 'అనవ'లో ప్రచురించబడే ప్రతి జోక్‌కు రు.5/-లు పారితోషికం పంపబడుతుంది. —ఎడిటర్.

## పచ్చిమిరపకాయ మహాత్యం ?

ఇద్దరు అమెరికా డిటెక్టివ్ యువకులు బొంబాయిలోని ఒక హోటల్లోకి వెళ్ళారు. సర్వరు వాళ్ళముందు పచ్చి మిరపకాయలు, టమాటో ముక్కలున్న ఒక ప్లేటుపెట్టి, బిల్లు తేవటానికి మరోవైపు వెళ్ళాడు.

ఆ ఇద్దరిలో ఒకడు పరధ్యానంగా ఒక పచ్చిమిరపకాయ తీసుకున్నాడు. అంతక్రితం వాళ్ళెప్పుడూ పచ్చిమిరప కాయను చూసి ఎరగరు.

అతడు మిరపకాయను అటుఇటూ త్రిప్పిచూసి, నోట్లోవేసుకుని నెమ్మదిగా నమలటం ప్రారంభించాడు. కానేపటిలో పచ్చిమిరపకాయ తన మహాత్యాన్ని చూపించే సరికి ఒకటే మంటతో అతని కళ్ళల్లోంచి ధారగా నీళ్ళు కారసాగాయి.

అతడిలో కలిగిన ఆహటాత్ పరిణామాన్ని చూపి, "అరె ! ఎందుకేడుస్తున్నావ్ ? ఏంజరిగింది ?' అని ప్రశ్నించాడు రెండవవాడు.

మొదటివాడు అసలు విషయం దాచి వెక్కిళ్ళు పెడుతూ, "అమెరికాలో ఒక ఉద్యమం చెలరేగినప్పుడు

మా తాతగారిని ఒకడు నడి బజార్లో కాల్చిచంపాడు. ఆయన గుర్తుకొచ్చాడు" అన్నాడు.

రెండు నిమిషాలనంతరం-రెండవవాడు కూడా మిరప కాయను నోట్లోవేసుకుని నమలటం ప్రారంభించాడు. కాసేపట్లో అతని పరిస్థితికూడా దయనీయంగా తయారైంది

అది చూసి మొదటివాడు "ఇప్పుడు నువ్వెందు కేడుస్తున్నావ్ ?' అని అడిగాడు.

రెండవవాడు కళ్ళొత్తుకుంటూ 'వాడు మీతాతతో పాటు నిన్నుకూడా ఎందుకు కాల్చిచంపలేదా-అని ఏడుస్తున్నా' అన్నాడు.

—చదరం వెంకటరమణ
నారాయణపురం.

## గాడిద ? ?

ఒక డైరెక్టరు సినిమా షూటింగు జరుపుతున్నాడు. ఒక 'గాడిద' ఆ షూటింగులో కావాల్సి వచ్చింది. అసిస్టెంటు డైరెక్టరుతో "వెంటనే గాడిదను తీసుకురా. వెళ్ళు, వెళ్ళు." అని అన్నాడు.

అసిస్టెంటు డైరెక్టరు ఉరుకుల పరుగులతో వెళ్ళాడు. కొద్ది సేపైన తర్వాత ఒక మనిషిని పిలుచుకు వచ్చాడు. అతడు నిర్మాత !

—చాగాపురం నాగేశ్వరరావు
మల్దకల్.

## "నక్సలైట్"

ఎర్రని అక్షరాలతో 'పోలీస్ స్టేషన్' అని రాయబడిన ఆ స్టేషన్‌లో ఒక కర్ర కుర్చీలో సబ్‌యినస్పెక్టరు

కూర్చొని వున్నాడు. అతను తొడుక్కున్న బట్టలు కరడు కట్టిన మానవత్వానికి నిదర్శనంగా ఉన్నాయి.

అన్యాయానికి సింబల్‌లా ఎర్రని టోపీని నెత్తిన ధరించి ఓ పోలీసు యాంత్రికంగా ప్రవేశించి ఇనస్పెక్టర్ని చూడటంతోనే 'కీ' యిచ్చిన బొమ్మలా సెల్యూట్ చేసి "తమరి అమ్మాయి వెంటతిరిగేది రాజన్ అనే స్టూడెంట్ కుర్రాడు సార్ !" అన్నాడు.

"ఇంటి అడ్రెస్ తెలుసుకున్నావా ?" కరడు కట్టిన మానవత్వం.

"తెలుసుకున్నాన్ సార్ !" అన్యాయానికి సింబల్.

"ఈ నైట్‌కే రైడింగ్-రడీగా వుండండి"

'ఓ. కే. సార్ !'

అర్ధరాత్రి —

సమయం పది నిముషాలు తక్కువ పన్నెండు.

సబ్‌యినస్పెక్టరు, పదిమంది పోలీసులు రాజన్ ఇంటి తలుపు తట్టారు.

రాజన్ తలుపు తీసి పోలీసుల్ని చూసి ఆశ్చర్యపోయాడు.

సబ్‌యిన్‌స్పెక్టరు ఉపోద్ఘాతం ఏమీ లేకుండా 'రాధను అల్లరి పెడుతుంది నువ్వేనా ?' అన్నాడు.

రాజన్‌కి విషయం అర్థమైంది. అందుకే స్థిరంగా "తప్పు. నేను రాధను అల్లరి పెట్టడం లేదు. ఆరాధిస్తున్నాను," అన్నాడు.

'రాధ ఒక సబ్‌యినస్పెక్టరు కూతురని తెలుసా ?'

'తెలుసు'

'తెలిసుండి ఒక యినస్పెక్టరు కూతుర్ని ప్రేమించ

దానికి నీ కెన్ని గుండెలు.'

'ప్రేమించడానికి ఒక్క గుండె చాలు'

అంతే, రాజన్ చెంప చెళ్ళుమంది. ఇద్దరు పోలీసులు రాజన్ చేతులు విరిచి పట్టుకోవటం, మరో ఇద్దరు పోలీసులు తాళ్ళతో రాజన్ చేతులు కాళ్ళు కట్టివేయటం అందరూ కలసి రాజన్‌ని జీపులో పడవేయటం, ఆ జీపు శ్రీకాకుళం సివారు అడవులకేసి దూసుకుపోవటం చక, చకా జరిగిపోయాయి.

ఒంటిగంటకు జీపు అడవి మధ్యకు చేరింది.

రాజన్‌న్ని ఓ చెట్టుకు కట్టివేశారు.

సబ్ ఇనస్పెక్టరు చేతిలోని పిస్టల్ ఆకలిగొన్నసింహంలా గర్జించింది.

'ధన్' మంటూ గుండు రాజన్ గుండెలోకి దూసుకు పోయింది.

ఈ అన్యాయం ఎంతకాలం అంటూ అరణ్యం నిశ్శబ్దంగా రోదించింది.

రెండు రోజుల తరావాత పేపర్లో ప్రకటన —

మొన్న హఠాత్తుగా శ్రీకాకుళం సివారు అడవుల్లో పోలీసులకు నక్సలైట్లకు మధ్య జరిగిన కాల్పుల్లో నలుగురు పోలీసులు గాయపడ్డారు. రాజన్ అనే తీవ్రవాది మరణించాడు. అతవి వద్ద కొంత మందుగుండుసామగ్రి, మావోసాహిత్యం దొరికింది.'

[ "అమర జీవి రాజన్ జ్ఞాపకార్థం" ]

— పి. ఎస్. రాజు

నుగ్రిపూడి

# ఘోర్ద రీ!

ఎండాకాం సెలవుల్లో హెడ్‌మాస్టర్ రంగనాధం గారు చని పోయారు. ఆయనకివ్వాల్సిన జీతం బకాయికొంత ఇంకా ఆయన భార్య కివ్వకుండ మోసం చేస్తున్నట్లు తెలిసింది బడిపిల్లలకు. గోలచేశారు. సెక్రటరీని గెరావో చేశారు. సమ్మెదాక వచ్చింది విషయం. స్కూలు ఇన స్పెక్టర్, పోలీసు ఇనస్పెక్టర్ కూడ వచ్చారు.

మార్చినెలలో హెడ్ మాస్టర్‌గారే ఆ డబ్బు తీసుకు న్నారని అంటున్నారు సెక్రట్రీ. మే నెలలో చని పోయే ముందురోజు కూడ 'ఇంకా రెండువేలు రావలసి వున్నద'ని రంగనాధం గారన్నారని ఆయన భార్య అంటుంది.

ఒకరోజు డి.ఇ.ఓ. గారువచ్చారు. పిల్లలు జీపును చుట్టు ముట్టేసారు. గత్యంతరం లేక డి.ఇ.ఓ. గారు జీతాలపట్టీని గ్రౌండులో ఒక మేజాపై తెరచియుంచి "అనుమానమున్న పిల్లలందరు వచ్చిచూడొచ్చు. అన వసరంగా అల్లరుచేస్తే కఠినచర్య తీసోక్క బడును' అన్నారు.

ఏదో ప్రదర్శన చూస్తున్నట్లు క్యూ వరుసలో పిల్ల లందరు హెడ్ మాస్టర్ సంతకం చూస్తున్నారు. ఆమె అబద్దాలాడుతుందేమోనన్న అనుమానం వచ్చింది, అందరికి.

ఆఖరున ఐదవ తరగతి సి. పి. ఎల్ రమ్మి వంతు వచ్చింది. సంతకం చూడగానే 'ఇది దొంగసంతకం.' అని అరిచింది

"అసలు సంతకం ఇదివరలో చూశావా?' అడిగా డొక టీచర్ హేళనగా.

"నేను అసలు సంతకం చూడలేదు. కాని యిది దొంగ సంతకం" మళ్ళీ నొక్కి చెప్పింది.

"అమ్మాయ్, ఇది ఫోర్జరీ అని నిరూపించ గలవా?" అడిగారు డి.ఇ.ఓ. గారు.

"నిరూపిస్తే ఆమెకు డబ్బులు ఇప్పుడే ఇస్తారా?" ఎదురు ప్రశ్న వేసింది,

"తప్పకుండ ఇప్పుడే ఇస్తాను" హామీ యిచ్చాడు సెక్రటరీ.

రమ్మి నాలుగు పేజీలు అటు యిటు తిప్పింది.

"ఇదిగో చూడండి. ఈ రిజిస్టర్‌లో మార్చి నెల పేజీలో రెవిన్యూ స్టాంపులు పైన ఆంగ్లంలో ఇండియా అని క్రింద హిందీలో భారత్ అని వుంది. జూలై నెల పేజీ చూడండి. పైన హిందీలో భారత్ అని క్రింద ఆంగ్లంలో ఇండియా అని వుంది. ఈ కొత్త హిందీ స్టాంపులు జూన్ నుండి పోస్టాఫీసులో అమ్ముతున్నారు. మరి. మే నెలలో చని పోయిన హెడ్ మాస్టరు జూన్ నెల విడుదల అయిన స్టాంపు పైన మార్చి నెలలో ఏలా సంతకం పెట్టగలరు. అడిగింది.

ఏదో వింత వస్తువును చూస్తున్నట్లు అందరు రమ్మిని, స్టాంపులను మార్చి మార్చి చూసారు....

పారి పోతున్న హెడ్ గుమాస్తాను పట్టుకున్నారు. సెక్రటరీ మాట తప్ప కుండ డబ్బు తెప్పించేసాడు.

"ఇంత చిన్న వయసులో స్టాంపులవివరాలు డిటెక్షన్ తెలివిఎలా వచ్చిందీఅమ్మాయికి ఆశ్చర్యపోయారందరూ.

„మా యింట్లో అందరం స్టాంపులు సేకరిస్తాము. మా నాన్న రోజు రాత్రి అపన కథలు వినిపిస్తారు. గర్వంగా జవాబిచ్చింది రమ్మి.

—దామెర్ల కృష్ణమూర్తి, నెల్లూరు'

## సూక్ష్మదృష్టి

రాత్రి పదకొండు గంటలయింది.

ఎస్సయి మధుసూధన్ పోలీసుస్టేషన్లో కూర్చొని ఏదో మర్డర్ కేసుకు సంబంధించిన ఫైలును సీరియస్‌గా చదువుకుంటున్నాడు.

అతనికి ఎదురుగా నున్న కుర్చీలో అతని మిత్రుడు మల్లిబాబు కూర్చుని వున్నాడు.

ఇంతలో పెట్రోలింగ్ వాన్ స్టేషన్ ముందు ఆగింది అందులో నుండి ముప్పైయ్యేళ్ళ వ్యక్తిని పోలీసులు క్రిందకు దింపి, స్టేషన్లోకి లాక్కువచ్చేరు.

ఈగొడవకి ఎస్సయి ఫైల్సులో నుండి బైటపడుతూ "ఏమిటోయ్ గొడవ ?" అని హెడ్‌కానిస్టేబుల్ రంగనాథాన్ని ప్రశ్నించాడు.

'సార్' ఈ వ్యక్తి సేఠ్‌రామాలాల్ వీధిలో తచ్చాడుతుంటే అనుమానం మీద పట్టుకువచ్చేం" అని చెప్పేడు హెడ్ కానిస్టేబుల్.

తల పంకించాడు మధుసూధన్.

'మిస్టర్ నీ పేరేమిటి ?"

'హరిప్రసాద్'.

"ఇంత రాత్రి పూట ఆ వీధిలో ఎందుకు నువ్వు తిరుగుతున్నావ్ ?"

# "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ

ఈ నెల, ''సప్లిమెంటు'' ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్టుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని, పోస్టుకార్డు పైగాని తెల్ల కాగితంపై వ్రాసి, 7వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

హోమ్ డెలివరీ సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి. సభ్యులు కానివారు తమ వ్యాఖ్యలతో 50 పైసల స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 25/–లు నగదు బహుమతి పంపుతాము.

## 'హోమ్ డెలివరీ"

మీరు హోమ్ డెలివరీ సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంటు రెండూ కలిపి రు. 8/లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి. పి ద్వారాగాని మీ ఇంటి దగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే

మీరు చేయవల్సిందల్లా రు. 5/లు పంపి హోమ్ డెలివరీ సభ్యత్వము పొందటమే.

హోమ్ డెలివరీ వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా త్వరితంగ చేరుతాయి, మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీల కోసం మీరు ఏజెంటు చుట్టు తిరగ నవసరము వుండదు. కాపీలు దొరక లేదనే నిరాశ. పోస్టులో పోయే సమస్య, ఎంత మాత్రం లేదు.

నెల నెలా వి. పి తీసుకోవడం కష్టమనుకునేవారు. ఏడాది పైకము రు. 80 లు ముందుగా పంపవచ్చును.

"నేను నేవీలో పని చేస్తున్నానుసార్। తోవ మరచి పోయాను..కొత్తగా ఈ ఊరికి ట్రాన్స్‌ఫర్ కావడం వలన త్రోవలు సరిగ్గా తెలియవు. సమయానికి, రిక్షాలు కూడా లేవు. రిక్షావాళ్ళు స్ట్రయిక్ చేస్తున్న సంగతి మీకు తెలిసిందే కదా।" అన్నాడు.

''ఐసీ.'' తలవూపేడు మధుసూధన్.

సిగరెట్ వెలిగించుకుని, రెండు దమ్ములు లాగి ఆ వ్యక్తి వైపు సూటిగా చూశాడు.

హిప్పీ జుత్తుతో, ఛామన ఛాయరంగులో, భారీగా మంచి ఆకర్షణీయంగా నేవీ యూనిఫారంలో వున్నాడా వ్యక్తి.

ఏదో మెరుపు మెరిసినట్లయింది మధుసుధన్‌కి.

"ఏయ్ కానిస్టేబుల్। ఈ వ్యక్తిని తీసుకెళ్ళి లాకప్‌లో పడెయ్యి." అన్నాడు గంభీరంగా.

ఆ వ్యక్తి నీరైపోయాడు.

"సార్। నేను నేవీలో పనిచేస్తున్నాను. నన్ను అరెస్ట్ చెయ్యడం అన్యాయంసార్। కావాలిస్తే, నా ఐడెంటిఫికేషన్ కార్డును చూడండి.'' అంటూ జేబులోనుండి కార్డు తీయబోయాడు.

"షటప్. ముందు వీడ్ని లాకప్‌లో పడెయ్యండి." గర్జించాడు ఏస్పీయి మధుసుధన్

కానిస్టేబులు ఆ వ్యక్తిని తీసుకొని వెళ్ళిపోయాడు.

'నేవీ లో పనిచేసే వ్యక్తుల్ని వాళ్ళ అధికారి అనుమతి లేకుండా అరెస్టు చెయ్యకూడదు కదా....' అన్నాడు మల్లిబాబు.

మల్లిబాబు అనుమానం మధుసూధన్‌కి అర్థమయింది.



'అఫ్ కోర్స్. కాని, ఈ వ్యక్తి 'నేవీ' లో పనిచేసే వ్యక్తి కాదు '

'మరి అడ్రస్సు,' ఐడెంటిఫికేషన్ కార్డు ?.

'అవన్నీ, ఇతరుల్ని మభ్య పెట్టడానికి."

'అంత గ్యారంటీ మీరు ఎలా చెప్పగలరు ? అతడు నేవీ వ్యక్తి అయితే మనం చిక్కుల్లో పడతాం గదా ?"

మల్లిబాబు మాటలకు చిరునవ్వు నవ్వేడు మధుసూధన్.

"నేవీ వ్యక్తులకు జుత్తు బాగా తగ్గించి వుంటుంది. జుత్తును ఏమాత్రం ఎక్కువగా పెంచినా అధికారులు వొప్పుకోరు. జుత్తు చెవిదాటడానికి వాళ్ళరూల్స్ వొప్పుకోవు. మనం అరెస్టుగావించిన వ్యక్తిది హిప్పీ క్రాఫింగ్. అర్థమయిందా!' చిద్విలాసంగా నవ్వుతూ అన్నాడు.

మధుసూధన్ తెలివితేటలకు మళ్లి బాబు మనసులోనే జోహార్లర్పించాడు.

మర్నాడు, ఇంట్రాగేషన్‌లో ఆ వ్యక్తి మాజీనేరస్తుదని, యిటీవల నగరంలో అక్కడక్కడ జరిగినదొంగతనాలకు అతడే కారకుడని, నేపీ వ్యక్తి కానే కాదని ఋజువయింది. —కె. ప్రభాకరదేవ్, శ్రీకాకుళం.

## గాడిదకు వైద్యం !

ఒక చాకలివాని గాడిదకు జలుబుచేసింది. అతడు వెటర్నరీ డాక్టరు దగ్గరకు దానిని తీసుకువెళ్ళాడు. డాక్టరు దాన్ని పరీక్షించి జలుబు తగ్గడానికి గోలీలు ఇచ్చాడు. "వీటిని ఎలా తినిపించాలి." అని అడిగాడతడు.

ఒక గొట్టము ఇస్తూ "గాడిద నోటిలో గొట్టముంచి గోలీలను దాంట్లో వేసి ఊదు. మందుగోలీలు గాడిద కడుపులోకి వెళ్ళిపోతాయి." అన్నాడు డాక్టరు. అతడు వెళ్ళిపోయాడు. మరురోజు మళ్ళీ వచ్చాడు. "జలుబు తగ్గిందా?" అని అడిగాడు.

"లేదు."

"ఎందుకు? తినిపించలేదా?"

"మీరు దానోట్లో గొట్టముంచి ఊదమన్నారు-కదా? కానీ అదే మొదలు ఊదింది. గోలీలు-నా కడుపులోకి పోయాయి." అన్నాడు విచారంగా అతడు.

—చాగాపురం నాగేశ్వరరావు' మల్లకల్.

Edited and Published by S. Damodar Reddy
3-4-554 Narayanaguda Hyderabad-500 029,
and Printed at Graphic Seva
Hyderabad-500004.

